# విజ్ఞప్తి

తిరుమంగై ఆళ్వార్లు అనుగ్రహించిన ఆఱు ప్రబంధాలలో పెరియతిరుమడల్ ఒకటి. ఇందులో ఆళ్వార్లు మడల్ ఎత్తే ద్రావిడాలంకార ప్రక్రియను అర్చామూర్తి విషయంగా అన్వయించి అనుగ్రహించారు. శిఱియతిరుమడల్‌ను విభవావతార పరంగా అనుగ్రహించారు. విభవావతార విషయంగా పల్కిన శిఱియ తిరుమడల్ తర్వాత అనుగ్రహింపబడింది- ఈ పెరియతిరుమడల్ ప్రబంధం. నాయకుడు లేక, నాయకి, తాను కోరిన వ్యక్తిని పొందలేని రోషంవల్ల, ఆర్తివల్ల ఆ వ్యక్తిని, అతని నిరాదరణను లోకం అంతా నిందించేటట్లుచేసి, తద్వారా ప్రియుని, లేక, ప్రియురాలిని పొందే అతిమాత్రప్రవృత్తియే ఈ మడల్ ప్రక్రియ. తిరుమంగై ఆళ్వార్ పరకాల నాయకీ భావంతో ఈ అతిమాత్రప్రవృత్తిని భగవానునిపట్ల ప్రదర్శించారు. ప్రేమ ఉత్కూలం అయినపుడు స్వరూపంకూడా మఱుపుకు రావడం సహజం. కనుక ఇటువంటి ప్రవృత్తిలో ప్రవేశించడంకూడా సహజమే. మడల్ ఎత్తడం, నోము నోచడం, మంగళాశాసనం చేయడం- ఇత్యాదులు జ్ఞానం పండగా ఏర్పడిన భక్తి యొక్క ఆధిక్యంచేత కలిగే అజ్ఞాన మూలంగా ఏర్పడేవి కనుక శ్లాఘ్యతమాలు- అని అభిజ్ఞులైన ఆచార్యుల నిర్ణయం. నమ్మాళ్వార్లుకూడా **"మడలూర్‌తుమే"** అని అంటూ ఈ అతిమాత్రప్రవృత్తిలో తమకు గల ఆభిముఖ్యాన్ని తెలిపారు. ఈ మడల్ ప్రక్రియకు సంబంధించిన విశేషాలు, సాంప్రదాయికమైన రస్యార్థాలు ఎన్నో ఉన్నా, విస్తరభీతివల్ల, వ్యాఖ్యానంలో చాలవరకు అవి గతార్థాలు అయినందున ఇక్కడ ప్రస్తావించడం లేదు.

ఈ మడల్ ప్రబంధానికి పరమకారుణికులైన శ్రీపెరియవాచ్చాన్ పిళ్ళై అనుగ్రహించిన పరమ గంభీరమైన మణిప్రవాళవ్యాఖ్య, అళ్ళకియ మణవాళ ప్పెరుమాళ్ నాయనార్ అనుగ్రహించిన విశదమైన విద్వద్వేద్యమైన మణిప్రవాళవ్యాఖ్య ఉన్నాయి. ఈ రెండు వ్యాఖ్యలను అనుసరిస్తూ శ్రీసుదర్శన పత్రికాధిపతి, ఉ.వే. **శ్రీమాన్ ఎస్.కృష్ణస్వామి అయ్యంగార్ స్వామివారు** ద్రావిడంలో రచించిన వివరణాన్ని కృతజ్ఞతాపూర్వకంగా అనుసరిస్తూ ప్రస్తుత ఆంధ్రవివరణం వ్రాయబడింది. తమ ప్రచురణలను అన్నిటినీ ఆంధ్రీకరించడానికి, ప్రచురించడానికి అనుమతించిన

శ్రీమాన్ ఎన్. కృష్ణస్వామి అయ్యంగార్ స్వామివారి సన్నిధిలో కృతజ్ఞతలను విన్నవించుకుంటూ ప్రణమిల్లుతున్నాను. శ్రీ ప్ర.భ. అణ్ణాస్వామివారి దివ్యార్థదీపికలోని పెరియ తిరుమడల్ తాత్పర్యసంగ్రహాన్నికూడా అనువదించి ఇందులో చేర్చాను. ఈ ప్రబంధం ఉ.వే. **శ్రీమాన్ కాందూర్ తిరునారాయణపురం రాఘవన్‌స్వామి, శ్రీమతి మంగవల్లి అమ్మంగార్ పుణ్యదంపతుల శతాభిషేకమహోత్సవ జ్ఞాపికగా** వారి కుమారులైన **శ్రీమాన్ రంగనాథన్ స్వామి, శ్రీమాన్ సుందరరాజన్ స్వామివార్లచే** ప్రకాశింపచేయబడుతున్నది. ఈ విధంగా తమ తల్లితండ్రుల విషయంలో స్వరూపానురూపమైన కైంకర్యాన్ని చేసికొంటున్న వీరిరువురుని నేను మనసార అభినందిస్తున్నాను. ఈగ్రంథప్రచురణకు ప్రోత్సహించిన **భాగవతశేఖరులు శ్రీమాన్ స్వామిదాస్** (హైదరాబాద్) గారికి అనేకస్వరూపానురూప మంగళాశాసనాలు. నాకు అన్నివిధాల మార్గదర్శనాన్ని చేసి ఆశీర్వదించిన **పితృపాదులు, న్యాయవేదాంత విద్వాన్,** ఉ.వే. శ్రీమాన్ ఈ. **రంగాచార్యస్వామివారి** సన్నిధిలో సవినయంగా ప్రణమిల్లుతున్నాను. శ్రీలక్ష్మీనారాయణస్వామి కోవెల (సికింద్రాబాద్) లో 15-1-2011 తేదీన జరగబోయే గోదాకల్యాణ మహోత్సవంలో ఈ సద్గ్రంథ ఆవిష్కరింపబడడం కూడా చాలా సముచితం. సకాలంలో గ్రంథాన్ని డిటిపి చేసి సహకరించిన శ్రీమతి జయలక్ష్మిగారికి, శ్రీచంద్రశేఖర్‌గారికి, అందంగా ముద్రించిన శ్రీహర్షవర్ధన్‌గారికి (సి.ఎన్. ప్రింటర్స్) కృతజ్ఞతలు. హంసక్షీరన్యాయంలో ఇందులోని దోషాలను విడిచి, గుణాలను గ్రహించవలసినదిగా సహృదయబుధులను వేడుతున్నాను. స్వస్తి.

**బృహత్వాళీసమారోహప్రబంధస్య కలిద్విషః ।**
**వ్యాఖ్యేయ మాంధ్రభాషాయాం శింగరార్యేణ నిర్మితా ॥**

**భక్త్యా శతాభిషేకాఖ్యే రాఘవన్‌స్వామినాం మహే ।**
**తత్సుతాభ్యాం కృతార్థాభ్యాం గ్రంథోఽయం సంప్రకాశ్యతే ॥**

తిరుపతి, ఇట్లు
5-01-2011 భాగవతవిధేయుడు

ఈ.ఏ. శింగరాచార్యులు



# తిరుమంగై యాళ్వార్ వైభవసంగ్రహం

(శ్రీమాన్ ఎస్. కృష్ణస్వామి అయ్యంగార్ ద్రావిడకృతికి ఆంధ్రానువాదం)

వృశ్చికే కృత్తికాజాతం చతుష్కవిశిఖామణిమ్ ।
షట్ప్రబంధకృతం శార్ఙ్గమూర్తిం కలిహ మాశ్రయే ॥

(కార్తికమాసంలో కృత్తికానక్షత్రంలో అవతరించినవారు, "నాలుకవి ప్పెరుమాళ్" అని అనబడేవారు, ఆఱు దివ్యప్రబంధాలను అనుగ్రహించినవారు, శార్ఙ్గమనే భగవానుని వింటియొక్క అంశ అయిన "కలికన్రి" అనబడే తిరుమంగై యాళ్వార్లను ఆశ్రయిస్తున్నాను)

పరకాలహరిం వందే హరిపాదగుహాశయమ్ ।
ఉన్మత్తప్రతికూలేభకుంభసంభేదవిభ్రమమ్ ॥

నాదప్రసభసంత్రస్తశైవశాక్యాదిదుర్ద్విపమ్ ।
పరకాలమృగేంద్రం త్వాం ప్రపద్యేఽచ్యుతవందినమ్ ॥

(పరమపురుషుని శ్రీచరణాలనే గుహలో శయనించి ఉండేవారు, మదాన్ని కల బాహ్యమతస్థులనే గజాల కుంభస్థలాలను పగులగొట్టడం క్రీడగా కలవారు, పరకాలురనబడే సింహానికి నమస్కరిస్తున్నాను. శైవ-బౌద్ధాది దుష్టగజాలను తమ గర్జనలతో చాలా భయపడేటట్లు చేసినవారు, అచ్యుతుని సేవించేవారు అయిన పరకాలురనే సింహానికి ప్రపత్తి చేస్తున్నాను)

సుధాగానాబ్దానాం కలియుగభవానా మపగమే
నళే వర్షే మాసే శరది చరమే దైవతగురోః ।
దినే తారే వహ్నేః శిశిరకిరణే పూర్ణిమజుషి
క్షితా వావిర్భూతః కలిరిపు రమేయాత్మమహిమా ॥

(కలియుగంలో "సుధాగా" అనే పదంలోని వ్యుత్క్రమంలో అక్షరాలచేత నిర్దేశింపబడే 397 సంవత్సరాలు గడచిన తరువాత, నలనామ సంవత్సరంలో శరదృతువులో రెండవమాసం అయిన కార్తికమాసంలో గురువారంనాడు అగ్నినక్షత్రమైన కృత్తికానక్షత్రంలో, చంద్రుడు పూర్ణంగా వెలిగే పౌర్ణమీతిథినాడు అంతులేని మహిమను కల "కలికన్రి" అనబడే తిరుమంగై ఆళ్వార్లు ఈ భూమిలో అవతరించారు.)

**సమజాయత తత్ర శాబరప్రముఖః కశ్చన నీలనామకః ।**
**పురుషోత్తమకార్ముకాంశజః స్ఫురితే కార్తికకృత్తికోడుని ॥**

(ఆ తిరుక్కుఱైయలూర్‌లో శాబరకులప్రముఖులై, భగవానుని శార్‌ఙ్గమనే వింటియొక్క అంశను కలవారై, నీలుడనే పేరును కలవారైన తిరుమంగై ఆళ్వార్లు వెలిగే కార్తికమాసంలోని కృత్తికానక్షత్రంలో అవతరించారు)

పైన పేర్కొన్న తనియన్ శ్లోకాలలో, వైభవశ్లోకాలలో పూర్వాచార్యులు అనుసంధించిన రీతిలో, గంగకంటే పవిత్రమైన కావేరీనది పలు పాయలుగా ప్రవహించి, బంగారాన్ని కొట్టుకొని వచ్చే అతిశయాన్ని కల్గిన చోళమండలంలోని తిరుమంగై అనే నాడులో తిరువాలి తిరునగరి అనే దివ్యదేశానికి చేరువలో ఉన్న తిరుక్కుఱైయలూర్‌లో, చతుర్థవర్ణంలో వ్యాధకులంలో, చోళప్రభువు సేనాపతికి కుమారుడై, కలియుగారంభమైన 398వ సంవత్సరంలో నలవర్షంలో కార్తికమాసంలో పౌర్ణమి, కృత్తికానక్షత్రాలతో కూడిన గురువారంనాడు శార్‌ఙ్గమనే విష్ణువుయొక్క అంశతో ఈ ఆళ్వార్లు అవతరించారు.

వీరు జన్మించినపుడే నీలమేఘవర్ణుడైన శ్రీకృష్ణునివలె నల్లని వర్ణాన్ని కలవారై జన్మించినందున వీరికి తండ్రి **"నీలన్"** అనే పేరు పెట్టారు. పెరిగిన తర్వాత తన కులానుగుణంగా ఆయుధవిద్యలలో ఆరితేరిన నీలుడు చోళరాజు కొలువులో సేనాధిపతిగా అమరి, పలు యుద్ధాలలో విజయాన్ని పొంది **"పరకాలుడు"** (శత్రువులకు యమునివంటివాడు) అనే కీర్తిని పొందారు. వీరి వీర్యశౌర్యాదులకు మెచ్చిన చోళరాజు వీరి తిరుమఙ్గైనాడుకు ప్రభువుగా, తనకు సామంతరాజుగా చేశాడు. అందువల్ల **"తిరుమంగైమన్నన్"** అనే పేరు వీరికి వచ్చింది. ఈ విధంగా ఒక చిన్న రాజ్యానికి ప్రభువై, **"ఇయల్, ఇశై, నాడకమ్"** అనే ముత్తమిழ்‌లో (త్రివిధ తమిళసాహిత్యంలో) అభిరుచిని కలవారై, నాల్గు పురుషార్థాలలోని మూడవది అయిన కామపురుషార్థంలోనే ప్రధానంగా దృష్టిని కలవారయ్యారు.

ఒకానొక సమయంలో ఆ తిరుమఙ్గైనాడులో గల **"తిరువెళ్ళక్కుళమ్"** (అణ్ణన్ కోయిల్) అనే దివ్యదేశంలో ఉండే ఒక తామరప్పొయ్‌కై (పద్మపుష్కరిణి)లోకి దేవకాంతలు పలువురు వచ్చి జలక్రీడలు ఆడుతున్నారు. వారిలో ఒకతె అయిన **"తిరుమామకళ్"** అనే దేవకాంత తన ఇచ్ఛతో తన దివ్యరూపాన్ని వీడి మానవ రూపాన్ని పొంది, తన సఖులకు దూరమై పుష్కరిణిని చేరి, అందులోని కుముద (కలువ) పుష్పాలను కోయసాగింది. అపుడు అక్కడకు వచ్చిన వైష్ణవవైద్యుడొకడు ఆమెను నీవెవరు? అని అడుగగా, ఆమె "నాతో వచ్చిన నా స్నేహితురాండ్రు అంతా నన్ను విడచి పోయారు. నన్ను మీరే కాపాడాలి'' అని వేడింది. సంతానహీనుడైన ఆ వైద్యుడు ఆమెను తన భవనానికి తీసికొని పోయి భార్యకు అప్పగించాడు. కలువ **(కుముద)** పూలను కోస్తూ ఆమె కన్పించినందున **"కుముదవల్లి"** అనే పేరును ఆమెకు పెట్టి పెంచాడు. ఆమెకు వివాహోచితవయస్సు రాగానే "రూపసౌందర్యం, గుణాలు అతిశయించి ఉండే ఈ దివ్యకాంతకు తగిన వరుని ఏవిధంగా అన్వేషించాలి ?'' అని కలతను పొందాడు. కామపురుషార్థంలోనే లగ్నమనస్కుడైన నీలుడు ఈమె రూపలావణ్యాన్ని, సౌందర్యాన్ని విని, తిరువెళ్ళక్కుళానికి వచ్చి ఆ వైద్యుని ఇంటికి చేరి అతనితో సంభాషిస్తూ ఉండగా, అపుడు అక్కడకు వచ్చిన కుముదవల్లిని చూచి, ఆమెపట్ల గొప్ప అనురాగాన్ని కల్గినవారయ్యారు. "ఈమెను నాకు భార్యగా చేయాలి'' అని అంటూ అమూల్య వస్త్రాభరణాలను బహుమానంగా ఇచ్చి ఆమె తండ్రిని ప్రార్థించారు. తల్లితండ్రులు అందుకు అంగీకరించినా, కుముదవల్లిమాత్రం అందుకు ఒక నియమాన్ని పెట్టింది. "తప్తచక్రాంకనం, తిరుమణ్ కాప్పు మొదలైన పంచసంస్కారాలను కల ఒక శ్రీవైష్ణవుని తప్ప ఇతరులను నేను వివాహమాడను'' అని తన మనస్సును తెల్పింది. దానిని వినిన వెంటనే తిరుమంగైమన్నన్ వేగంగా తిరునఱైయూర్ చేరి, అక్కడ ఉండే "నమ్బి'' అనే పేరును కల భగవానుని ప్రార్థించి, ఆ స్వామివద్దనుండి పంచసంస్కారాలను పొంది, పరమశ్రీవైష్ణవుడై తిరువెళ్ళక్కుళమ్‌కు తిరిగి వచ్చారు. మళ్ళీ కుముదవల్లి "మీరు సంవత్సరకాలంపాటు ప్రతిదినం వేయి ఎనిమిదిమంది శ్రీవైష్ణవులకు సమారాధనను చేసి, వారి భుక్తశేషాన్ని, శ్రీపాదతీర్థాన్ని స్వీకరిస్తే తప్ప మిమ్ములను నేను భర్తగా స్వీకరించను'' అనే నియమాన్ని పెట్టింది. ఆమె విషయంలోగల గాఢమైన ప్రేమవల్ల, పరకాలురు దానికి కూడా సమ్మతించి, శపథం చేసి ఆమెకు మాట ఇవ్వగా, వారిద్దరికి వివాహం జరిగింది.



ఆ పిమ్మట, తిరుమంగైమన్నన్ తాము ఒప్పుకొన్న నియమానుసారం ప్రతిదినం వేయి ఎనిమిదిమంది భగవద్భక్తులకు తదీయారాధనను చేయడం ఆరంభించారు. దానికి విరివిగా ధనం ఆవశ్యకం అయినందున తాను ప్రభువునకు చెల్లించవలసిన కప్పం సొమ్మునుకూడా వ్యయం చేశారు. దీనిని వినిన చోళరాజు "కప్పం'' తీసికొని రమ్మని తన సేవకులను తిరుమంగై మన్నన్ దగ్గరకు పంపాడు. తిరుమంగై మన్నన్ కూడా ఈనాడు, రేపు- అని అంటూ కప్పం కట్టడానికి ఆలస్యం

చేశారు. దీనిని తెలిసిన రాజు కొంతమంది వీరులను మన్నన్‌వద్దకు పంపి కప్పాన్ని కట్టమని నిర్బంధించాడు. తిరుమంగై మన్నన్ కోపించి ఆ వీరులను ఓడించి తరిమివేశారు. అది విని చాలా కోపించిన రాజు తన సేనాధిపతిని పిలచి, "నీవు పోయి పరకాలుని బంధించి తీసికొని రా'' అని పంపాడు. అతడు వచ్చి తిరుమంగై మన్నన్‌ను బంధించాలని ప్రయత్నించగా, వీరు **"ఆడల్‌మా"** అనే తమ అశ్వాన్ని అధిరోహించి తమ సేనతో బయలుదేరి, అతనితో యుద్ధం చేసి, అతడు యుద్ధరంగంలో వెన్నుచూపి పారిపోయేటట్లు చేశారు. దానిని తెలిసికొని చోళరాజు తన చతురంగబలంతో స్వయంగా వచ్చి తిరుమంగైమన్నన్ ఎదిరించాడు. మన్నన్ ఆ సేనను కకావికలం చేయడం ఆరంభించగా, ప్రభువు ఇతనిని ఉపాయంతో పట్టుకోవాలి తప్ప, వేఱుగా యుద్ధం చేసి పట్టుకోవడం వీలు కాదని గ్రహించి, తిరుమంగైమన్నన్ శౌర్యవీర్యాదులను ప్రశంసిస్తున్నట్లుగా పిలిచి, ఉపాయంగా తన మంత్రి వశం చేశాడు. "నాకు కట్టవలసిన కప్పాన్ని మాత్రం కట్టు; నిన్ను విడిపిస్తాను'' అని పల్కి మన్నన్‌ను ఒక దేవాలయంలో బంధించాడు. అక్కడ మన్నన్ ఆహారపానీయాలు లేకుండా మూడునాళ్ళు గడిపారు. కంచి వరదరాజ స్వామి వీరికి కలలో కన్పించి కంచికి వస్తే అక్కడ నిధి ఉన్నదని, కావలసినంత ధనం ఇస్తానని అన్నాడు. ఈ విషయాన్ని మన్నన్ మంత్రికి తెలుపగా, మంత్రి రాజును ఒప్పించి మంగై మన్నన్ తీసికొని కంచికి వెళ్ళాడు. కాని అక్కడ ఏ నిధి వారికి కన్పించలేదు. తిరుమంగై మన్నన్ దిగ్భ్రమను చెందగా అపుడు వరదరాజ స్వామి మళ్ళీ కలలో కన్పించి వేగవతినదీతీరంలో నిధి ఉండే చోటును చూపించాడు. ఆ చోటులో వెదకిన మన్నన్ అంతులేని నిధిని పొంది చోళరాజుకు కట్టవలసిన పైకాన్ని చెల్లించి, మిగిలిన ధనాన్ని భాగవతతదీయారాధనకు ఉపయోగించారు. మంత్రి జరిగిన సంగతిని చోళరాజుకు తెలుపగా, ప్రభువు చాలా ఆశ్చర్యపడి, మన్నన్‌ను పిలిపించి చాలా గౌరవించాడు. తన అపరాధాన్ని క్షమించమని వేడాడు. తనకు చెల్లించిన పైకాన్ని అంతటినీ తిరిగి ఇచ్చి, దానిని భాగవతతదీయారాధనకే ఉపయోగించమని అన్నాడు.

మఱి కొన్నాళ్ళకు తిరుమంగై మన్నన్‌కు మళ్ళీ భాగవతతదీయారాధనకు ద్రవ్యం చాలలేదు. "దారి కాని దారిలో అయినా ధనాన్ని సంపాదించి భాగవత సమారాధనను పూర్తి చేయాలి'' అని నిశ్చయించుకొని **"నీర్‌మేల్ నడప్పాన్", "నిழలిల్ ఒదుఙ్గువాన్, తాళూదువాన్, తోలా వழక్కన్"**- అనే నల్గురిని తమకు సహాయంగా చేసికొని, అడవిదారిలో దాగి ఉండి, ఆ దారిలో వచ్చే ధనికులను



కొల్లగొట్టి, ఆ ధనంతో భాగవతతదీయారాధన వ్రతాన్ని చేసి, వారి శ్రీపాదతీర్థాన్ని గ్రహించి, వారి భుక్తశేషాన్ని భుజించిన మాహాత్మ్యంవల్ల తమ సర్వస్వాన్ని భగవద్భక్తులకే వినియోగించిన వారయ్యారు.

ఇటువంటి చేతనునికోసమే అనాదికాలంగా ఎదురు తెన్నులు చూస్తున్న భగవానుడు, తిరుమంగై మన్నన్‌ను అనుగ్రహించాలని నిశ్చయించుకొన్నాడు. తిరుమంగై మన్నన్ దారి దోపిడీ చేసే దారిలో తాను, లక్ష్మీదేవి కలసి నూతన బ్రాహ్మణ వధూవరుల వేషాన్ని ధరించి, విలువైన వస్త్రాభరణాలను ధరించి వచ్చాడు. తిరువాలి తిరునగరికి సమీపంలో గల **"తిరుమణఙ్కొల్లై"** అనే చోట రావిచెట్టుకింద వేచి ఉన్న పరకాలురు ఆ దివ్యదంపతులను చూచి "ఈనాడు మనకు మంచి వేట దొరికింది'' అని సంతోషించి, వారిని చుట్టుముట్టి, వారు ధరించిన ఆభరణా లను అన్నిటిని కొల్లగొట్టేటపుడు, పెండ్లికుమారుని రూపంలో ఉన్న స్వామి కాలివేలిలో అలంకరించుకొన్న శ్రీసుదర్శలాంఛితమైన వలయాన్ని మాత్రం మన్నన్‌కు తీయడం సాధ్యం కాలేదు. దానినికూడా విడువకుండా తీసికొనిపోవాలని తలచి, మన్నన్ తమ దంతాలతో స్వామి పాదాన్ని పట్టి ఆ వలయాన్ని బలంగా కొఱికి తీయబోగా, ఆశక్తిని చూచి బ్రాహ్మణవరుని రూపంలోని స్వామి **"కలియనో!"** అని వీరిని సంబోధించాడు. అందువల్ల ఆ పేరు వీరికి స్థిరపడింది.

తరువాత కలియన్ తాను దొంగిలించిన ఆభరణాది వస్తువులను అన్నిటిని మూటకట్టి, మోసికొని తీసికొని పోవడంకోసం ఆ మూటను పైకి ఎత్తాలని చూడగా, గొప్ప బలం కలిగిన కలియన్‌కుకూడా అది పెద్ద పర్వతం అంత బరువుగా తోచింది. అపుడు మన్నన్ బ్రాహ్మణవరునితో "నీవు ఏమి మంత్రప్రయోగాన్ని చేశావు? ఈ మూట ఇంత బరువుగా ఉన్నదే! ఆ మంత్రం ఏదో నాకుకూడా చెప్పు'' అని అంటూ తమ చేతిలోని ఖడ్గాన్ని చూపిస్తూ బెదిరించారు. అపుడు ఆ బ్రాహ్మణ వరుడు కలియన్‌తో "ఆ మంత్రాన్ని నీకు ఉపదేశిస్తాను, రా'' అని దగ్గరకు పిలిచి, సకలవేదమంత్రసారమై, జన్మజరామరణాదులు ఏమీ లేని పరమపదాన్ని అనుగ్రహించేదై, సకలమంత్రరాజమైన అష్టాక్షరీమహామంత్రాన్ని పూర్వం బదరికాశ్రమంలో నరనారాయణ అవతారాన్ని ఎత్తి తనకు తానే ఉపదేశించుకొన్న కొఱత తీరేటట్లుగా, కలియన్ కుడిచెవిలో ఉపదేశించి, వెంటనే గరుడవాహనరూఢుడై, సలక్ష్మీకుడై ప్రత్యక్షమయ్యాడు.

ఈ విధంగా భగవానునినుండి తిరుమంత్రాన్ని ఉపదేశంగా పొందినందు వల్ల, ఆ స్వామి దివ్యమంగళవిగ్రహాన్ని సేవించినందువల్ల, భగవానుని కాలిలో ఉండే వలయాన్ని బలవంతంగా తీసే ప్రయత్నంలో **"తేనే మలరుమ్ తిరుప్పాదమ్"** ను నోటితో స్పృశించినందువల్ల, కలియన్‌కు గల అజ్ఞానాదులన్నీ తొలగి, **"మయర్వఱ మదినలమ్"** (దోషరహితమైన భక్తిరూపావన్న జ్ఞానాన్ని)ను పొందిన వారయ్యారు. భగవానుని పరిపూర్ణంగా అనుభవించి, ఆ అనుభవపరీవాహారూపాలైన ఆఱు దివ్యప్రబంధాలను అనుగ్రహించారు. **"వాడినేన్ వాడి"** అని ప్రారంభించి తమను ఉజ్జీవింపజేసిన అష్టాక్షరీమహామంత్రంయొక్క గొప్పతనాన్ని **"నాన్ కణ్డుకొణ్డేన్ నారాయణా! ఎన్నుమ్ నామమ్"** అని అంటూ ఒకటికి తొమ్మిది మార్లు పల్కి పెరియతిరుమొழிలోని మొదటి శతకం- మొదటి దశకాన్ని ముగించారు. ఈ విధంగా తిరుమంత్రార్థ ప్రభావాన్ని తెలిపిన తరువాత, ఆ తిరుమంత్ర ప్రతిపాద్యుడైన భగవానుడు ఆదరంతో వేంచేసి ఉండే దివ్యదేశం, భారతదేశంలో ఉండే అర్చావతార స్థలాలకు అన్నిటికీ ఉత్తరదిక్కులోని పర్యంతసీమలో ఉన్నది, **"మానస సరోవరమ్"** అని సముద్రం వంటి సరస్తీరంలో ఉన్నది, పరిమళవల్లీ సమేతుడై, పరమపురుషుడనే పేరుతో అనంతశయనుడైన స్వామి వేంచేసి ఉండే చోటు అయిన **"తిరుప్పిరిది"** అనే దివ్యదేశాన్ని, ఆ తిరుమంత్రాన్ని తానే శిష్యుడై, తానే ఆచార్యుడై వ్యక్తం చేసిన నరనారాయణ రూపాలు వేంచేసి ఉండే బదరిని, బదరికాశ్రమాన్ని భగవానుడు దర్శింపజేయగా మానసనేత్రంతో దర్శించి తరువాత మూడు దశకాలతో వాటికి మంగళాశాసనం చేశారు. ఈ విధంగా ఒకటి రెండు దివ్యదేశాలను మంగళాశాసనం చేయడంతో తృప్తిపడని స్వభావాన్ని కలవారు కనుక తిరుమంగై మన్నన్, భారతదేశంలో ఉండే పలు దివ్యస్థలాలను మొదట మంగళాశాసనం చేశారు. పూర్వం మూడు దశకాలలో ఉత్తరంనుండి దక్షిణదిశగా తిరుప్పిరిది, బదరికాశ్రమాలకు మంగళాశాసనం చేసి, ఆ తరువాత వాటికి దక్షిణంగా ఉండే సాలగ్రామాన్ని అయిదవ దశకంలోను, ఆ తరువాత దానికి దక్షిణాన గల నైమిశారణ్యాన్ని ఆఱవ దశకంలో, ఆ పిమ్మట దానికి దక్షిణంలో ఉండే **"శిఙ్గవేళ్‌కున్ఱమ్"** (అహోబలం)ను ఏడవ దశకంలో, తరువాత దానికి దక్షిణదిక్కులో ఉన్న, తమిళదేశానికి ఉత్తర ఎల్లలో గల వేంకటాచలాన్ని మొదటి శతకం- ఎనిమిదవ దశకంనుండి పదవ దశకంవరకు, రెండవ శతకంలోని మొదటి దశకంవరకు గల పాశురాలలో కీర్తించి, ఉత్తరదేశంలోగల దివ్యతిరుపతుల అనుభవాన్ని ముగించారు. తరువాత ఉత్తరదేశానికి దక్షిణదిక్కులో గల తొండనాడు దివ్య



దేశాలను మంగళాశాసనం చేయడం ఆరంభించి, (2-2) వదశకంతో తిరువెవ్వుళ్ (తిరువళ్ళూర్) ను, (2-3)వ దశకంతో తిరువల్లిక్కేణిని, (2-4)వ దశకంలో తిరునీర్‌మలై దివ్యదేశాన్ని (2-5,6)వ దశకాలతో తిరుక్కడల్‌మల్లైను, (2-7) వ దశకంతో తిరువిడవెన్దైను, (2-8)వ దశకంలో తిరుప్పరమేచ్చుర విణ్ణగరమ్ దివ్య దేశాన్ని మంగళాశాసనం చేసి, తొండనాడు దివ్యదేశాల అనుభవాన్ని ముగించారు. (2-10) వ దశకంలో తిరుక్కోవలూర్‌ను, (3-1) వ దశకంలో తిరువయిన్దిపురాన్ని (తిరువహీంద్రపురం) మంగళాశాసనం చేసి తొండనాడుకు దక్షిణదిశలో గల మధ్యదేశదివ్యతిరుపతుల అనుభవాన్ని ముగించారు.

మధ్యదేశ దివ్యతిరుపతులకు దక్షిణదిశలో గల చోళమండల దివ్యదేశాలను మంగళాశాసనం చేయడం ఆరంభించి, (3-2,3)వ దశకాలలో తిరుచ్చిత్తిర కూడమనే దివ్యదేశాన్ని, (3-4) వ దశకంలో కాழிచ్చీరామవిణ్ణగరాన్ని, (3-5, 6-7)వ దశకాలతో తిరువాలి అనే దివ్యదేశాన్ని (3-8) వ దశకంనుండి (4-8)వ దశకం వరకు గల 11 దశకాలతో క్రమంగా 1. తిరుమణి మాడక్కోయిల్, 2.వైకున్ద విణ్ణగరమ్, 3. అరిమేయవిణ్ణకరమ్, 4. తిరుత్తేవనార్ తొకై, 5. తిరువణ్ పురుడోత్తమమ్, 6.శెమ్బొన్ శెయ్ కోయిల్, 7. తిరుతెற்றి యమ్బలమ్, 8.తిరుమణి క్కూడమ్, 9. తిరుక్కావళమ్బాడి, 10. తిరువెళ్ళక్కుళమ్, 11. తిరుప్పార్‌త్తన్ పళ్ళి- అనే పదకొండు దివ్యదేశాలను, (4-9) లో తిరువిన్దళూర్ అనే దివ్యదేశాన్ని, (4-10)వ దశకంలో తిరువెళ్ళియఙ్గుడిని, (5-1)వ తిరుమొழிతో తిరుక్కూడ లూర్‌ను, (5-3) వ దశకంలో తిరువెళ్ళఱైను, (5-4,5,6,7,8) వ దశకాలలో అంటే-5దశకాలలో శ్రీరంగాన్ని, (5-9) వ దశకంతో తిరుప్పేర్‌నగర్‌ను, (5-10) వ దశకంతో నన్దిపురవిణ్ణగర క్షేత్రాన్ని (6-1,2,3) దశకాలతో తిరువిణ్ణగర్‌ను, (6-4) వదశకం నుండి (7-3) వదశకంవరకు పది దశకాలలో తమకు పంచసంస్కారాన్ని అనుగ్రహించిన నంబి వేంచేసి ఉండే తిరునఱైయూర్‌ను, (7-4) వ దశకంలో తిరుచ్చేఱైను, (7-5,6,7,8) దశకాలలో తిరువழுన్దూర్‌ను, (7-9) దశకంలో శిఱుపులియూర్ తలశయనమ్ క్షేత్రాన్ని, (7-10) వ దశకంతో తిరుక్కణ్ణమఙ్గైను, 8వ శతకం పూర్తిగా తాము మిక్కిలి అభినివేశాన్ని పొందిన తిరుక్కణ్ణపురాన్ని, (9-1)వ దశకంలో తిరుక్కణ్ణఙ్గుడిని, (9-2) వదశకంలో తిరునాగైను, మంగళా శాసనంచేసి చోళదేశ దివ్యతిరుపతుల అనుభవాన్ని ముగించారు.

తరువాత చోళనాడుకు దక్షిణంలోగల పాండ్యనాడు మలయాళదేశ దివ్య తిరుపతులను మంగళాశాసనం చేసే క్రమంలో (9-3,4)వ దశకాలలో తిరుప్పుల్లా

ణిని, (9-5,6) దశకాలతో తిరుక్కు౬ుఱ్గుడిని, (9-7)వ దశకంతో తిరువల్లవాఱ్‌ను, (9-8,9) దశకాలతో తిరుమాలిరుమ్‌శోలైను, (9-10)వదశకంతో తిరుక్కోట్టి యూర్‌ను కీర్తించి పాండ్యదేశ- మళయాళదేశక్షేత్రాల అనుభవాన్ని ముగించారు.

(10-1) వ దశకంలో "పరమపదానికి చేరడానికి కాలం సమీపిస్తున్నది" అని తలచి ఆఱ్వార్లు నూతనవధువు మెట్టినింటికి పోయేటపుడు పుట్టిన ఊరిలో ఉండే బంధువులవద్ద, దగ్గరివారి వద్ద సెలవు తీసికొనేటట్లుగా పలు దివ్యదేశాలను చేర్చి అనుభవించారు. ఈ విధంగా అర్చావతార స్థలాలను అనుభవించిన తరువాత, విభవావతారాలను అనుభవించడం ఆరంభించి, (10-2,3) దశకాలలో శ్రీరామావ తారాన్ని, (10-4,5) వదశకాలతో శ్రీకృష్ణావతారాన్ని యశోదాభావనతోను అనుభవించారు. (10-6) వదశకంలో మిగిలిన అవతారాలలోని పరత్వంతోపాటు, శ్రీకృష్ణావతారంలోని సౌలభ్యాన్నికూడా చేర్చి అనుభవించారు. (10-7,8,9) దశకాలలో శ్రీకృష్ణావతారాన్ని యశోదాభావనతోను, గోపికాభావనతోను, ప్రణయకలహ, సంశ్లేషాలు మొదలైనవానిని నాయికాభావనతోను, మాతృభావన తోను అనుభవించారు. (10-10, 11,-1, 2-3) అనే దశకాలతో ప్రియుని విశ్లేషించిన నాయికా భావనతో పలికారు. (11-4) దశకంతో విభవావతార వైభవాన్ని అనుభవించారు. (11-5) వ దశకాన్ని భగవానుని విభవావతారాలలోని పరత్వ, సౌలభ్యాలను తెలిపే ఇద్దఱు చెలికత్తెల సూక్తిగా అనుగ్రహించారు. (11-6) వదశకంలో ప్రళయపదలో రక్షించిన స్వామినే ఆశ్రయించమని లోకులను ఉద్బోధించారు. (11-7) వ దశకంలో భగవానుని విషయంలో అభినివేశం లేని అవయాలు నిష్ఫలాలు- అని అన్నారు. చివరిగా (11-8)వ దశకంతో దేహ సంబంధాన్ని తీర్చవలసినదిగా ప్రార్థించి పెరియతిరుమొఱ్ ప్రబంధాన్ని నిగమించారు.

రెండవ ప్రబంధం అయిన తిరుక్కు౬ున్దాణ్డాకమ్‌లో, ఆకలి కల్గనంతవరకు అన్నాన్ని పెట్టని తల్లివలె, తనను అనుభవించడానికి తగిన గొప్ప ఆర్తిని కల్గించడం కోసం భగవానుడు వీరికి తన దర్శనాన్ని అనుగ్రహించలేదు. అపుడు భగవానుని విశ్లేషాన్ని క్షణమైనా సహించలేని రీతిలో గొప్ప ఆర్తిని పొందిన ఆఱ్వార్లు, గొప్ప దాహాన్ని పొందినవారు నీటిలోకి దిగినీటిని తాగడం, నీటిని ఎత్తి పైన జల్లుకోవడం మొదలైన పనులను చేసేటట్లే, భగవానుని నోటితో కీర్తించి, శిరస్సుతో కీర్తించి, మనస్సులో భావించి ప్రాణధారణ చేశారు.



చాలా దాహాన్ని కలవారు నీరును తాగినపుడు, ఆ నీరు వారికి ఇంకా ఇంకా దాహాన్ని పెంచేటట్లే, తిరుక్కు౬ున్దాణ్డకమ్‌లో ఆఱ్వార్లు అనుభవించిన అనుభవం ఇంకా ఇంకా ఆర్తిని వారికి కల్గించింది. అపుడు మూడవ ప్రబంధమైన తిరువెఱుకూఱ్ఱిరుక్కైలో కుంభఘోణక్షేత్రంలోని ఆరావముదన్ స్వామిని ఆర్తితో శరణు పొందారు.

ఈ విధంగా శరణు పొందినా స్వామిని పొందలేనందువల్ల ఆర్తితో కళ్ళు గ్రున తిరిగి, "మా ఇద్దఱి స్వరూపాన్ని పాడుచేసి అయినా అతడు వచ్చేటట్లు చేస్తాను" అని నిశ్చయించుకొని, మడల్ ఎత్తడానికి ప్రయత్నించారు- శిఱియ తిరుమడల్, పెరియ తిరుమడల్ అనే రెండు ప్రబంధాలలో. నాల్గవ ప్రబంధం అయిన శిఱియతిరుమడల్‌లో "అవతారాలలోని స్వామి గొప్పతనాన్ని పాడుచేస్తాను" అని అన్నారు. అప్పటికీ స్వామి దర్శనాన్ని అనుగ్రహించనందువల్ల "సౌలభ్యానికి చరమావధి అయిన అర్చామూర్తుల గొప్పతనాన్నికూడా పాడుచేస్తాను" అని అయిదవ ప్రబంధంలో అన్నారు. "ఇక వీరికి నేను ప్రత్యక్షం కాకపోతే అందఱు నా సత్తవిషయంలోనే నమ్మికను కోల్పోతారు" అని తలచిన భగవానుడు ప్రత్యక్షం కాగా, తాము అతనిని పొందిన రీతినిగూర్చి పల్కి చరమ ప్రబంధమైన తిరునెడున్దాణ్డ కమ్‌ను ముగించారు.

శుకాదిమహర్షులు, ముదలాఱ్వార్లు భగవానుని పరత్వరూపంలో ఊనికను కలవారు. సనకాదులు, తిరుమఱిశైప్పిరాన్ అంతర్యామిరూపంలో ఊనికను కలవారు. వాల్మీకి మొదలైనవారు, కులశేఖరులు, శ్రీరామావతారంలో, పరాశర మహర్షి, వ్యాసమహర్షి మొదలైనవారు, నమ్మాఱ్వార్లు, పెరియాఱ్వార్లు, ఆణ్డాళ్ శ్రీకృష్ణావతారంలో ఊనికను కలవారు. నారదాదిమహర్షులు, తొణ్డరడిప్పొడి ఆఱ్వార్లు. తిరుప్పాణ్‌ఆఱ్వార్లు (శ్రీరంగంలోని) అర్చామూర్తిలో ఊనికను కలవారు. శ్రీశౌనకభగవానుడు, తిరుమంగై ఆఱ్వార్లు అర్చావతారరూపాలలో ఊనికను కలవారు.

నమ్మాఱ్వార్లు అనుగ్రహించిన నాల్గు ప్రబంధాలు నాల్గు వేదాలతో సమానం అని, తిరుమంగై ఆఱ్వార్లు అనుగ్రహించిన ఆఱు ప్రబంధాలు ఆ నాల్గు ద్రావిడ వేదాలకు ఆఱు అంగాలని, మిగిలిన పదిమంది ఆఱ్వార్ల ప్రబంధాలు ఉపాంగాలని పూర్వాచార్యులసూక్తి.

ఇక, తిరుమంగై ఆళ్వార్లు భ్రమ-విస్మృతి-ప్రలంభాది దోషరహితమైన, భక్తిరూపాపన్న జ్ఞానాన్ని పొందిన తరువాత జరిగిన వృత్తాంతాలు కొన్ని విన్నపింప బడుతున్నాయి. తిరుమంగై మన్నన్ చోళదేశ దివ్యతిరుపతులను సేవించి మంగళాశాసనం చేసే క్రమంలో **"శీర్కాళి"** (చిదంబరం) క్షేత్రానికి వెళ్ళినపుడు అలవాటు ప్రకారం వీరి శిష్యులు- **"నాలుకవి ప్పెరుమాళ్ వన్దార్, అరుళ్మారి వన్దార్, అరట్టముక్కి వన్దార్, అడ్డైయార్ శీయమ్ వన్దార్, ఆలినాడర్ వన్దార్, మజ్జైయర్ వేన్దర్ వన్దార్, పరకాలర్ వన్దార్"** ఇత్యాది బిరుదులను బిగ్గరగా ఉచ్చరిస్తూ ఆళ్వార్ల ముందు వెళ్ళే సమయంలో ఆ ఊరిలో ఉండే **"తిరుజ్ఞాన సమ్బన్ద నాయనార్"** అనే శివభక్తుని శిష్యులు వారిని అడ్డుకొని, "మా నాయనార్ ఉండే చోట మీరు మీ ఆళ్వార్ల బిరుదులను ఘోషించడానికి అంగీకరించము'' అని అభ్యంతరం తెలిపారు. అపుడు ఆళ్వార్లు "మీ నాయనార్‌తో నేను వాదించడానికి స్థిరంగా ఉన్నాను'' అని పల్కి అక్కడ ఉండే శ్రీవైష్ణవగృహిణి ఇంటిలో ఉండే వెన్నకు దోగాడే శ్రీకృష్ణుని అర్చా విగ్రహాన్ని వేంచేపు చేసికొని నాయనార్ ఉండే చోటికి పోగా, నాయనార్ ఆశువుగా అపుడొక పాశురాన్ని చెప్పారు. ఆళ్వార్లు ఆ పాశురంలో గల దోషాలను సూచించగా, "అయితే మీరు ఒక పాశురాన్ని చెప్పండి'' అని శివజ్ఞానసంబంధర్ అన్నారు. వెంటనే ఆళ్వార్లు **"ఒక కుఱళాయ్ ఇరు నిలమ్"** అనే (పెరియతిరు-3-4) దశకాన్ని ఆశువుగా చెప్పి, అందులోని చివరి పాశురంలో తమ వైభవం స్ఫురించే రీతిలో **"ఆలినాడన్, అరుళ్ మారి, అరట్టముక్కి, అడ్డైయార్ శీయమ్ కొజ్ఞుమలర్కుఱవియర్‌వేళ్, మజ్జైవేన్దన్, కొఱ్ఱవేల్ పరకాలన్ కలియన్ శొన్న శజ్ఞముక త్తమిళ్ వలై"** అని పల్కాగా సంబంధర్‌కూడా దీనిని విని బదులు ఏమీ పల్కలేక, "మీకు ఈ బిరుదులన్నీ తగును, తగును'' అని అంటూ ఆళ్వార్లకు నమస్కరించి వెళ్ళిపోయారు. సంబంధర్ తిరుమంగైమన్నన్‌కు తమ వేలాయుధాన్ని కానుకగా సమర్పించారనికూడా పెద్దలంటారు.

శ్రీరంగంలోని శ్రీరంగనాథునకు విమానమండపగోపురప్రాకారాదుల నిర్మాణ కైంకర్యాన్ని చేయాలని భావించిన ఆళ్వార్లు, అందుకోసం నాగపట్టణంలో గల స్వర్ణమయమైన బౌద్ధవిగ్రహాన్ని తీసికొని వచ్చి, సమస్తవస్తువులకు స్వామి అయిన శ్రీరంగనాథునకు ఉపయోగించి, ఆ విగ్రహానికి వైదికత్వాన్ని కల్గించాలని భావించారు. తదనుసారంగా, తమ పరివారంతో పాటుగా బయలుదేరి తిరుమంగై మన్నన్ నాగపట్టణాన్ని చేరి, అక్కడ ఉండే బౌద్ధవిహారంలోకి పోవడానికి ఏదారి కన్పించనందున ఆ ఆలయం మొత్తం చుట్టూ పరిశీలించారు. అపుడు ఆ ఆలయ



శిఖరంలో చక్రరూపంలో ఉండే ఒక యంత్రం నిరంతరం పరిభ్రమిస్తున్నదని గమనించి, దాని భ్రమణాన్ని నిలుపడంకోసం పలు అరటిబోదెలను తీసికొని వచ్చి వాటిని చిన్న చిన్న ముక్కలు చేసి ఆ చక్రంలో నిరంతరంగా వేయగా, దాని నుండి వచ్చే దారాలు చక్రాన్ని చుట్టి దానిని తిరగనీయకుండా నిలిపివేశాయి. దానికి పిమ్మట ఆళ్వార్లు తమ పరివారంలో ఒకనిని శిఖరం పైకి ఎక్కించి ఆ చక్రం మధ్యలో గల అవకాశం ద్వారా వలయం లోపలకు పంపించి, విగ్రహాన్ని తీసికొని రమ్మని చెప్పారు. అతడు లోపలకు పోయి విగ్రహాన్ని ఎత్తుకొని రావాలని ప్రయత్నించగా ఆ బింబం మంత్రప్రభావంవల్ల అతనికి దొరుకకుండా ఆలయం అంతా తిరగడం ఆరంభించింది. బయట ఉండే తిరుమంగై ఆళ్వార్లు చెప్పిన ఉపాయం ప్రకారం అతడు ఆ విగ్రహాన్ని అపరిశుద్ధం చేశాడు. దానితో ఆ ప్రతిమలోని మంత్రశక్తి తగ్గి **"ఈయత్తాలాకాతో ఇరుమ్బినాలాకాతో పూయత్తాల్ మిక్కదొరు పూతత్తాలాకాతో, తేయత్తేయ్ పిత్తనై నచ్చెమ్బుకళాలాకాతో మాయప్పొన్ వేణుమో మతిత్తెన్నై ప్పణ్ణుకైక్కే"** అని అఱుస్తూ విగ్రహం కింద పడింది. అపుడు దానిని తీసికొని వచ్చి తిరుమంగై ఆళ్వార్లకు ఇవ్వగా, ఆళ్వార్లు సంతోషించి దానిని భగ్నం చేసి, ఆ రాత్రికి రాత్రే అక్కడనుండి బయలుదేరారు.

ప్రాతఃసమయానికి తిరుక్కణ్ణఙ్గుడి అనే దివ్యదేశాన్ని చేరి, అక్కడ బురదతో నిండిన క్షేత్రంలో ఆ ప్రతిమను దాచి పెట్టి, అక్కడికి దగ్గరలో ఉండే నిర్నిద్ర తింత్రిణీవృక్షం నీడలో సేదదీరారు. అపుడు ఆ క్షేత్రయజమాని ఆ పొలాన్ని దున్నడం కోసం రాగా, అతనిని ఆళ్వార్ల అనుచరులు అడ్డుకొని "ఇది మా తండ్రి తాతల నుండి మాకు చెందిన భూమి'' అని వాదించడం ఆరంభించగా ఆ భూస్వామి దిగ్భ్రాంతి చెంది, వారితో ప్రతివాదం చేశాడు. అపుడు పరకాలురు అతనితో- "రేపటి ఉదయానికి ఈభూమికి చెందిన పత్రాలను తీసికొని వచ్చి చూపిస్తాను. లేకపోతే, నీవే ఈ భూమిని దున్నుకో'' అని అన్నారు. అతడు సమ్మతించి వెళ్ళిపోయాడు. ఆనాడే ఆళ్వార్లు అక్కడనుండి ఆ బంగారు విగ్రహాన్ని తీసికొని బయలుదేరి శ్రీరంగాన్ని చేరి, విగ్రహాన్ని కఱగించి అమ్మగా వచ్చిన ధనంతో- **"జితబాహ్యజినాదిమణిప్రతిమా అపి వైదికయన్నివ రంగపురే, మణిమండప వప్రగణాన్ విదధే పరకాలకవిః ప్రణమేమహి తాన్"** (శ్రీరంగ.పూశ-36) అని శ్రీరంగరాజస్తవంలో భట్టర్ పల్కిన రీతిలో శ్రీరంగంలో ప్రాకారాలను, మండపాలను, గోపురాలను కట్టి కైంకర్యం చేశారు. ఆ ప్రయత్నంలో తొణ్డరడిప్పొడి

యాళ్వార్లు పుష్పమాలికను కట్టే కైంకర్యం చేసిన చోటు అడ్డు రాగా, దానిపై గల గౌరవంతో ప్రాకారాన్ని కొంచెం పక్కకు జరిపి కట్టారు.

దివ్యదేశాలకు మంగళాశాసనం చేసే క్రమంలో ఆళ్వార్లు **"పెరుమ్ పుఱక్కడలై"** (పెరియతిరు-7-10) అని ప్రారంభమయిన తిరుక్కణ్ణమజ్గై దివ్యదేశ దశకాన్ని అర్థగాంభీర్యాన్ని కల్గిన ప్రయోగాలతో రచించి, ఆ దశకంలోని అర్థాలను గ్రహించాలనే అభిప్రాయం తిరుక్కణ్ణమజ్గైలో వేంచేసి ఉండే శ్రీకృష్ణునకు ఉన్నట్లు ముఖవైఖరినిబట్టి గ్రహించి, **"వెణ్ శజ్గ మొన్ట్రేన్దియ కణ్ణా! నిన్ఱనక్కుమ్ కుఱిప్పాకిల్ కఱ్కలామ్ కవియిన్ పొరుళ్దానే"** అని ఆళ్వార్లు అనగానే, అర్చకముఖంగా "ఆళ్వార్లూ! ఆవిధంగానే అభ్యసిస్తాను. ఇపుడు అర్చావతారం కనుక సాధ్యం కాదు. ఇంకొక సమయంలో మిమ్ములను ఆచార్యులుగా గ్రహించి ఈ పాశురార్థాలను గ్రహిస్తాను'' అని పరమరసికుడైన స్వామి అన్నాడు- అని, తత్ప్రకారమే కలికన్ఱి అయిన ఆళ్వార్లు తమ అవతార తిరునక్షత్రం అయిన కార్తికమాసం- కృత్తికానక్షత్రంలో తిరుక్కలికన్ఱి దాసర్ అని సంభావింపబడే నమ్పిళ్ళైగా అవతరించగా, తిరుక్కణ్ణ మజ్గైలోని శ్రీకృష్ణుడుకూడా తన అవతారనక్షత్రం అయిన శ్రావణమాసం- రోహిణిలో **"కణ్ణన్"** అనే తిరునామాన్ని కల్గిన పెరియవాచ్చాన్పిళ్ళైగా అవతరించి, పరకాలకవి పాశురాలతో పాటు మిగిలిన ఆళ్వార్ల పాశురాలలోని గంభీరాలైన అర్థాలనుకూడా నమ్పిళ్ళైసన్నిధిలో క్రమానుసారంగా అభ్యసించి, వాటిని లోకోజ్జీవనార్థం వ్యాఖ్యానరూపంలో వెలయించారు- అని పెద్దల సూక్తి.

తిరుమంగై ఆళ్వార్లు తమ ఆఱు దివ్యప్రబంధాలను అనుగ్రహించిన తరువాత శ్రీరంగానికి వేంచేసి, తిరునెడున్దాణ్డకాన్ని దేవగానంతో పాడగా, దానిని విని చాలా సంతోషించిన శ్రీరంగనాథుడు "మీకు కావలసిన దానిని అడగండి'' అని అన్నాడు. అపుడు పరకాలురు- "స్వామీ! నీవు మార్గళిమాసంలో జరిగే అధ్యయనోత్సవంలో నమ్మాళ్వార్ల తిరువాయ్మొళి దివ్యప్రబంధగానాన్ని ఆలకించాలి'' అని ప్రార్థించగా, శ్రీరంగనాథుడు దానికి సమ్మతించాడు. ఆ ప్రకారమే తిరుమంగై ఆళ్వార్లు ఆళ్వార్ తిరునగరినుండి నమ్మాళ్వార్ల అర్చామూర్తిని ప్రతి యేడు వేంచేపు చేసికొని తీసికొనివచ్చి, వారి సమక్షంలోనే ఉభయవేదపారాయణను గొప్పగా జరిపించి, పది దినాల అధ్యయనోత్సవాలు ఏర్పాటుచేశారు. ఉత్సవం పూర్తి అయిన తరువాత నమ్మాళ్వార్లను తిరిగి తిరుక్కురుకూర్కు తీసికొనిపోయి స్వస్థానం చేర్చారు. ఈ విధంగా తిరుమంగై



ఆళ్వార్ల చేత పదిదినాల ఉత్సవంగా ప్రారంభమైన అధ్యయనోత్సవం, ఆచార్యుల కాలంలో మిగిలిన ఆళ్వార్ల దివ్యప్రబంధాల గానంకోసం పది దినాల పగల్ పత్తు ఉత్సవం -పది రోజుల తిరువాయ్మొళిని గానం చేసే రాపత్తు ఉత్సవం- మొత్తం ఇరవైరోజుల ఉత్సవంగా వృద్ధి చెందింది. భట్టర్కాలంలో తిరునెడున్దాణ్డకానికి గల గొప్పతనాన్ని చూచి, పగల్పత్తు ముందు దినం తిరునెడున్దాణ్డక ఉత్సవం చేర్చబడి, ఇపుడు ఇరవై ఒక్క దినాల ఉత్సవమై, ఈనాటికీ నిర్వహింపబడుతున్నది. ఈ వివరాలన్నీ పెరియవాచ్చాన్ పిళ్ళై అనుగ్రహించిన **"కలియన్ అరుళ్ పాడు"**- మొదలైన గ్రంథాలద్వారా తెలుస్తున్నవి. తరువాతి కాలంలో ఆళ్వార్ తిరునగరి నుండి నమ్మాళ్వార్ల అర్చామూర్తిని తీసికొని రావడం, తిరిగి తీసికొనిపోవడం కష్టసాధ్యమైనందున, శ్రీరంగంలోనే ఆళ్వార్ల ఉత్సవవిగ్రహం ప్రతిష్ఠింపబడింది.

తమ పరమపావనాలైన దివ్యప్రబంధాలద్వారా లోకానికి ఉపదేశించి, దుష్టులనుండి ద్రవ్యాలను చౌర్యం చేసి భగవద్భాగవతకైంకర్యానికి ఉపయోగించడం సన్మార్గంలో ఒకటి అని తమ ఆచరణద్వారా తెలిపి, కలిదోషాన్ని హరించి **"కలికన్ఱి"** అనే బిరుదాన్ని పొందిన ఈ ఆళ్వార్లు తమ చరమదశలో తాము ఎక్కువగా అభినివేశాన్ని పొందిన నమ్బి వేంచేసి ఉండే తిరుక్కుఱుజ్గుడికి కుముదవల్లితో పాటు పోయి చేరి, పరమవిరక్తులై, కొంతకాలం నమ్బి దివ్యరూపసౌందర్యాన్ని దర్శించి ఆనందిస్తూ కాలం గడిపి అక్కడే పరమపదాన్ని చేరారు. ఈనాటికీ తిరుక్కుఱుజ్గుడిలో ఆళ్వార్లు పరమపదించినచోట వారి సన్నిధి ఉన్నది.

**తిరుమంగై ఆళ్వార్ తనియన్**

**కలయామి కలిధ్వంసం కవిం లోకదివాకరమ్ ।**
**యస్య గోభిః ప్రకాశాభి రావిద్యం నిహతం తమః ॥**



శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీముదలియాండాన్ స్వాముల తనియన్లు

1. **పాదుకే యతిరాజస్య కథయన్తి యదాఖ్యయా ।**
**తస్య దాశరథే పాదౌ శిరసా ధారయామ్యహమ్ ॥**

2. **శ్రీమద్వాధూల కులవారిధి పూర్ణచంద్రం**
**వాధూలదేశిక గురూత్తమ పుత్రరత్నమ్ ।**
**తత్పాదయుగ్మశరణం తదుపాసితారం**
**శ్రీశైలదేశిక మహం శరణం ప్రపద్యే ॥**

**దాశరథ్యార్యతనయం తత్పాదకమలాశ్రయమ్ ।**
**శ్రీశైలార్యగురుం వందే దయాదిగుణసాగరమ్ ॥**

3. **దాశరథ్యార్యతనయం శ్రీశైలార్యపదాశ్రయమ్ ।**
**శ్రీవేంకటగురుం వందే శీలాదిగుణసాగరమ్ ॥**

4. **శ్రీవేంకటార్యతనయం తత్పాదకమలాశ్రయమ్ ।**
**వాధూలాన్వయపూర్ణేందుం రామానుజగురుం భజే ॥**





# పొదుత్తనియన్‌లు

1. **శ్రీశైలేశ దయాపాత్రం ధీభక్త్యాది గుణార్ణవమ్ ।**
**యతీన్ద్ర ప్రవణం వన్దే రమ్యజామాతరం మునిమ్ ॥**

తిరుమలైయాళ్వార్ అనబడే తిరువాయ్‌మొళిప్పిళ్ళై అనుగ్రహానికి పాత్రమైన వారు, జ్ఞానభక్త్యాది కల్యాణగుణాలకు సముద్రంవంటివారు, భగవద్రామానుజుల పట్ల ప్రావణ్యాన్ని కలవారు అయిన శ్రీవరవరమునులకు నమస్కరిస్తున్నాను.

2. **లక్ష్మీనాథ సమారమ్భాం నాథయామున మధ్యమామ్ ।**
**అస్మదాచార్యపర్యన్తాం వన్దే గురుపరమ్పరామ్ ॥**

శ్రియఃపతిని ప్రారంభంలో కల్గినది, శ్రీమన్నాథముని- యామునమునులను మధ్యలో కల్గినది, మనకు ఆచార్యులైన భగవద్రామానుజులను చివరలో కల్గినది అయిన ఆచార్యపరంపరకు నమస్కరిస్తున్నాను.

3. **యో నిత్య మచ్యుతపదామ్బుజ యుగ్మరుక్మ -**
**వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే ।**
**అస్మద్గురో ర్భగవతోఽస్య దయైకసిన్ధోః**
**రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే ॥**

ఏభగవద్రామానుజులు నిత్యంగా భగవానుని శ్రీచరణపద్మయుగమనే బంగారంలో కల గొప్ప వ్యామోహంవల్ల, ఆ పదపద్మాల కంటే వేఱయిన అన్ని విషయాలను గడ్డిపోచగా తలచి విడచి వేశారో, మాకు ఆచార్యులు, సమస్తకల్యాణ గుణ పరిపూర్ణులు, కరుణాసముద్రులు అయిన ఈ భగవద్రామానుజుల శ్రీచరణాలను ఉపాయంగా ఆశ్రయిస్తున్నాను.

4. **మాతా పితా యువతయ స్తనయా విభూతిః**
**సర్వం యదేవ నియమేన మదన్వయానామ్ ।**
**ఆద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం**
**శ్రీమత్తదంఘ్రియుగళం ప్రణమామి మూర్ధ్నా ॥**

నా వంశంలోని వారికి ఎల్లప్పుడు తల్లి, తండ్రి, భార్య, సంతానం, సంపద-ఇంకా అన్నీ ఏ నమ్మాళ్వార్ల, శ్రీచరణాలే అవుతున్నవో, మన కులకూటస్థులు, అయిన ఆ నమ్మాళ్వార్ల, వకుళపూలచే అందమైన, నిత్యోజ్జ్వలమైన ఆ శ్రీచరణాలను శిరసా నమస్కరిస్తున్నాను.

5. **భూతం సరశ్చ మహదాహ్వయ భట్టనాథ -**
**శ్రీభక్తిసార కులశేఖర యోగివాహాన్ ।**
**భక్తాంఘ్రిరేణుపరకాల యతీన్ద్రమిశ్రాన్**
**శ్రీమత్పరాంకుశమునిం ప్రణతోఽస్మి నిత్యమ్ ॥**

పూదత్తాళ్వార్లు, పొయ్‌కై ఆళ్వార్లు, పేయాళ్వార్లు, పెరియాళ్వార్లు, తిరుమళిశై ఆళ్వార్లు, కులశేఖరాళ్వార్లు, తిరుప్పాణ్ ఆళ్వార్లు, తొణ్డరడిప్పొడి ఆళ్వార్లు, తిరుమఙ్గైయాళ్వార్లు, భగవద్రామానుజులు అనే వీరిని, నమ్మాళ్వార్లను నేను నమస్కరిస్తున్నాను.





# తిరుప్పల్లాణ్డు

## తనియన్

గురుముఖ మనధీత్య ప్రాహ వేదా నశేషాన్
నరపతిపరిక్లృప్తం శుల్క మాదాతుకామః ।
శ్వశుర మమరవన్ద్యం రఙ్గనాథస్య సాక్షాత్
ద్విజకులతిలకం తం విష్ణుచిత్తం నమామి ॥

ఏ పెరియాళ్వార్లు వల్లభదేవుడనే ప్రభువుచే నిర్ణయింపబడ్డ వాదశుల్కాన్ని గ్రహించాలనే కోరిక కలవారై, ఆచార్యముఖంగా ఏ విద్యను అభ్యసించకుండానే పరతత్త్వనిర్ణయానికి ఆవశ్యకమైన వేదాలను అన్నిటిని భగవత్కృపవల్ల ఉట్టంకించి ఉపన్యసించారో, దేవతలచే సేవింపదగినవారు, శ్రీరంగనాథునకు సాక్షాత్తు మామగారు, బ్రాహ్మణకులానికి తిలకంవంటివారైన ఆ పెరియాళ్వార్లను నమస్కరిస్తున్నాను.

## తనియన్

మిన్నార్ తడమదిళ్ శూழ் విల్లిపుత్తూర్ ఎన్ఱొరుకాల్
శొన్నార్ కழఱ్కమలమ్ శూడినోమ్- మున్నాళ్
కిழி యఱుత్తా నెన్ఱురైత్తోమ్, కీழ்మ్మైయినిల్ శేరుమ్
వழி యఱుత్తోమ్ నెఞ్జమే! వన్దు

పాణ్డియన్ కొణ్డాడ ప్పట్టర్‌పిరాన్ వన్దానెన్ఱు
ఈణ్డియశఙ్గ మెడు త్తూద, - వేణ్డియ
వేదఙ్గళోది విరైన్దు కిழி యఱుత్తాన్
పాదఙ్గళ్ యాముడైయ పత్తు

"కాంతి నిండిన గొప్ప ప్రాకారాలచే చుట్టబడి ఉండే శ్రీవిల్లిపుత్తూర్" అనే ఒక మారు ఉచ్చరించినవారి శ్రీచరణ పద్మాలను శిరస్సుపై ధరించాము. "పురుషార్థం వ్యక్తం కాని కాలంలో పరతత్త్వనిర్ణయాన్ని చేసి, వాదశుల్కాన్ని గ్రహించినవారు" అని చెప్పగలిగాముకదా! ఆహా! ఓ మనసా! నీవు అనుకూలించినందువల్ల అధోగతి అనే నరకంలోకి చేరే దారిని ఖండించాము.

వల్లభదేవుడనే పాండ్యరాజు ప్రశంసించగా "బ్రాహ్మణులకు ఉపకారకులైన పెరియాఴ్వార్లు వేంచేశారు" అని గుంపులు గుంపులుగా శంఖాలను చేతిలో పట్టుకొని పలువురు ఊదగా, విష్ణు పారమ్యస్థాపనకై ఆవశ్యకాలైన వేదవాక్యాలను ఉపన్యసించి, ఆలస్యం చేయకుండా విద్యాశుల్కంగా నిర్ణయించిన అర్థాన్ని ఖండించి గ్రహించిన పెరియాఴ్వార్ల శ్రీచరణాలే మనకు శరణం.



# తిరుప్పల్లాణ్డు

1. పల్లాణ్డు పల్లాణ్డు పల్లాయిరత్తాణ్డు,
పలకోడి నూఱాయిరమ్,
మల్లాణ్డ తిణ్డోళ్ మణివణ్ణా!, ఉన్
శెవ్వడి శెవ్వి తిరుక్కాప్పు

మల్లులను నిరసించిన దృఢమైన బాహువులను కలవాడవై, నీలమణివంటి గొప్ప వర్ణాన్ని కలవాడా! పలు పలు ఏండ్లు అనేక బ్రహ్మకల్పాలు- ఈ విధంగా ఉండే కాలం అంతా నీ ఎఱ్ఱని అందమైన శ్రీచరణాల అందానికి ఏకొఱత లేకుండా రక్షణ కలగాలి.

2. అడియోమోడుమ్ నిన్నోడుమ్ పిరివిన్ఱి యాయిరమ్ పల్లాణ్డు,
వడివాయ్ నిన్ వలమార్బినిల్ వాఴ్గిన్ఱ మఙ్గైయుమ్ పల్లాణ్డు,
వడివార్ శోది వలత్తుఱైయుమ్ శుడరాఴియుమ్ పల్లాణ్డు,
పడైపోర్ పుక్కు ముఴఙ్గు మప్పాఞ్జశన్నియముమ్ పల్లాణ్డే

దాసభూతులైన నావంటివారైన చేతనులతో, స్వామివి అయిన నీతో విశ్లేషం లేకుండా ఈ సంబంధం నిత్యంగా కొనసాగాలి. నీకు నిరూపక అయిన, నీ వక్షః స్థలంలో కుడివైపు పొందికగా ఉండే, నిత్యయౌవనశాలిని అయిన లక్ష్మీదేవి మొదలైన దివ్యదేవేరులకు మంగళం. నీ తిరుమేనిలో వ్యాపించే జ్యోతిస్సును కలవాడై, కుడిచేతిలో నిత్యవాసాన్ని చేసేవాడై, శత్రువులను దహించేవాడైన శ్రీసుదర్శనునకు మంగళం. సేనలను కల యుద్ధరంగంలో ప్రవేశించి ఘోషించే, అంతులేని గొప్పతనాన్ని కల శ్రీపాంచజన్యాఴ్వాన్‌కు మంగళం.



3. వాఴాట్పట్టు నిన్ఱీరుళ్ళీరేల్ వన్దు మణ్ణుమ్ మణముమ్ కొణ్మిన్,
కూఴాట్పట్టు నిన్ఱీర్‌గళై యెఙ్గళ్ కుఴువినిల్ పుగుదలొట్టోమ్,
ఏఴాట్కాలుమ్ పఴిప్పిలోమ్ నాఙ్గళ్ ఇరాక్కదర్ వాఴ్, ఇలఙ్గై
పాఴాళాగ ప్పడై పొరుదానుక్కు ప్పల్లాణ్డు కూఱుదుమే

ఉజ్జీవించడానికి తగిన భగవానుని శేషవృత్తిలో అభినివేశాన్ని నిలుకడగా కలవారైతే, మీరు మాతో కలసి భగవానుని ఉత్సవార్థమైన మృత్సంగ్రహణోత్సవం కోసం పుట్టమన్నును మోయండి. ఆ ఉత్సవానికి అభిమానులై ఉండండి. ధనంకోసం ఇతరులవద్ద దాస్యాన్ని చేసేవారిని మా గోష్ఠిలోకి రానివ్వము. మా గొప్పతనం ఏమి? అంటారా!, వినండి, మేము. ఏడేడు తరాలుగా ఏదోషం లేనివారము. మా వృత్తి అయితే, రాక్షసులు నివసించే లంకలోని రాక్షసులంతా పాడయేటట్లు వానరసేనను తీసికొని యుద్ధం చేసిన భగవానునకు (శ్రీరామునకు) పల్లాండు పాడేవారమై ఉన్నాము.

4. ఏడు నిలత్తిలిడువదన్ మున్నమ్ వన్దెఙ్గళ్ కుఴామ్ పుగున్దు,
కూడు మనముడైయీర్‌గళ్! వరమ్బొఴి వన్దొల్లై క్కూడుమినో,
నాడు నగరముమ్ నన్గఱియ నమో నారాయణాయవెన్ఱు,
పాడు మనముడైప్పత్తరుళ్ళీర్ వన్దు పల్లాణ్డు కూఱుమినే

కైవల్యానుభవాన్ని కోరి ఉపాసనను చేసేవారలారా! మీరు ఆ కైవల్యంలోని ఆశను వదలి వచ్చి, అనన్యప్రయోజనులమైన మా గోష్ఠిలో చేరి ఒకటిగా కావాలనే ఆశను కలవారైతే, హేయమైన స్థానం అయిన కైవల్యంలోకి మిమ్ములను గెంటి వేయడానికి ముందే ఆత్మానుభవాన్ని మాత్రమే పొందుతామనే మీ నియమాన్ని వీడి, ఇక పూర్ణానుభవాన్ని పొందుదాం- అని శీఘ్రంగా మాతో చేరండి. ఆ విధంగా చేరిన తరువాత లోకంలో ఉండేవారు, నగరంలో ఉండేవారు మీ హితాన్ని తెలిసి కొనేటట్లు పల్కి అనుసంధించాలనే భావనను కల భక్తులలో చేరినవారై, భగవానునకు మంగళాశాసనం చేయండి.

5. అణ్డక్కులత్తుక్కదిపదియాగి యశురరిరాక్కదరై,
యిణ్డ క్కులత్తై యెడుత్తు క్కళైన్ద విరుడీకేశన్ఱనక్కు,
త్తొణ్డక్కులత్తిలుళ్ళీర్! వన్దడితొఴుదు ఆయిరనామమ్ శొల్లి,
పణ్డై క్కులత్తై త్తవిర్న్దు పల్లాణ్డు పల్లాయిరత్తాణ్డెన్మినే

బ్రహ్మాండసమూహాలకు అన్నిటికి నియామకుడై, అసురరాక్షసుల నిబిడమైన గుంపును నిర్మూలించిన హృషీకేశుడైన భగవానునకు దాసులైనవారి గోష్ఠిలో చేరినవారలారా! (ఐశ్వర్యార్థులారా!) మీరు ప్రయోజనాంతరాన్ని కోరి ఉండడమనే ప్రాక్తనదశను పోగొట్టుకొని మాతో చేరి, భగవానుని శ్రీచరణాలను సేవించి, అన్ని తిరునామాలను అనుసంధించి ఎల్లప్పుడు మంగళాశాసనాన్ని చేయండి.

6. ఎన్దై తన్దై తన్దై తన్దైతమ్మూత్తప్పన్ ఏழ் పడికాళ్ తొడజ్గి,
వన్దు వழிవழி యాట్చెయ్‌గిన్ఱోమ్, తిరువోణత్తిరువిழావిల్
అన్దియమ్బోదిల్ అరియురువాగి యరియై యழித్తవనై,
ప్పన్దనై తీర ప్పల్లాణ్డు పల్లాయిరత్తాణ్డెన్ఱు పాడుదుమే

(అనన్యప్రయోజనులమైన మేము) నా తండ్రి, వారి తండ్రి, వారి తండ్రి, వారి తండ్రి, వారి ముత్తాత- అనే ఈ విధంగా ఏడు తరాలుగా తగిన సమయంలో వచ్చి క్రమాన్ని తప్పకుండా స్వామి కైంకర్యాన్ని చేస్తున్నాము. శ్రవణానక్షత్రం అనే దినంలో అందమైన సాయంసంధ్యాసమయంలో నృసింహమూర్తియై అవతరించి, ఆశ్రితుడైన ప్రహ్లాదునకు శత్రువైన హిరణ్యుని వధించిన భగవానునకు ఆనాటి దృష్టిదోషం తీరేటట్లు మంగళాశాసనం చేద్దాం.

7. తీయిఱ్పొలిగిన్ఱ శెఞ్జుడరాழி తిగழ் తిరుచ్చక్కరత్తిన్,
కోయిఱ్పొఱియాలే యొఱ్ఱుణ్డు నిన్ఱు కుడికుడి యాట్చెయ్‌గిన్ఱోమ్,
మాయప్పొరుపడై వాణనై యాయిరన్దోళుమ్ పొழி కురుది
పాయ, శుழఱ్ఱియ ఆழி వల్లానుక్కు ప్పల్లాణ్డు కూఱుదుమే

చంద్రుడు, సూర్యుడు, అగ్ని మొదలైన జ్యోతిఃపదార్థాలు అన్నిటికంటే అధికంగా ప్రకాశించేది, ఎట్టి తేజస్సుతోకూడి వెల్గుతున్నది అయిన శ్రీసుదర్శనం వేంచేసి ఉండే స్థానం అయిన గుండ్రని చిహ్నంతో చిహ్నితమైన వారమై, అనాదిగా తరతరాలుగా భగవానునకే కైంకర్యం చేస్తున్నాము. అంతేకాక, కృత్రిమ యుద్ధాన్ని చేసేవాడు, సేనలను కలవాడు అయిన బాణాసురుని వేయి బాహువులనుండి బయటకు వచ్చే రక్తం ప్రవాహమై ప్రవహించేటట్లు తన శ్రీహస్తంలో తిప్పిన చక్రాయుధాన్ని నిర్వహించగల స్వామికి మంగళాశాసనం చేద్దాం.

8. నెయ్యిడై నల్లదోర్ శోఱుమ్ నియతము మత్తాణి చ్చేవగముమ్,
కైయడై క్కాయుమ్ కழுత్తుక్కు ప్పూణొడు కాదుక్కు క్కుణ్డలముమ్,
మెయ్యిడ నల్లదోర్‌శాన్దము తన్దెన్నై వెళ్ళుయిరాక్కవల్ల
పైయుడైనాగ ప్పగైక్కొడియానుక్కు ప్పల్లాణ్డు కూఱువనే



నేతితో నిండిన భోగ్యమైన, విలక్షణమైన ప్రసాదాన్ని, ఎల్లప్పుడు వెంట ఉండి చేసే సేవకవృత్తిని, శ్రీకరంతో ప్రసాదించే తాంబూలాన్ని, గళసీమలో ధరించదగిన ఆభరణాలను, కర్ణాలలో పెట్టుకోదగిన కుండలాలను, శరీరంలో పూసికోదగిన గొప్ప చందనాన్ని (రజస్తమోగుణాలతో ఐశ్వర్యాన్ని కోరిన నా అభిమతానుసారం) అనుగ్రహించి, ఈ విధంగా సంసారియై పడి ఉన్న నన్ను శుద్ధసాత్త్వికస్వభావునిగా చేసినవాడై, ఫణాలను కల సర్పాలకు విరోధి అయిన గరుడుని ధ్వజంగా కల్గినవాడైన భగవానునకు మంగళాశాసనం చేస్తాను.

9. ఉడుత్తుక్కళైన్ద నిన్ పీతగవాడై యుడుత్తు క్కలత్తదుణ్డు,
తొడుత్త తుழாయ్‌మలర్ శూడిక్కళైన్దన శూడు మిత్తొణ్డర్‌కళోమ్,
విడుత్తతిశై క్కరుమన్దిరుత్తి త్తిరువోణ త్తిరువిழావిల్,
పడుత్త పైన్నాకణై ప్పళ్ళికొణ్డానుక్కు ప్పల్లాణ్డు కూఱుదుమే

స్వామీ! నీవు నడుమున ధరించి విడిచిన నీ పీతాంబరాన్ని ధరించి, నీవు భుజించిన పాత్రలో మిగిలిన ప్రసాదాన్ని భుజించి, నీవు అలంకరించుకొని తీసివేసిన తులసీమాలను ధరించినవారమై, ఇటువంటి దాసులమైన మేము నీవు ఆజ్ఞాపించి పంపిన దిక్కులో చేయవలసిన కార్యాలను సక్రమంగా నిర్వహించి, క్రిందకు విస్తరింపజేసిన పడగలను కల ఆదిశేషుడనే సర్పశయనంలో శయనించి ఉండే నీకు శ్రవణానక్షత్రోత్సవంలో మంగళాశాసనం చేస్తాము.

10. ఎన్నాళ్ ఎమ్బెరుమా నున్దనక్కు అడియోమెన్ఱెழுత్తుప్పట్ట,
అన్నాళే, అడియోఙ్గళడిక్కుడిల్ వీడు పెఱ్ఱుయ్‌న్దదుకాణ్,
శెన్నాళ్ తోఱ్ఱి త్తిరుమదురైయుళ్ శిలై కునిత్తు, ఐన్దలైయ
పైన్నాగత్తలై ప్పాయ్‌న్దవనే! ఉన్నై ప్పల్లాణ్డు కూఱుదుమే

స్వామీ! నీకు మేము శేషభూతులమనే మాట మానోటినుండి ఏనాడూ వెలువడిందో, ఆ దినంనుండి దాసులమైన మా సంతానం అంతా సద్గతిని పొంది ఉజ్జీవించింది. మంచి నక్షత్రంలో అవతరించి, అందమైన ఉత్తరమధురలోని కంసుని ఆయుధశాలలో ప్రవేశించి వింటిని వంచి, విఱిచి, అయిదు తలలను కల పడగలతో కూడిన కాళియుని తలపై దుమికినవాడా! నీకు మంగళాశాసనం చేస్తాము.

11. అల్వళుక్కొన్టు మిల్లా అణికోట్టియర్‌కోన్, అబిమాన తుఙ్గన్
శెల్వనైప్పో త్తిరుమాలే! నాను మునక్కు ప్పళవడియేన్,
నల్వకైయాల్ నమో నారాయణా వెన్టు నామమ్ పల పరవి,
పల్వకైయాలుమ్ పవిత్తిరనే! యున్నై ప్పల్లాణ్డు కూఱువనే

ఓ శ్రియఃపతీ ! అక్రమాలు (దోషాలు) ఏమీ లేని అందమైన తిరుక్కోట్టియూర్‌లో ఉండేవారికి నాయకుడు, శ్రీవైష్ణవాభిమానంతో గొప్పవారు అయిన శెల్వనంబివలె నేనుకూడా నీకు అనాదిగా శేషభూతుడనయ్యాను. అన్ని రీతులలో పరిశుద్ధుడవైన స్వామీ! దాసునకు మంచి కలిగేటట్లు తిరుమంత్రాన్ని అనుసంధించి, నీ అనేకతిరునామాలను అనుసంధించి స్తుతించి, నీకు మంగళాశాసనం చేస్తాను.

12. పల్లాణ్డెన్టు పవిత్తిరనై ప్పరమేట్టియై, చ్చార్‌ఙ్గ మెన్నుమ్
విల్లాణ్డాన్తన్నై విల్లిపుత్తూర్ విట్టుశిత్తన్ విరుమ్బియ శొల్,
నల్లాణ్డెన్టు నవిన్టురైప్పార్ నమో నారాయణాయ వెన్టు,
పల్లాణ్డుమ్ పరమాత్మనై చ్చూళ్‌న్దిరున్దేత్తువర్ పల్లాణ్డే

పరిశుద్ధుడు, పరమపదనిలయుడు, శ్రీశార్‌ఙ్గమనే ధనుస్సును వంచి ఏలగల్గినవాడైన భగవానునిగూర్చి శ్రీవిల్లిపుత్తూర్‌లో అవతరించిన పెరియాళ్వార్లు ఆదరంతో పల్కిన సూక్తులైన ఈ పాశురాలను 'మనకు మంచికాలం వచ్చింది' అని ఆనందించి సదా అనుసంధించేవారు శ్రీమన్నారాయణుని సదా ప్రదక్షిణం చేస్తూ "నమో నారాయణాయ" అని ఎల్లప్పుడూ మంగళాశాసనం చేయగలరు.



శ్రీమతే రామానుజాయ నమః



తిరుమఙ్గై ఆళ్వార్ అనుగ్రహించిన

# పెరియతిరుమడల్

పిళ్ళై తిరునఱైయూర్ అరైయర్ అనుగ్రహించిన

తనియన్

పొన్నులకిల్ వానవరుమ్ పూమకళుమ్ పోఱ్ఱి శెయుమ్*
నన్నుతలీర్! నమ్బి నఱైయూరర్* - మన్నులకిల్
ఎన్నిలైమై కణ్డు మిరఙ్గారే యామాకిల్*
మన్ను మడలూర్‌వన్ వన్దు.

మన్నియ పల్‌పొఱి శేర్ ఆయిరవాయ్ వాళరవిన్*
శెన్ని మణిక్కుడుమి త్తెయ్‌వచ్చుడర్ నడువుళ్* 1

మన్నియ నాకత్తణైమేలోర్ మామలై పోల్*
మిన్ను మణిమకరకుణ్డలఙ్గళ్ విల్ వీశ* 2

తున్నియ తారకైయిన్ పేరొళి శేర్ ఆకాశమ్*
ఎన్నుమ్ వితానత్తిన్ కీళాల్ * - ఇరు శుడరై 3

మన్నుమ్ విళక్కాక వేఱ్ఱి* మఱి కడలుమ్
పన్ను తిరై క్కవరి వీశ* - నిలమఙ్గై 4

తన్నై ముననాళ్ అళవిట్ట తామరైపోల్*
మన్నియ శేవడియై వానియఙ్గు తారకైమీన్* 5

ఎన్నుమ్ మలర్‌ప్పిణైయల్ ఏయ్‌న్ద* - మళైక్కూన్దల్
తెన్నునయర్ పొరుప్పుమ్ తెయ్‌వ వడమలైయుమ్* 6

ఎన్ను మివైయే ములైయా వడివమైన్ద*
అన్ననడైయ అణఙ్గే* - అడియిణైయై 7

త్తన్నుడైయ అఙ్గైకళాల్ తాన్ తడవ త్తాన్ కిడన్దు* - ఓర్
ఉన్నియ యోకత్తుఅక్కమ్ తలైక్కొణ్డ 8

పిన్నై* తన్నాబివలయత్తు ప్పేరొళి శేర్*
మన్నియ తామరై మామలర్ పూత్తు* - అమ్మలర్మేల్ 9

మున్నమ్ తిశైముకనై త్తాన్ పడైక్క* మఱ్ఱవనుమ్
మున్నమ్ పడైత్తనన్ నాన్మఱైకళ్* - అమ్మఱైతాన్ 10

మన్ను మఱమ్పొరుళ్ ఇన్బమ్ వీడెన్ఱులకిల్*
నన్నెఱి మేమ్బట్టన నాన్గన్ఱే* - నాన్గినిలుమ్ 11

పిన్నైయతు పిన్నై ప్పెయర్తరు మెన్బదు*- ఓర్
తొన్నెఱియై వేణ్డువార్ వీళ్కనియు మూళ్ళిలైయుమ్* 12

ఎన్ను మివైయే నుకర్న్దుడలమ్ తామ్ వరున్ది*
తున్ను మిలైక్కురమ్బై త్తుఱన్దియుమ్* వెఙ్జుడరోన్ 13

మన్ను మళల్ నుకర్న్దుమ్ వణ్తడత్తినుట్కిడన్దుమ్*
ఇన్నదోర్ తన్మైయరాయ్ ఈఙ్గుడలమ్ విట్టెళున్దు* 14

తొన్నెఱి క్కణ్ శెన్ఱారెనప్పడుమ్ శొల్లల్లాల్*
ఇన్నతోర్ కాలత్తు ఇనైయారితు పెఱ్ఱార్* 15

ఎన్నవుమ్ కేట్టఱివతిల్లై* ఉళతెన్నిల్
మన్నుమ్ కడుఙ్కతిరోన్ మణ్డలత్తిన్ నన్నడువుళ్* 16

అన్నతోరిల్లియి నూడుపోయ్* - వీడెన్నుమ్
తొన్నెఱిక్కణ్ శెన్ఱారై చ్చొల్లుమిన్కళ్ శొల్లాతే* 17

అన్నతే పేశు మఱివిల్ శిఱుమనత్తు* - ఆఙ్గు
అన్నవరై క్కఱ్పిప్పోమ్ యామే* - అతు నిఱ్క 18



మున్నమ్ నాన్ శొన్న అఱత్తిన్ వళి ముయన్ఱ*
అన్నవర్తామ్ కణ్డీర్కళ్ ఆయిరక్కణ్ వానవర్కోన్* 19

పొన్నకరమ్ పుక్కు అమరర్ పోఱ్ఱి శెప్ప*- పొఙ్గొళి శేర్
కొన్నవిలుమ్ కోళరిమాత్తాన్ శుమన్ద కోలమ్ శేర్ 20

మన్నియ శిఙ్గాశనత్తిన్ మేల్* - వాణెడుఙ్కణ్
కన్నియరాల్ ఇట్టకవరిప్పొతి యవిళ్న్దు* - ఆఙ్గు 21

ఇన్నిళమ్ పూన్దెన్ఱల్ ఇయఙ్గ* - మరుఙ్గిరున్ద
మిన్ననైయ నుణ్మరుఙ్గుల్ మెల్లియలార్ వెణ్ముఱువల్* 22

మున్న ముకిళ్త్త ముకిళ్నిలా వన్దరుమ్బ*
అన్నవర్ తమ్మానోక్కు ముణ్డాఙ్గణిమలర్ శేర్* 23

పొన్నియల్ కఱ్పకత్తిన్ కాడుడుత్త మాడెల్లామ్*
మన్నియ మన్దారమ్ పూత్త మతుత్తివలై* 24

ఇన్నిశై వణ్డమరుమ్ శోలైవాయ్ మాలైశేర్*
మన్నియ మామయిల్పోల్ కూన్దల్* - మళైత్తఙ్గడణ్ 25

మిన్నిడైయారోడుమ్ విళైయాడి వేణ్డిడత్తు*
మన్ను మణిత్తలత్తు మాణిక్కమఞ్జరియిన్* 26

మిన్నినొళిశేర్ పళిఙ్గు విళిమ్బుడుత్త*
మన్నుమ్ పవళక్కాల్ శెమ్బొన్శెయ్ మణ్డపత్తుళ్* 27

అన్ననడైయ వరమ్బైయర్తమ్ కైవళర్త్త*
ఇన్నిశై యాళ్పాడల్ కేట్టు ఇన్బుఱ్ఱు* - ఇరువిశుమ్బిల్ 28

మన్ను మళై తవళుమ్వాణిలా నీణ్మతి తోయ్*
మిన్నినొళిశేర్ విశుమ్బూరుమ్ మాళికై మేల్* 29

మన్ను మణివిళక్కై మాట్టి* - మళైక్కణ్ణార్
పన్ను విశిత్తిరమాప్పొప్పడుత్త పల్లి మేల్* 30

తున్నియ శాలేకమ్ శూఴ్కతవమ్ తాళ్ తిఱప్ప*
అన్నముఴక్క నెరిన్దుక్క వాణీల* 31

చ్చిన్న నఱున్దాతు శూడి* - ఓర్ మన్దారమ్
తున్ను నఱుమలరాల్ తోళ్ కొట్టి* కఱ్పకత్తిన్ 32

మన్ను మలర్వాయ్ మణివణ్డు పిన్ తొడర*
ఇన్నిళమ్ పూన్దెన్ఱల్ పుకున్దు ఈఙ్గిళములైమేల్* 33

నన్నఱుమ్ శన్దనచ్చేఱుళ్ పులర్త్త* - తాఙ్గరుమ్ శీర్
మిన్నిడై మేల్ కైవైత్తిరున్దు ఏన్దిళములై మేల్* 34

పొన్నరుమ్బారమ్ పులమ్బ* - అకఙ్కుఴైన్దాఙ్గు
ఇన్నువురువిన్ ఇమైయాడత్తఙ్కణ్ణార్* 35

అన్నవర్తమ్ మానోక్క ముణ్డు ఆఙ్గు అణిముఱువల్*
ఇన్నముతమ్ మాన్దియిరుప్పర్* - ఇతువన్టే 36

అన్న వఱత్తిన్ పయనావతు* - ఒణ్పొరుళుమ్
అన్నతిఱత్తతే యాతలాల్* - కామత్తిన్ 37

మన్నుమ్ వఴి ముఱైయే నిఱ్ఱుమ్ నామ్* - మానోక్కిన్
అన్ననడైయారలరేశ ఆడవర్ మేల్* 38

మన్ను మడలూరార్ ఎన్బతోర్ వాశకముమ్*
తెన్నురైయిల్ కేట్టఱివతుణ్డు* - అతనై యామ్ తెళియోమ్ 39

మన్నుమ్ వడనెఱియే వేణ్డినోమ్* - వేణ్డాతార్
తెన్నన్ పొతియిల్ శెఴుమ్ శన్దనక్కుఴమ్బిన్* 40

అన్నతోర్ త్తన్మై యఱియాతార్* - ఆయన్ వేయ్
ఇన్నిశైయోశైక్కిరఙ్గాతార్* మాల్విడైయిన్ 41

మన్ను మణి పులమ్బ వాడాదార్* - పెణ్ణైమేల్
పిన్ను మవ్వన్ఱిల్ పెడైవాయ్ చ్చిఱుకురలుక్కు* 42



ఉన్ని యుడలురుకి నైయాతార్* - ఉమ్బర్వాయ్
త్తున్ను మతియుకుత్త తూనిలా నీణెరుప్పిల్* 43

తమ్ముడలమ్ వేవ త్తళరాతార్* - కామవేళ్
మన్నుమ్ శిలైవాయ్ మలర్వాళి కోత్తెయ్య 44

ప్పొన్నెడు వీతి పుకాదార్* - తమ్ పూవణైమేల్
శిన్నమలర్క్కుఴలు మల్కులుమ్ ఎన్మలైయుమ్* 45

ఇన్నిళవాడై తడవ త్తామ్ కణ్డుయిలుమ్*
పొన్ననైయార్ పిన్నుమ్ తిరువుఱుక* - పోర్ వేన్దన్ 46

తన్నుడైయ తాతై పణియాల్ అరశొఴిన్దు*
పొన్నకరమ్ పిన్నే పులమ్బ వలఙ్గొణ్డు* 47

మన్నుమ్ వళనాడు కైవిట్టు* - మాతిరఙ్గళ్
మిన్నురువిల్ విణ్డేర్ తిరిన్దు వెళిప్పట్టు* 48

క్కన్నిరైన్దు తీయ్న్దు కఴై యుడైన్దు కాల్ శుఴన్ఱు*
పిన్నుమ్ తిరై వయిఱ్ఱుప్పేయేతిరిన్దులవా* 49

కొన్నవిలుమ్ వెఙ్గానత్తూడు* - కొడుఙ్కతిరోన్
తున్ను వెయిల్వఱుత్త వెమ్బరల్మేల్ పఞ్జడియాల్* 50

మన్ననిరామన్ పిన్ వైతేవి యెన్ఱురైక్కుమ్*
అన్ననడైయ అణఙ్గు నడన్దిలళే* 51

పిన్నుమ్ కరునెడుఙ్గణ్ శెవ్వాయ్ ప్పిణైనోక్కిన్*
మిన్ననైయ నుణ్మరుఙ్గుల్ వేకవతి యెన్ఱురైక్కుమ్ 52

కన్ని తన్ ఇన్నుయిరాఙ్కాతలనై క్కాణాతు*
తన్నుడైయ మున్దోన్ఱల్ కొణ్డేక త్తాన్ శెన్ఱు* - అఙ్గు 53

అన్నవనై నోక్కాతు అఴిత్తురప్పి* - వాళమరుళ్
కన్నవిల్తోళ్ కాళైయై క్కైప్పిడిత్తు మీణ్డుమ్ పోయ్* 54

పొన్నవిలు మాకమ్ పుణర్న్దిలళే* - పూఙ్గఙ్గై
మున్నమ్ పునల్ పరక్కుమ్ నన్నాడన్* మిన్నాడుమ్ 55

కొన్నవిలుమ్ నీళ్వేల్ కురుక్కళ్ కులమతలై*
తన్నికరొన్నిల్లాత వెన్ఱి త్తనఞ్జయనై* 56

పన్నాకరాయన్ మడప్పావై*- పావైతన్
మన్నియ నాణచ్చమ్ మడమెన్నివై యకల* 57

తన్నుడైయ కొఙ్గైముకమ్ నెరియ* - తాన్ అవన్దన్
పొన్ వరైయాకమ్ తఴీఇక్కొణ్డుపోయ్* తనతు 58

నన్నకరమ్బుక్కు నయన్దు ఇనితు వాఴ్న్దతువుమ్*
మున్నురైయిల్ కేట్టఱివతిల్లైయే* - శూఴ్కడలుళ్ 59

పొన్నకరుమ్ శెఱ్ఱ పురన్దరనోడేరొక్కుమ్*
మన్నవన్ వాణన్ అవుణర్క్కు వాళ్ వేన్దన్* 60

తన్నుడైయ పావై యులకత్తు త్తన్నొక్కుమ్*
కన్నియరై యిల్లాత కాట్చియాళ్* - తన్నుడైయ 61

ఇన్నుయిర్ త్తోఴియాల్ ఎమ్పెరుమానీన్ తుఴాయ్*
మన్ను మణివరైత్తోళ్ మాయవన్* - పావియేన్ 62

ఎన్నై ఇతు విళైత్త ఈరిరణ్డుమాల్వరైత్తోళ్*
మన్నవన్ తన్కాతలనై మాయత్తాల్ కొణ్డుపోయ్* 63

కన్నితన్పాల్ వైక్క మఱ్ఱవనోడు ఎత్తనై యోర్*
మన్నియ పేరిన్బిమెయ్తినాళ్* - మఱ్ఱివైతాన్ 64

ఎన్నాలే కేట్టీరే యేఴైకాళ్! ఎన్నురైక్కేన్*
మన్ను మలైయరైయన్ పొఱ్పావై* - వాణిలా 65

మిన్ను మణిముఱువల్ శెవ్వాయ్ ఉమై యెన్నుమ్*
అన్ననడైయ అణఙ్గునడఙ్గిడై శేర్* 66



పొన్నుడమ్బు వాడ ప్పులనైన్దుమ్ నొన్దకల*
తన్నుడైయ కూఴై చ్చడాపారమ్ తాన్దరిత్తు* - ఆఙ్గు 67

అన్న అరున్దవత్తినూడు పోయ్* - ఆయిరన్దోళ్
మన్ను కరతలఙ్గళ్ మట్టిత్తు* మాతిరఙ్గళ్ 68

మిన్ని యెరి వీశ మేలెడుత్త శూఴ్ కఴల్కాల్*
పొన్నులక మేఴుమ్ కడన్దుమ్బర్ మేల్ శిలుమ్బ* 69

మన్ను కులవరైయుమ్ మారుతముమ్ తారకైయుమ్*
తన్నినుడనే శుఴల చ్చుఴన్ఱాడుమ్* 70

కొన్నవిలుమ్ మూవిలై వేల్ కూత్తన్ పొడియాడి*
అన్నవన్ తన్ పొన్నకలమ్ శెన్ఱాఙ్గణైన్దిలళే* 71

పన్ని యురైక్కుఙ్గాల్ పారతమామ్* - పావియేఱ్కు
ఎన్నుఱు నోయ్ యానురైప్ప క్కేణ్మిన్* ఇరుమ్బొఴిల్ శూఴ్ 72

మన్ను మఱైయోర్ తిరునఱైయూర్ మామలైపోల్*
పొన్నియలు మాడ క్కవాడమ్ కడన్దు పుక్కు* 73

ఎన్నుడైయ కణ్ కళిప్ప నోక్కినేన్* - నోక్కుతలుమ్
మన్నన్ తిరుమార్బుమ్ వాయుమ్ అడియిణైయుమ్* 74

పన్ను కరతలముమ్ కణ్కళుమ్* పఙ్గయత్తిన్
పొన్నియల్ కాడు ఓర్మణివరై మేల్ పూత్తతుపోల్* 75

మిన్ని యొళి పడైప్ప వీణాణుమ్ తోళ్వళైయుమ్*
మన్నియ కుణ్డలము మారముమ్ నీణ్ముడియుమ్* 76

తున్ను వెయిల్ విరిత్త శూళామణి యిమైప్ప*
మన్ను మరకతక్కున్ఱిన్ మరుఙ్గే * - ఓర్ 77

ఇన్నిళవఞ్జిక్కొడి యొన్ఱు నిన్ఱతుతాన్*
అన్నమాయ్ మానాయ్ అణిమయిలాయ్ అఙ్గిడైయే* 78

మిన్నాయ్ ఇళవే యిరణ్డాయ్ ఇణైచ్చెప్పాయ్*
మున్నాయ తొణ్డైయాయ్ క్కెణ్డైక్కుల మిరణ్డాయ్* 79

అన్న తిరువురువమ్ నిన్దతు అఱియాతే*
ఎన్నుడైయ నెఞ్జు మఱివు మినవళైయుమ్* 80

పొన్నియలుమ్ మేకలైయుమ్ ఆఙ్గొఴియప్పోన్దేఱ్కు*
మన్ను మఱికడలు మార్క్కుమ్* - మఱి యుకుత్త 81

ఇన్నిలా ఇన్కతిరుమ్ ఎన్దనక్కే వెయ్తాకుమ్*
తన్నుడైయతన్మై తవిరత్తానెన్కొలో* 82

తెన్నన్ పొదియిల్ శెఴుఞ్జన్దిన్ తాతళైన్దు*
మన్నివ్వులగై మనఙ్గళిప్ప వన్దియఙ్గుమ్* 83

ఇన్నిళమ్ పూన్దెన్దలుమ్ వీశు మెరి యెనక్కే*
మున్నియ పెణ్ణైమేల్ ముళ్ ముళరి క్కూట్టకత్తు* 84

పిన్ను మవ్వన్డిల్ పెడైవాయ్ చ్చిఱుకురలుమ్*
ఎన్నుడైయ నెఞ్జుక్కు ఓరీర్వాళామ్ ఎన్ శెయ్కేన్* 85

కన్నవిల్తోళ్ కామన్ కరుప్పు చ్చిలై వళైయ*
క్కొన్నవిలుమ్ పూఙ్గణైకళ్ కోత్తు ప్పొద వణైన్దు* 86

తన్నుడైయ తోళ్ కఴియ వాఙ్గి* - తమియేన్ మేల్
ఎన్నుడైయ నెఞ్జే యిలక్కాక ఎయ్కిన్దాన్* 87

పిన్నితనై క్కాప్పీర్ తాన్ ఇల్లైయే* - పేదైయేన్
కన్నవిలుమ్ కాట్టకత్తోర్ వల్లిక్కొడిమలరిన్* 88

నన్నఱువాశ మత్తారాను మెయ్తామే*
మన్నుమ్ వఱునిలత్తు వాళాఙ్గు కుత్తతుపోల్* 89

ఎన్నుడైయ పెణ్మైయు మెన్నలను మెన్ ములైయుమ్*
మన్ను మలర్మఙ్గైమైన్దన్* - కణపురత్తు 90



పొన్మలైపోల్ నిన్దవన్దన్ పొన్నకలమ్ తోయావేల్*
ఎన్నివైతాన్ వాళా ఎనక్కే పొఱైయాకి* 91

మున్నిరున్దు మూక్కిన్దు మూవామై క్కాప్పతోర్*
మన్ను మరున్దు అఱివీరిల్లైయే - మాల్విడైయిన్ 92

తున్ను పిడరెరుత్తు త్తూక్కుణ్డు* వన్ తొడరాల్
కన్నియర్కణ్ మిళిర క్కట్టుణ్డు* - మాలైవాయ్ 93

తన్నుడైయ నావొఴియాతు ఆడుమ్ తనిమణియిన్*
ఇన్నిశై యోశైయుమ్ వన్దెన్ శెవితనక్కే* 94

కొన్నవిలు మెంఱికిల్ కొడితాయ్ నెడితాకుమ్*
ఎన్నితనై క్కాక్కుమా? శొల్లీర్* - ఇతు విళైత్త 95

మన్నన్ నఱున్తుఴాయ్ వాఴ్ మార్బన్ * మామతికోళ్
మున్నమ్ విడుత్త ముకిల్ వణ్ణన్* - కాయావిన్ 96

శిన్ననఱుమ్ పూన్దికఴ్వణ్ణన్ * వణ్ణమ్బోల్
అన్నకడలై మలైయిట్టణై కట్టి* 97

మన్ననిరావణనై మామణ్డు వెఞ్జమత్తు*
పొన్ ముడికళ్ పత్తుమ్ పురళ చ్చురన్దురన్దు* 98

తెన్నులక మేఱ్ఱువిత్త శేవకనై* - ఆయిరక్కణ్
మన్నవన్ వానముమ్ వానవర్తమ్ పొన్నులకుమ్* 99

తన్నుడైయ తోళ్వలియాల్ కైక్కొణ్డ తానవనై*
పిన్నోరరియురువమాకి యెరి విఴిత్తు* 100

కొన్నవిలుమ్ వెఞ్జమత్తు క్కొల్లాతే * - వల్లాళన్
మన్ను మణిక్కుఞ్జి పఱ్ఱి వరవీర్త్తు* 101

తన్నుడైయ తాళ్మేల్ కిడాత్తి* - అవనుడైయ
పొన్నకలమ్ వళ్ళుకిరాల్ పోఴ్న్దు పుకఴ్ పడైత్త* 102

మిన్నిలఙ్గు మాఴిప్పడై త్తడక్కైవీరనై*
మన్నివ్వకలిడత్తై మాముతునీర్ తానిన్ విఴుఙ్గ* 103

పిన్ను మోరేనమాయ్ ప్పుక్కు వళైమరుప్పిల్*
కొన్నవిలుమ్ కూర్నుతిమేల్ వైత్తెడుత్త కూత్తనై* 104

మన్నుమ్ వడమలైయై మత్తాక మాశుణత్తాల్*
మిన్ను మిరు శుడరుమ్ విణ్ణుమ్ పిఱఙ్గొళియుమ్* 105

తన్నినుడనే శుఴల మలై తిరిత్తు * ఆఙ్గు
ఇన్నముతమ్ వానవరై యూట్టి* అవరుడైయ 106

మన్నుమ్ తుయర్ కడిన్ద వళ్ళలై* - మఱ్ఱన్ఱియుమ్
తన్నురువమ్ ఆరు మఱియామల్ తానఙ్గోర్* 107

మన్నుమ్ కుఱళురువిన్ మాణియాయ్* - మావలితన్
పొన్నియలుమ్ వేళ్వియ్క్కణ్ పుక్కిరున్దు* పోర్ వేన్దర్ 108

మన్నై మనఙ్గొళ్ళ వఞ్జిత్తు నెఙ్జురుక్కి*
ఎన్నుడైయ పాదత్తాల్ యానళప్ప మూవడిమణ్* 109

మన్నా! తరుకెన్ఱు వాయ్ తిఱప్ప - మఱ్ఱవనుమ్
ఎన్నాల్ తరప్పట్టతు ఎన్ఱలుమే* అత్తుణైక్కణ్ 110

మిన్నార్ మణిముడి పోయ్ విణ్ తడవ* - మేలెడుత్త
పొన్నార్ కనైకఴఱ్కాల్ ఏఴులకుమ్బోయ్ క్కడన్దు* అఙ్గు 111

ఒన్నా అశురర్ తుళఙ్గ చ్చెలనీట్టి*
మన్నివ్వకలిడత్తై మావలియై వఞ్జిత్తు* 112

తన్నులక మాక్కువిత్త తాళానై* - తామరైమేల్
మిన్నిడైయాళ్ నాయకనై విణ్ణకరుళ్ పొన్ మలైయై* 113

పొన్ని మణి కొఴిక్కుమ్ పూఙ్గుడన్దై ప్పోర్ విడైయై*
తెన్నన్ కుఱుఙ్గుడియుళ్ శెమ్బవళ క్కున్ఱినై* 114

మన్నియ తణ్ శేఱై వళ్ళలై* - మామలర్ మేల్
అన్నమ్ తుయిలు మణినీర్ వయలాలి* 115

ఎన్నుడైయ ఇన్నముతై వెవ్వుళ్ పెరుమలైయై*
కన్నిమతిళ్ శూఴ్ కణమఙ్గై క్కఱ్పకత్తై* 116

మిన్నై యిరుశుడరై వెళ్ళఱైయుళ్ కల్లఱై మేల్
పొన్నై* మరతకత్తై ప్పుట్కుఴియెమ్బోరేఱ్ఱై* 117

మన్ను మరఙ్గత్తెమ్మామణియై* - వల్లవాఴ్
పిన్నై మణాళనై ప్పేరిల్ పిఱప్పిలియై* 118

తొన్నీర్ కడల్ కిడన్ద తోళా మణిచ్చుడరై*
ఎన్మనత్తు మాలై యిడవెన్దై యీశనై* 119

మన్నుమ్ కడన్మల్లై మాయవనై* - వానవర్తమ్
శెన్ని మణిచ్చుడరై త్తణ్కాల్ తిఱల్ వలియై* 120

తన్నై ప్పిఱరఱియా త్తత్తువత్తై ముత్తినై*
అన్నత్తై మీనై యరియై అరుమఱైయై* 121

మున్నివ్వులకుణ్డ మూర్త్తియై* - కోవలూర్
మన్ను మిడైకఴి యెమ్మాయవనై* పేయలఱ 122

ప్పిన్నుమ్ ములై యుణ్డ పిళ్ళైయై* - అళ్ళల్ వాయ్
అన్నమ్ ఇరై తేరఴున్దూరెఴుమ్ శుడరై* 123

తెన్ తిల్లై చ్చిత్తిరకూడత్తు ఎన్ శెల్వనై*
మిన్ని మఴై తవఴుమ్ వేఙ్గడత్తు ఎమ్ విత్తకనై* 124

మన్ననై మాలిరుఞ్జోలైమణాళనై*
కొన్నవిలు మాఴిప్పడైయానై* - కోట్టియూర్ 125

అన్న వురువిలరియై* తిరుమెయ్యత్తు
ఇన్నముతవెళ్ళత్తై యిన్దళూరన్దణనై* 126

మన్ను మతిట్కచ్చి వేళుక్కై యాళరియై*
మన్నియ పాడకత్తు ఎమ్మైన్దనై * - వెంఃకావిల్ 127

ఉన్నియ యోగత్తుఱక్కత్తై* ఊరకత్తుళ్
అన్నవనై యట్టపుయకరత్తెమ్మానేఱ్ఱై* 128

ఎన్నై మనమ్ కవర్న్ద ఈశనై* వానవర్తమ్
మున్నవనై మూఴిక్కళత్తు విళక్కినై* 129

అన్నవనై యాదనూరాణ్డళక్కుమ్ ఐయనై*
నెన్నలై యిన్ఱినై నాళైయై* - నీర్మలైమేల్ 130

మన్ను మఱైనాన్గుమానానై* పుల్లాణి
త్తెన్నన్ తమిఴై వడమొఴియై* నాఙ్గూరిల్ 131

మన్ను మణిమాడక్కోయిల్ మణాళనై*
నన్నీర్ తలైచ్చఙ్గనాణ్మతియై* - నాన్ వణఙ్గుమ్ 132

కణ్ణనై క్కణ్ణపురత్తానై* తెన్నఱైయూర్
మన్ను మణిమాడక్కోయిల్ మణాళనై* 133

కన్నవిల్‌తోళ్ కాళైయై క్కణ్డాఙ్గు క్కైతొఴుతు*
ఎన్నిలైమై యెల్లా మఱివిత్తాల్ ఎమ్బెరుమాన్* 134

తన్నరుళు మాకముమ్ తారానేల్* - తన్నై నాన్
మిన్నిడైయార్ శేరియిలుమ్ వేతియర్‌కళ్ వాఴ్‌విడత్తుమ్* 135

తన్నడియార్ మున్బుమ్ తరణి ముఴుతాళుమ్*
కొన్నవిలుమ్ వేల్ వేన్దర్ కూట్టత్తుమ్ నాట్టకత్తుమ్* 136

తన్నిలైమై యెల్లా మఱివిప్పన్* - తాన్ ముననాళ్
మిన్నిడైయాయ్‌చ్చియర్‌తమ్ శేరిక్కళవిన్ కణ్* 137

తున్ను పడల్ తిఱన్దు పుక్కు* - తయిర్ వెణ్ణెయ్
తన్వయిఱార విఴుఙ్గ* కొఴుఙ్గయఱ్కణ్ 138

మన్ను మడవోర్‌కళ్ పఱ్ఱి యోర్వాన్ కయిఱ్ఱాల్*
పిన్ను మురలోడు కట్టుణ్డ పెఱ్ఱిమైయుమ్* 139

అన్నతోర్ పూతమాయ్ ఆయర్విఴవిన్ కణ్*
తున్ను శకడత్తాల్ పుక్క పెరుఞ్జోఱ్ఱై* 140

మున్నిరున్దు ముఱ్ఱత్తాన్ తుఱ్ఱియ తెఱ్ఱెనవుమ్*
మన్నర్ పెరుఞ్జవైయుళ్ వాళ్‌వేన్దర్ తూతనాయ్* 141

తన్నై యికఴ్‌న్దురైప్ప త్తాన్ ముననాళ్ శెన్ఱతువుమ్*
మన్ను పఱై కఱఙ్గ మఙ్గైయర్‌తమ్ కణ్ కళిప్ప* 142



కొన్నవిలుమ్ కూత్తనాయ్ ప్పేర్‌త్తుమ్ కుడమాడి*
ఎన్నివన్? ఎన్నప్పడుకిన్ఱ ఈడఱవుమ్* 143

తెన్నిలఙ్గై యాట్టి యరక్కర్‌కులప్పావై*
మన్నన్ ఇరావణన్దన్ నల్‌తఙ్గై* - వాళెయిఱ్ఱు 144

త్తున్ను శుడుశినత్తు చ్చూర్‌ప్పణకాశోర్వెయ్‌తి*
పొన్నిఱఙ్కొణ్డు పులర్ న్దెఴున్ద కామత్తాల్* 145

తన్నై నయన్దాళై త్తాన్ మునిన్దు మూక్కరిన్దు*
మన్నియ తిణ్ణెనవుమ్ వాయ్‌త్త మలైపోలుమ్* 146

తన్నికరొన్ఱిల్లా త్తాడకైయై - మాముని క్కా
త్తెన్నులక మేఱ్ఱువిత్త తిణ్డిఱలుమ్* మఱ్ఱివైతాన్ 147

ఉన్ని యులవా ఉలకఱియ ఊర్‌వన్ నాన్*
మున్ని ముళై త్తెఴున్దు ఓఙ్గి యొళి పరన్ద* 148

మన్నియ పూమ్ పెణ్ణైమడల్* 149

పెరియ తిరుమడల్ ముఱ్ఱిఱ్ఱు

శాఱ్ఱుముఱై పాశురాలు

ఎన్నిలైమై యెల్లా మఱివిత్తాల్ ఎమ్బెరుమాన్
తన్నరుళు మాకముమ్ తారానేల్- పిన్నై ప్పోయ్
ఒణ్డుఱైనీర్ వేలై యులకఱియ ఊర్ వన్ నాన్
వణ్డఱై పూమ్ పెణ్ణై మడల్

*మణ్ణిల్ పొడి ప్పూశి వణ్డిరైక్కుమ్ పూచ్చూడి
పెణ్ణై మడల్ పిడిత్తు ప్పిన్నే- అణ్ణల్
తిరునఱైయూర్ నిన్ఱపిరాన్ తేర్ పోకుమ్ వీది
పారు మఱైయాయ్ చ్చెల్వమ్ పొలిన్దు

తిరుమఙ్గైయాఴ్వార్ తిరువడికళే శరణమ్

* (ఈ పాశురం అనుసంధానంలో లేదు)

# పెరియతిరుమడల్ తాత్పర్యసంగ్రహం

**(కాంచీ మహావిద్వాన్ ప్ర.భ. అణ్ణాస్వామివారి దివ్యార్థదీపికావ్యాఖ్యనుండి గ్రహింపబడింది)**

(ఈ పెరియతిరుమడల్ ప్రబంధం మిగిలిన దివ్యప్రబంధాలవలె నాల్గు పాదాలను కల పాశురాలతో కూడినది కాదు. చాలా దీర్ఘమైన ప్రబంధం. దీర్ఘమైన ఏకవాక్యరూపంలోని ప్రబంధం కనుక, దీనిని ఖండఖండాలుగా వ్యాఖ్యానిస్తున్నపుడు ఆ యా పదాల అర్థాలు తెలుస్తున్నా, అఖండమైన వాక్యార్థం మనస్సులో స్థిరంగా, స్పష్టంగా నాటుకోవడం కష్టం. అందువల్ల మూలాన్ని స్పృశిస్తూ ఈ ప్రబంధసారమైన తాత్పర్యం విన్నపింపబడుతున్నది)

భగవానుడు అనంతుడనే పడకపై శయనించి, శ్రీభూనీళాదేవులు తన శ్రీ చరణాలను సంవాహనం చేయగా జగత్సృష్టికోసం యోగనిద్రలో ఉన్నపుడు, తన తిరునాభీకమలంనుండి చతుర్ముఖ బ్రహ్మను సృష్టించాడు. ఆ బ్రహ్మ నాల్గు వేదాలను భగవానునివల్ల పొందాడు. ఆ వేదాలలో ధర్మం, అర్థం, కామం మోక్షం- అనే నాల్గు పురుషార్థాలు ప్రధానంగా తెలుపబడ్డాయి. వాటిలో మోక్షం అనేది శరీరం విడిచిన తరువాత పొందదగిన పురుషార్థమని తెలుపబడింది. ఆ పురుషార్థాన్ని పొందగోరేవారు రాలిన పండ్లను, ఎండిన ఆకులను తిని, తాపసులై గుడిసెలలో నివసించి, సూర్య కిరణాలను భక్షించి, జలాశయాలలో మునిగి ఉండి- ఈ విధంగా పలు పలు పాట్లను పడి చివరకు ఈ శరీరాన్ని విడచి మోక్షాన్ని పొందారు - అని గ్రంథాలలో వ్రాసి ఉన్నదానిని చదవడం తప్ప, "ఇటువంటి ఈ కాలంలో వీరు మోక్షాన్ని పొందగా నేను చూచాను" అని సాక్షాత్తుగా చూచి తెలిసినవారు చెప్పగా వినలేదు. అందువల్ల మోక్షమనే పురుషార్థమే అసత్యం. అది నిజానికి ఉండి ఉంటే "సూర్యమండ లాన్ని భేదించుకొని సూక్ష్మమైన రంధ్రంద్వారా పోయి మోక్షాన్ని పొందివచ్చాను'' అని వచ్చి చెప్పినవారిని చూపించండి. ఆ విధంగా చూపించలేక, "అతడు మోక్షాన్ని పొందాడు'' అని పాతపాటనే పాడుతున్న అవివేకులనుగూర్చి మనం ఏమని అనగలం?

ఆ మోక్షంసంగతిని అటు ఉండనివ్వండి. మిగిలిన ధర్మార్థకామాలనే మూడు పురుషార్థాలలో మొదటిది అయిన ధర్మాన్ని అనుష్ఠించిన మహాత్ములు దేవలోకానికి చేరి, దేవతలచే కీర్తింపబడి, గొప్ప సింహాసనంపై కూర్చుండి, అక్కడ అప్సరస



కాంతలు చామరాలు వీస్తూ దగ్గరలో నిలచి చిఱునవ్వు నవ్వగా, దానిని చూచి ఆనందించి, వారి కటాక్షవీక్షణాలను పొంది ఆనందించి, అక్కడ ఉండే అందమైన కల్పకోద్యానంలో ఆ స్త్రీలతో కూడి క్రీడించి, అలంకరణలతో అందమైన మండపంలో ఆ స్త్రీలు వీణను వాయిస్తూ ఉండగా ఆ రవాన్ని విని ఆనందించి, గొప్ప మేడలలోని మాళిగలలో ఆ దేవకాంతలు ఆశ్చర్యకరంగా పఱచిన శయ్యపై పరుండి, తీయని మలయమారుతం వీచగా, గొప్ప అతిశయించిన అందాన్ని కల్గిన ఆ దేవకాంతల సంశ్లేషాన్ని పొంది - ఈ విధంగా కొన్ని భోగాలను అనుభవించి ఆనందిస్తారు. ధర్మపురుషార్థంవల్ల పొందే ప్రయోజనం ఇది.

రెండవదైన అర్థమనే పురుషార్థంయొక్క ఫలంకూడా ఇటువంటిదే. (ఎందుకు అని అంటే - అర్థాన్ని కలవారే ధర్మాన్ని అనుష్ఠించగలరు. కనుక ధర్మంయొక్క ఫలంగా పూర్వం చెప్పబడినదేకదా అర్థానికి పరంపరయా ఫలంగా పర్యవసిస్తుంది.) అందువల్ల ధర్మం, అర్థం - అనే రెండు పురుషార్థాలతో (పూర్వం వివరించిన రీతిలో) కామపురుషార్థమే ఫలంగా పొందబడడంవల్ల 'కామమే' (ప్రధాన శేషి అయిన పురుషార్థమని, ధర్మార్థాలు ఆ కామపురుషార్థానికి శేషభూతమైన పురుషార్థాలని గ్రహించి, కామాన్నే మనం చివరకు పట్టుకొన్నాము. అందులోను, ఆ భాసమైన లౌకికకామాన్ని విడచి, స్థిరమైన, స్వరూపానురూపమైన భగవద్విషయక కామాన్ని ఆశ్రయించాము. అది చేతికి చిక్కడానికి ఇపుడు మడల్‌ను ఎత్తాలని నిశ్చయించు కొన్నాము. "నాయకుని ఉద్దేశించి నాయకి మడల్‌ను ఎత్తకూడదు'' అని తమిళులు చెప్పగా విన్నా, మనం ఈ విషయంలో తమిళుల మర్యాదను పక్కకు గెంటివేశాము. అంతే. "స్త్రీలకు మడల్ ఎత్తడమే పురుషార్థం'' అని ఉపపాదించే శ్రీరామాయణాదులు సంస్కృతభాషలో ఉన్నాయి కనుక, మనం ఆ ఔత్తరాహమార్గాన్నే ఆదరించి, మడల్‌ను ఎత్తుదాం.

నావలె కామపురుషార్థాన్ని కోరనివారు (ఎటువంటివారు? అని అంటే) చందనంయొక్క స్వభావాన్ని తెలియనివారు, వేణుగానరసంలో అభినివేశాన్ని పొందనివారు. గిత్తల కంఠంలో కట్టబడ్డ గంట ధ్వనించగా, ఆ చప్పుడును విని మనస్సులో ఆర్తిని పొందనివారు, తాటిచెట్టుపై మధురంగా ధ్వనిస్తున్న క్రౌంచ పక్షుల జంటల ఆర్తనాదాన్ని విని ద్రవించి, దయచూపనివారు. నాయకుని విడచి కూడా వెన్నెలలో పరుండగల్గినవారు. మన్మథుడు తన పుష్పబాణాలను సంధించి ప్రయోగించినా, మడల్‌ను ఎత్తడానికి సిద్ధపడకుండా, చలించకుండా ఉండగల్గిన

వారు. ఒంటరిగా శయ్యపై మలయమారుతం వీస్తే అగ్ని జ్వలించినట్లు బాధపడకుండా, చాలా సులభంగా నిద్రించగల్గిన ఆ రసికభుజంగులు ఉంటే ఉండనివ్వండి. నాయకుని విరహాగ్నికి వాడకుండా, బాధపడకుండా ఉండి ఇంకా ఇంకా సంపదలను వారు అనుభవిస్తే అనుభవించనీ. అటువంటి అరసికస్త్రీలను గూర్చి మనకెందుకు?

నాయకుని విశ్లేషించి భరించలేక, మడల్‌ను ఎత్తాలని బయలుదేరి, నాయకుని వెంట పోయిన మహాభాగలైన కొందఱు స్త్రీలనుగూర్చి తెల్పుతున్నాను వినండి. దశరథచక్రవర్తి మాటనే ఆదరించి, పట్టాభిషేకాన్ని విడచి, రాజ్యాన్ని ఉపేక్షించి, చాలా కఠినమైన అరణ్యానికి శ్రీరాముడు బయలుదేరగా, సీతాదేవికూడా అతని వెంట వెళ్ళలేదా! గొప్ప సౌందర్యవతి అయిన వేగవతి అనే కన్యక తాను తన ప్రేమికుని చూడలేనట్లుగా అన్న అడ్డుపడగా, అతనిని లక్ష్యపెట్టకుండా బయలుదేరి, యుద్ధరంగంలోకి పోయి, నాయకుని పట్టుకొని నగరానికి పోయి, అతనితో సుఖించలేదా! ఉలూపి అనే నాగకన్యక అర్జునుని చూచి కామించి, అతనిని తన నగరానికి తీసికొని వచ్చి అతనితో ఆనందించలేదా! మహాభారతంలోని ఈ వృత్తాంతాన్ని మీరు వినలేదా! అంతేకాక, బాణాసురుని పుత్రిక అయిన ఉషాదేవి చిత్రలేఖ అనే తన చెలికత్తెద్వారా అనిరుద్ధుని తనవద్దకు రప్పించుకొని రమించలేదా! ఈవిధంగా మీకు నేను ఎన్ని దృష్టాంతాలను చూపను? పార్వతి తన శరీరం కృశించేటట్లు, ఆహారం మాని, తన ప్రాణాలలో కావలిగా శరీరంలో నిలిచి ఉండే పంచేంద్రియాలు బాధపడేటట్లు గొప్ప తపస్సును చేసి, పరమశివుని పొంది, ఆనందించింది - అనే వృత్తాంతం మీకు తెలియదా? ఇది అంతా మీకు సంగ్రహంగా తెలియజేశాను. వివరించి పలకాలంటే వ్యాసపరాశరాదులే అందుకు సమర్థులు. ఈ పాతకథలు అటు ఉండ నివ్వండి.

నేను పడే బాధనుగూర్చి తెల్పుతున్నాను వినండి. నేను తిరునఱైయూర్ స్వామిని సేవించాలని సన్నిధి లోపలకు పోయి సేవించాను. సేవించగానే ఆ స్వామి యొక్క వక్షఃస్థలం, అధరం, శ్రీచరణాలు, శ్రీహస్తాలు, తిరునేత్రాలు - మొదలైన దివ్యాంగాలు నీలగిరిపై తామరవనం పూచినట్లు ప్రకాశించాయి. నడుములోని ఒడ్డాణం, బాహువలయాలు, మకరకుండలాలు, హారాలు, కిరీటాలు - అనే దివ్యాభరణాలు తళతళమని ప్రకాశించాయి. ఆ స్వామి పార్శ్వంలో హంసవంటి గమన సౌందర్యాన్ని, జింకకన్నులవంటి కన్నులను, నెమలి పింఛంవంటి కురులను, మెఱుపువలె సన్నని అందమైన నడుమును, వెదుళ్ళవంటి బాహువుల అందాన్ని,



బంగారుభరిణవంటి స్తనసౌందర్యాన్ని, దొండపండువంటి అధరాల సొబగును, బేడిస చేపలవంటి నేత్రాల సౌందర్యాన్ని కల లక్ష్మీదేవి లేతప్రబ్బలి తీగవలె వేంచేసి ఉండడాన్నికూడా సేవించాను. ఆ సన్నివేశాన్ని సేవించగానే నా తెలివిని పూర్తిగా కోల్పోయాను. నాకు పలు వికారాలు కలిగాయి. ఈ విధంగా బాధపడుతున్న నాకు సముద్రఘోష ఇంకా ఇంకా హింసించడం ఆరంభించింది. అందఱికి భోగ్యమైన వెన్నెల నాకు అగ్నిని కురిసింది. సహజంగా చల్లని వెన్నెల నన్ను కాల్చేటట్లుగా కల్పించినవారెవరో తెలియదు.

ఇంత మాత్రమేనా! అందఱికి ఆనందకరంగా మలయపర్వతంనుండి వీచే మలయమారుతం నాకు నిప్పులను వీస్తున్నది. తాటిచెట్టుపైన తామరతూండ్లతో కట్టిన గూటిలో ఉండే క్రౌంచపక్షుల జంటలోని ఆడపక్షి చిన్న గొంతుతో కూయడం కూడా నా మనస్సును చీలుస్తున్నది. ఏమి చేయను? కఠినుడైన మన్మథుడు తన చెఱకువింటిని వంచి, నన్నే లక్ష్యంగా చేసికొని పుష్పబాణాలను ప్రయోగిస్తున్నాడే! నేను దీనికి తప్పి బతికిబయటపడేటట్లు చేసేవారెవరూ లేరే! నా దేహగుణాలు, ఆత్మగుణాలు తిరుక్కణ్ణపురంలోని స్వామియొక్క సంశ్లేషానికి ఉపయోగపడక పోతే వీటివల్ల ఏమి ప్రయోజనం? ఎవరూ ప్రవేశించలేని అరణ్యంలో, సువాసన అతిశయించిన పూలు పూచి సువాసన వీస్తే ఎవరికి ఏమి ఫలం? భగవానునితో ఆలింగనం చేసికోలేక వ్యర్థంగా పెరిగి పడి ఉండే ఈ స్తనాలు లేకుండా పోయే మందు ఇచ్చేవారెవరూ లేరే! చెవులకు తీయగా వినదగిన, గిత్తల మెడలోని గంటల చప్పుడు నా చెవులకు ఇపుడు కఠోరంగా విన్పిస్తున్నది. ఈ దుఃఖాలన్నీ తీరి నేను జీవించే తీరు ఏదైనా ఉన్నదా? చెప్పండి.

మలయమారుతం మొదలైన ఇవి అన్నీ నాపై దండెత్తేటట్లుగా చేసిన మహానుభావుడు ఎవరో నాకు తెలియకపోలేదు. అతడు ఎవరు? అంటే, తులసీ మాలను వక్షఃస్థలంలో కల్గినవాడు. చంద్రునకు కల క్షయరోగాన్ని పోగొట్టి రక్షించిన వాడు. కాలమేఘరూపుడు. అతసీకుసుమవర్ణుడు. సముద్రంలో వారధిని కట్టి లంకలో ప్రవేశించి, యుద్ధరంగంలో రావణుని సంహరించినవాడు. దేవతలకు అందఱికి కులపాతకుడైన హిరణ్యకశిపుని నరసింహరూపాన్ని దాల్చి, తన ఒడిలో పెట్టుకొని వక్షఃస్థలాన్ని చీల్చి వధించినవాడు. శ్రీ సుదర్శనాన్ని ధరించిన గొప్ప వీరుడు. వరాహావతారాన్ని ఎత్తి, భూదేవిని ఉద్ధరించినవాడు. సముద్రాన్ని చిలికి దేవతలకు అమృతాన్ని అనుగ్రహించినవాడు. వామనరూపియై మహాబలిదగ్గరకు పోయి,

మూడడుగులు యాచించి త్రివిక్రముడై లోకాలను అన్నిటినీ కొలిచినవాడు. సాక్షాత్తు శ్రియఃపతి అని నాకు బాగా తెలుసు.

ఇటువంటి స్వామిని తిరువిణ్ణగర్, తిరుక్కుడన్దై..... తిరుక్కణ్ణపురమ్, తిరునఱైయూర్ మొదలైన దివ్యదేశాలను చేరి సేవించి, "స్వామీ! ఈ విధంగానే నా నన్ను చేయివిడువడం! విరహం తిన్న ఈ శరీరాన్ని చూడు" అని నా అవస్థను విన్నపిస్తాను. దానిని విని మనస్సులో కఱగి, తన వక్షస్సులో నన్ను అతడు హత్తుకొనక పోతే, స్త్రీలు, వైదికులు, భక్తులు, ప్రభువులు గుమిగూడి ఉండే చోట్లు అన్నిటివద్దకు పోయి, అతని సమాచారాలను అన్నిటినీ పలువురికి తెలిసేటట్లుగా చాటింపు వేస్తాను.

అది ఏవి? అని అంటే, రేపల్లెలో పెరుగును, వెన్నను దొంగిలించి, గోపికల చేతికి చిక్కుపడి, రోటికి కట్టబడి, వెక్కి వెక్కి ఏడ్చి నిలచిన సన్నివేశం; దేవేంద్రునకు పెట్టిన అన్నాన్ని అంతా తానే ఒక గొప్ప భూతరూపాన్ని దాల్చి, కడుపార భుజించిన లజ్జాహీనత; సేవకుడు అని పలువురు నిందించేటట్లుగా పాండవులకు దూతగా పోయిన పోక; "కూత్తాడి" అని కన్యలు పలికేటట్లుగా కుంభనృత్యాన్ని చేయడం; తనను ఆశపడి వచ్చిన శూర్పణఖయొక్క చెవులను, ముక్కును కోసిన నీచకార్యం; ఒక ఋషి మాటను విని తాటక అనే స్త్రీని వధించిన అల్పకృత్యం; ఇటువంటి ఇంకా పలు సమాచారాలను వీథిలో ప్రస్తావించి పల్లెలు, పట్టణాలు బాగా తెలిసేటట్లుగా మడల్‌ను ఎక్కుతాను; చూడండి.



శ్రీమతే రామానుజాయ నమః



తిరుమఙ్గై ఆళ్వార్ అనుగ్రహించిన

# పెరియ తిరుమడల్

పిళ్ళై తిరునఱైయూర్ అరైయర్ అనుగ్రహించిన

తనియన్

పొన్నులకిల్ వానవరుమ్ పూమకళుమ్ పోఱ్ఱి శెయుమ్*
నన్నుతలీర్! నమ్బి నఱైయూరర్* - మన్నులకిల్
ఎన్నిలైమై కణ్డు మిరఙ్గారే యామాకిల్*
మన్ను మడలూర్‌వన్ వన్దు.

నల్ నుతలీర్ = అందమైన నుదుటి భాగాన్ని కలవారలారా !, పొన్ ఉలకిల్= పరమపదంలో, వానవరుమ్ = నిత్యసూరులు, పూ మకళుమ్ = లక్ష్మీదేవి, పోఱ్ఱి శెయ్యుమ్ = మంగళాశాసనం చేసే, నమ్బి నఱైయూరర్ = పరిపూర్ణుడైన తిరునఱైయూర్ నమ్బి, మన్ను ఉలకిల్ = నిత్యమైన భూలోకంలో, నిలైమై కణ్డుమ్= నా దశను చూచిన తరువాత కూడా, ఇరఙ్గారే ఆమాకిల్ = కరుణను చేయకపోతే, వన్దు = వారున్న చోటికి వచ్చి, మన్నుమ్ మడల్ ఊర్వన్ = స్థిరంగా మడల్‌ను ఎక్కుతాను.

## శ్రీపిళ్ళైలోకమ్ జీయర్ అనుగ్రహించిన

## తనియన్ వ్యాఖ్యానం - అనువాదం

### అవతారిక

అవతారిక :- (పొన్నులకిల్ వానవరుమ్) - ఈ పెరియ తిరుమడల్ అనే ప్రబంధంలో తిరుమఙ్గై ఆళ్వార్లు వ్యక్తం చేసిన భావాన్నే పిళ్ళై తిరునఱైయూర్

అరైయర్ అనే ఆచార్యులు ఈ తనియన్ పాశురంలో తెలుపుతున్నారు. అందటిచే స్తుతింపబడే పూర్ణుడు, ఈ లీలావిభూతిలో భక్తికర్షకుడు అయిన భగవానుడు తాను నాలో పైరు చేసిన పరభక్తి - పరజ్ఞాన - పరమభక్తులనే గొప్పతనాలను చూచి దయను నాపై చూపకపోతే, అతనినే ఉపాయంగా గ్రహించిన నా స్థితి (భగవానుడు వచ్చి తీసికొని పోయేవరకు భక్తుడు వేచి ఉండాలనే స్థితి) చెదిరేటట్లుగా నా గొప్ప ప్రావణ్యాన్ని (భక్తిని) వ్యక్తం చేస్తాను- అని భావం.

వ్యాఖ్యానం : **(ఎన్నిలైమై ఇత్యాది)** చక్కని ఫాలభాగాన్ని (నుదురును) కలవారలారా ! గుణపూర్ణుడు (నమ్బి)అయిన స్వామి నా ఆర్తస్థితిని చూచికూడా దయ చూపనివాడైతే, నేను మడల్‌ను అనుష్ఠిస్తాను- **"నల్ నుతలీర్ ! నమ్బి ఎన్ నిలైమై కణ్డుమ్ ఇరఙ్గారేయామాకిల్ మన్ను మడలూర్‌వన్ వన్దు"** -అని అన్వయం.

**(నల్ నుతలీర్)** - చక్కని నుదురును కలవారలారా!- అని భావం. **"వాళ్ నుతలీర్"** (కాంతిని కల్గిన ముఖాన్ని కల్గినవారలారా!) అనే రీతిలో భగవద్భక్తి చేత కాంతి వెలువడే మిగిలిన ఆళ్వార్లను ఉద్దేశించి చేసిన సంబోధన ఇది.

**(పొన్నులకిల్ వానవరుమ్)** - **"హిరణ్మయే పరే లోకే"** (ముండక-2-2-10) (బంగారు మయమైన గొప్ప లోకంలో) అని చెప్పబడే హిరణ్మయమైన లోకంలో జీవించే సూరులని **"యత్ర పూర్వే సాధ్యాః"** అని అన్నట్లు సాధ్యులని కీర్తింపబడే నిత్యసూరులుకూడా- అని భావం.

**(పూమకళుమ్)** - కమలవాసిని అయిన లక్ష్మీదేవి. పూవులో ఉండే పరిమళం అంతా మూర్తీభవించిందా! అని అన్నట్లు ఉండే లక్ష్మీదేవి.

**(పోఱ్ఱి శెయుమ్)** - మంగళాశాసనం చేసే - అని భావం. **"పరతనుమ్ నమ్బి శత్తురుక్కనుమ్ ఇలక్కుమనోడు మైతిలియుమ్ ఇరవునన్ పకలుమ్ తుతి శెయ్య నిన్ఱ ఇరావణాన్తకనై"** (పెరియతిరు- 2-3-7) (భరతుడు, భక్తిపూర్ణుడైన శత్రుఘ్నుడు, లక్ష్మణునితోపాటు మైథిలి రాత్రి పగలు సదా స్తుతిస్తూ ఉండగా వేంచేసి ఉండే రావణాంతకుడైన శ్రీరాముని) అనే రీతిలో నిత్యసూరులు, లక్ష్మీదేవికి మంగళాశాసనం చేసే నఱైయూర్ నమ్బి- అని భావం. లేక, **"పూమకనుమ్"** అనే పాఠాంతరాన్ని గ్రహిస్తే "స్వర్గలోకంలోని ఇంద్రాదిదేవతలు, భగవానుని నాభీ కమలంలోనుండి పుట్టిన బ్రహ్మ స్తుతించే'' - అనే అర్థం వస్తుంది. స్తుతించడానికే కదా **"మున్నమ్ తిశైముకనై త్తాన్ పడైత్తతు"** (పెరియ తిరుమడల్-10) (పూర్వం చతుర్ముఖుని తాను సృష్టించాడు)



**(నమ్బి నఱైయూరర్)**- తిరునఱైయూర్ అనే దివ్యదేశంలో వేంచేసి ఉండే గుణపూర్ణుడు.

**(నమ్బి)** **"తిరునఱైయూర్‌నమ్బి"** అనే తిరునామాన్ని కలవాడు. తిరునఱైయూర్‌కు వచ్చిన తరువాత అతడు సౌలభ్య-సౌశీల్యాది గుణాలను పూర్ణంగా పొందాడు.

**(ఎన్ నిలైమై కణ్డుమ్)** - భక్తిసస్యకర్షకుడైన తాను చాలా ప్రయత్నించి నాలో పైరు చేసిన పరభక్తి- పరజ్ఞాన- పరమభక్తులచే పరిపూర్ణుడనై ఉండే నా వైలక్షణ్యాన్ని చూచిన తరువాతకూడా- అని భావం. **"పేరాళన్ పేరోతుమ్ పెణ్ణై మణ్ మేల్ పెరున్తవత్తాళ్ ఎన్ఱల్లాల్ పేశలామే"** (తిరునెడు-20) అనే రీతిలో కదా ఈ పరకాల నాయకి వైలక్షణ్యం ఉన్నది. "ఎన్ నిలైమై" అంటే "నా వైలక్షణ్యాన్ని'' అని భావం. లేక, దయచూపించదగ్గ నా దశ- అనే అర్థాన్ని కూడా చెప్పవచ్చు.

**(మన్నులకిల్ ఎన్ నిలైమై కణ్డుమ్)** - నిత్యమై ఉండే ఈ భూమిలో నా దయనీయ స్థితిని చూచికూడా.

**(మన్నులకిల్)** - ఈ లోకం త్వరలో నశించిపోయేటట్లు అయితే అపుడయినా నా బాధకు దుఃఖానికి ఒక అంతం ఉంటుంది. ఆ విధంగా ఈ లోకం త్వరలో నశించిపోయేటట్లుగా లేదే! (**"మన్"** అనే పదప్రయోగంలోని స్వారస్యం ఇది) ఈ లోకం స్థిరంగా నిలచి ఉండేది కదా!

**(ఎన్ నిలైమై కణ్డుమ్)** **"తాతొడు వనమాలై తారానో! ఎన్ఱెన్ఱే తళర్న్దాళ్"** (పెరియ తిరు-5-5-6) అనికదా ఈమె స్థితి ఉన్నది.

**(ఇరఙ్గారేయామాకిల్)** - ఈ స్థితిలోకూడా **"వణ్డు తికழுమ్ తణ్ణమ్ తుழாయ్ కొడీర్"** (తిరువాయ్-2-4-5) (తుమ్మెదలు ప్రకాశించే చల్లని, అందమైన తులసిని ఇవ్వండి) **"ఇరక్కమెழீర్"** (తిరువాయ్-2-4-3) అనే రీతిలో దయలేని వారై ఉండేవారైతే.

**(మన్ను మడలూర్‌వన్ వన్దు)** - తాము ఉన్నంతవరకు నా మడల్ నిత్యంగా అనువర్తిస్తుంది.

**(మడలూర్‌వన్)** - మడల్ (తాటిమట్ట) చేతిలో కల్గినదాననై (**"మడల్"**ను అనుష్ఠించేదాననై), తనకు ఉండే గుణపూర్తిని అంతటిని పాడుచేస్తాను. అందరూ

ఈమెను ఇంత నిర్దయగా బాధిస్తున్నాడే ! అనుగ్రహించడం లేదే ! ఎంత కఠినుడు ! అని నిందించేటట్లు చేస్తాను.

ఈ తనియన్ పాశురంద్వారా "అతడు వేగంగా నన్ను స్వీకరించేటట్లుగా నాగొప్ప ప్రేమను మడల్‌ను అనుష్ఠించడంద్వారా వ్యక్తం చేస్తాను"- అని ఆళ్వార్లు చెప్పినట్లయింది. ఈమె ఈ ప్రయత్నం సాధనకోటిలోనికి చేరుతుందా ? అని అంటే, అన్వయించదు. భగవానుని మాత్రమే ఉపాయంగా స్వీకరించిన ఈమె చేసే ఇటువంటి ప్రయత్నాలన్నీ భగవానుడనే విషయంయొక్క వైలక్షణ్యాన్ని తెలిసినందువల్ల కలిగే ఆర్తిచేత ఏర్పడినవి; అంతే. ఈమెను (పరకాలనాయకిని) పొందడానికి అతడు చేసే ప్రయత్నాలే సాధనంలోకి అన్వయిస్తాయి. **"ఇత్తలైయాల్ వరుమతు చైతన్యకార్యమ్; అత్తలైయాల్ వరుమతు సాధనమ్"** అని శ్రీ పిళ్ళైలోకమ్ జీయర్ వ్యాఖ్యానసూక్తి.

తనియన్ వ్యాఖ్యానానువాదం సంపూర్ణం





శ్రీమతే రామానుజాయ నమః

తిరుమజ్ఞై ఆళ్వార్ అనుగ్రహించిన

# పెరియతిరుమడల్

## పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానం- అవతారికానువాదం

**"పెరియ తిరుమడల్"** అనే ఈ ప్రబంధం, **"శిఱియ తిరుమడల్"** ప్రబంధం వలెనే, భక్త్యుత్కర్షవల్ల పరాంకుశనాయకి (తిరుమజ్ఞై ఆళ్వార్లు) తన స్వరూపాన్ని, పరస్వరూపాన్ని తెలియనీయకుండా కళ్ళు గిర్రున తిరిగేటట్లు చేసే దివ్యప్రబంధం. తన స్వరూపాన్ని పాడుచేసికొని మడల్ ఎక్కి అయినా పరమపురుషుని పొందాలని చేసే ఈ ప్రయత్నం, ధాన్యాన్ని పొందలేనివాడొకడు ధాన్యపు కంకులను దారికాని దారిలో వేగించి, అందులో వేగిన ధాన్యపు పేలాలను (లాజలను) కొఱకడంతో (తినడంతో) సమానం అవుతుంది. నాయకి చేసే ఈ అతిమాత్ర ప్రవృత్తిని చూచి ఆమెకు చెందినవారు, నాయకుని గుణహానిని నాయకి నోటిద్వారానే విని అతనికి చెందినవారు, ఇరువురిని విడిచిపెడితే, అపుడు వేఱు గతి లేక ఇద్దరు కలిసి ఒక దారిలో పోవచ్చును- అని మడల్‌ను అనుష్ఠించే నాయకియొక్క ఉద్దేశ్యం.

"వాడినేన్ వాడి" (పెరియ తిరు-1-1-1) అని ప్రారంభించి శిఱియ తిరుమడల్‌వరకు భగవద్గుణాలతోనే పరిణతి చెందినందువల్ల ఆళ్వార్ల ఆర్తి అత్యంతం అతిశయించింది. అక్రమమార్గంలో ప్రయత్నించి అయినా భగవత్సాక్షాత్కారాన్ని పొందాలి-అని ఆళ్వార్లు కళ్ళు తిరిగి మోహించే రీతిలోని ఆళ్వార్ల ఆర్తిని తెల్పుతున్నది - ఈ ప్రబంధం. శిఱియ తిరుమడల్ కూడా అతని గుణాలను స్మరింజేసి ఆళ్వార్లకు ఆర్తిని ఎక్కువ చేసింది. కాని భగవానుడు అనుగ్రహించలేదు. అందువల్ల, చిన్నపాటి యుద్ధంలో ఓడినవారు గొప్ప సైన్యాన్ని సమీకరించుకొని పెద్ద యుద్ధానికి సన్నద్ధం అయేటట్లు, పెరియ తిరుమడల్ అనే ఈ ప్రబంధాన్ని ఆళ్వార్లు (నాయకీభావంతో) ఆరంభిస్తున్నారు.

భగవానునితో కలసి, విశ్లేషాన్ని పొంది అతనిని పొందకుండా తాను ప్రాణధారణను చేయలేనందువల్ల **"మడల్‌ను ఎత్తి అయినా భగవానుని దర్శించాలి"** అని ప్రయత్నించే ఒక నాయకి దశ తమకు కలుగగా, ఆ దశలో ఈ ప్రబంధాన్ని పల్కుతున్నారు.

"మడల్" అనేది- నాయకీనాయకులకు దోషావహంకదా! అని అంటే, గుణాన్ని ఆదరించి ఫలాన్ని పొందనపుడు, దోషాన్ని కల్గించుకొని అయినా ఫలాన్ని పొందడమే అపేక్షితం- అని తెలుపుతున్నది ఈ ప్రబంధం. **"రామస్య దయితా భార్యా నిత్యం ప్రాణసమాహితా"** (రామునకు ప్రియమైన పత్ని, ఎల్లప్పుడు ప్రాణంవలె మంచిని కల్గించేది) (రామా-బాల-1-26) అని, **"మమైవ దుష్కృతం కించిన్మహదస్తి న సంశయః, సమర్థా వపి తౌ యన్మాం నావేక్షేతే పరంతపౌ"** (శత్రువులను నశింపజేసేవారు, దేనినైనా చేయగల సమర్థులు అయిన రామలక్ష్మణులు నన్ను గమనించకపోవడాన్నిబట్టి, నేను చేసిన పెద్దదైన ఒక దోషం ఉన్నది -అనడంలో సందేహం లేదు) (రామా-38-47) అని, **"స్వస్త్యస్తు రామాయ సలక్ష్మణాయ తథా పితు ర్మే జనకస్య రాజ్ఞః"** (లక్ష్మణునితో కూడిన శ్రీరామునకు, నా తండ్రి అయిన జనకమహారాజుకు మంగళం కలగాలి) (రామా-సుందర-32-9) అని, **"న మంథరాయా న చ మాతు రస్యా దోషో న రాజ్ఞో న చ రాఘవస్య"** (మంథర, నా తల్లి అయిన కైకేయి, రాజు అయిన దశరథుడు, శ్రీరాముడు- అనేవారి పాపంవల్ల రాఘువుడు వనానికి వెళ్ళలేదు. దానికి నా పాపమే కారణం) (రామ-) అని, **"యది ప్రీతిః మహారాజ! యద్యనుగ్రాహ్యతా మయి, జహి మాం నిర్విశంక స్త్వం ప్రతిజ్ఞా మనుపాలయ"** (స్వామీ! నా విషయంలో ప్రేమ ఉంటే, నేను అనుగ్రహింపదగినవాడనైతే, ఏ సందేహం లేకుండా నన్ను విడచిపెట్టు. నీ ప్రతిజ్ఞను కాపాడుకో) (రామా-ఉత్త- 106-4) అని, **"వళవేழులకు"** (తిరువాయ్-1-5-1) అనే దశకంలోను, **"మిక్క శీర్ తొణ్డరిట్ట పూన్తుళవిన్ వాశమే వణ్డు కొణ్డు వన్దూతుమాకిల్ కెణ్డెయొణ్కణుమ్ తుయిలుమ్ ఎన్ నిఅమ్ పణ్డుపణ్డు పోలొక్కుమ్"** (పెరియ తిరు- 11-1-9) అని పిరాట్టి, భరతుడు, లక్ష్మణుడు, నమ్మాழ్వార్ -అనే గొప్ప జ్ఞానులు, ఈ ఆழ్వార్లు భగవత్సమృద్ధిని కాంక్షించేవారై ఉండగా, **"ఉణర్వెనుమ్ పెరుమ్ పదమ్ తెతిన్దు నాడినేన్"** (పెరియతిరు-1-1-1) అని పలికే వీరి గొప్ప జ్ఞానానికి తగునా ఈ ఆழ్వార్లు చేసే ఈ ప్రయత్నం ? అని అంటే, ఇందులో వీరి జ్ఞానంయొక్క దోషం లేదు. పరమపురుషుని సౌందర్యంయొక్క దోషమే ఇది. సౌందర్యం మాత్రమే కాదు, అతని కల్యాణ గుణాలకుకూడా ఇందులో భాగం ఉన్నది. **"బహవో నృప ! కల్యాణగుణాః పుత్రస్య సంతి తే"** (ఓ రాజా! నీ కుమారునకు పలు కల్యాణగుణాలున్నాయి) (రామ-అయో-2-26) అని, **"ధాతూనా మివ శైలేంద్రో గుణానా మాకరో మహాన్"** (గొప్ప పర్వతం గైరికధాతువులకు ఆకరం అయేటట్లు శ్రీరాముడు కల్యాణగుణాలకు



నివాసభూమి) (రామా-కిష్కి-15-21) అని చెప్పబడే సద్గుణాలు సామాన్యులను సైతం అభినివేశాన్ని పొందిస్తున్నపుడు, గొప్ప భక్తిని కల వీరిని అభినివిష్టులను చేసి, దారి కాని దారిలో నడిపిస్తుంది- అని అనడం తగినదేకదా!

**"తుల్యశీలవయోవృత్తామ్"** (సమానమైన గుణాలు, వయస్సు, ప్రవర్తన మొదలైనవానిని, సమానమైన కులాన్ని, అందాన్ని కల్గినదైన ఈమే ఇతనికి తగినది) (రామా-కిష్కింధా-16-5) అనే రీతిలో అన్ని విధాలుగా పొందికను కల్గినవారైన నాయకీనాయకులు ఇరువురు తమ పుణ్యవశంవల్ల పరస్పరం కలిసి, అందువల్లనే విశ్లేషించి, ఒకరు ఇంకొకరి రాకను చాలాకాలం ఎదురు చూచినా రానందువల్ల, దృష్టోపాయాలు, అదృష్టోపాయాలు - ఏవీ వారిని కలుపనందున, భరించలేని గొప్ప ఆర్తి అతిశయించినపుడు, మడల్‌ను అనుష్ఠించి అయినా భగవానుని దర్శించాలి -అని ప్రయత్నించడం తగినదే. నాయకీనాయకులు సంగమించడం, విశ్లేషించడం పుణ్యఫలం- అని అనడం ఏవిధంగా పొసగుతుంది ? అని అంటే, "గాలికి, ఎండకు వాడి ఎండిన విత్తనం వర్షంవల్ల పూర్వంకంటే అందంగా అంకురించేటట్లు, విశ్లేషం ప్రేమను బహుగుణీకృతం చేస్తుంది కనుక విశ్లేషంకూడా పుణ్యఫలమే. దృష్టోపాయాలు అంటే- దూత్యాన్ని పంపించడం మొదలైన ప్రత్యక్షసిద్ధమైన ఉపాయాలు. అదృష్టోపాయాలు అంటే- **"తైయొరు తిజ్గళ్"** (నాచ్చియార్ తిరు-1) అనే దశకంలో గోదాదేవి మన్మథుని ఆశ్రయించడంవంటి శాస్త్రసిద్ధమైన ఉపాయాలు.

**"స్త్రియో వృద్ధా స్తరుణ్యశ్చ సాయం ప్రాత స్సమాహితాః, సర్వాన్ దేవాన్ నమస్యంతి రామస్యార్థే యశస్వినః"** (అయోధ్యాపురజనులు తాటకా, సుబాహు మారీచులను జయించి కీర్తిని గడించిన శ్రీరామునికోసం ఉదయంలో, సాయం కాలంలో దేవతలందఱికి నమస్కరిస్తున్నారు) అనే రీతిలో భగవానునిపట్ల దారి కాని దారిలో అయినా అభినివేశాన్ని ప్రదర్శించవలసి ఉండగా, క్రమం కాని రీతిలో అతనిని నిందించి, మడల్‌ను ఎత్తడం తగునా? అని అంటే, తగినదే. మడల్‌ను ఎత్తడం అంటే- తినకుండా, స్నానం చేయకుండా, తాను ప్రేమించే పురుషుని చిత్రాన్ని (లేక, స్త్రీని) ఒక పటంలో వ్రాసి, దానిని పట్టుకొని తిరగడం, ఇంకా ప్రేమబాధ ముదిరితే ఆ చిత్తరువు కాలిలో పడడం, ఆవిధంగా పడినపుడు నోటమాట రాకుండా పడి ఉండడం, ఆవిధంగానే పడి ప్రాణాలు విడువడంకూడా. ఇవి అన్నీ ప్రేమాతిశయంవల్ల సంభవించేవి కనుక, ప్రేమను వ్యక్తం చేసి, వృద్ధి

చేస్తాయి కనుక, ఈ కృత్యాలు ప్రేమికుల స్వభావానికి తగినవే. మూఢుడు సైతం నిష్ప్రయోజనమైన కార్యాలలో ప్రవర్తించడు కనుక, ఈ కార్యాల ప్రయోజనం ఏమి? అని అంటే, నాయకి యొక్క ఈ అతిప్రవృత్తిని గమనించి ఆమె ప్రేమికుడు చాలా వేగంగా పరుగెత్తి ఆమె వద్దకు రావడమే ప్రయోజనం. ఒకవేళ ఆవిధంగా రాకపోయినా, అతని విషయంలో తనకు గల ప్రేమాతిశయాన్ని వ్యక్తం చేసే, వృద్ధి చేసే ఈ కార్యాలు అన్నీ స్వయం ప్రయోజనాలు. అందువల్ల ఇవి ప్రయోజనాన్ని కల్గిన కార్యాలే.

**"కామినో వర్ణయన్ కామాన్ లోభం లుబ్ధస్య వర్ణయన్, నరః కిం ఫల మాప్నోతి కూపేఽంధ మివ పాతయన్"** (కాముకుల కామాలను వర్ణిస్తూ, లోభియొక్క లోభితనాన్ని వర్ణిస్తూ నూతిలోనికి గుడ్డివానిని గెంటివేసినట్లు, నరుడు ఏవిధమైన ప్రయోజనాన్ని పొందగలడు?) అని అంటూ కాముకుని కామప్రవృత్తిని వర్ణించడం చాలా నీచకార్యంగా చెప్పబడుతున్నది. విటపురుషుని కార్యం అని సత్పురుషులు దీనిని గర్హిస్తున్నారు. ఇది శాస్త్రనిషిద్ధం కూడా. సత్పురుషులు దీనిని నిషేధించారు. ఈ కారణాలవల్ల ఇది తగని కార్యమేకదా!- అని అంటే, శబ్ద-స్పర్శ-రూప-రస-గంధాలనే ప్రాకృతవిషయాలను అభిలషించేటపుడే ఆ దోషం ఏర్పడుతుంది. అప్రాకృతమై, **'ఉపాసీత'**, **'ధ్యాయీత'** అని వేదాంతాలలో విధింపబడే భగవద్భక్తియే ఇక్కడ కామంగా చెప్పబడుతున్నది. కనుక, ఆ దోషం అంటదు. **"వ్యవసాయాదృతే బ్రహ్మన్! నాసాదయతి తత్పరమ్"** (బ్రాహ్మణా! భక్తి అనే మనోనిశ్చయం లేకపోతే ఆ పరతత్త్వాన్ని పొందలేడు) (భార.శాంతి-334-47) అని, **"పరమాత్మని యో రక్తో విరక్తోఽపరమాత్మని, సర్వేషణావినిర్ముక్తః స భైక్ష్యం భోక్తు మర్హతి"** (పరమపురుషునిపట్ల ఎవడు ప్రేమను కల్గిఉండి, ఇతరవిషయాలపట్ల విరక్తిని కల్గి ఉన్నాడో, అతడు ధనాశ మొదలైన ఆశలు అన్నిటినుండి దూరమైనవాడై సన్న్యాసాన్ని స్వీకరించదగినవాడు) (బార్హస్పత్యస్మృతి) **"యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి"** (ఏ పరతత్త్వాన్ని కోరేవారు స్త్రీసంగరాహిత్యాన్ని అనుష్ఠిస్తున్నారో) (కఠ. 2-15) అనే భగవద్భక్తి అనబడే నిశ్చయమే ఒక్కడ కామమనబడుతున్నది. బంధువులను, దగ్గరివారిని అందఱిని దూరంగా తొలగదోయడమనే (త్యజించడ మనే) కార్యంలోని సామ్యాన్నిబట్టి సన్న్యాసాశ్రమాన్ని **"మడల్"** అని ఆళవన్దార్ అన్నారు. ఈ తిరుమడల్ ప్రబంధం ఆరంభంలో **"అఱమ్, పొరుళ్,వీడు"** (ధర్మార్థకామాలు). అనే పురుషార్థాలను మూడింటిని గర్హించడంలోని కారణం ఏమి? అని అంటే, జాబాలిమహర్షి శ్రీరామచంద్రుని సమక్షంలో ఆస్వామిని



ఆయోధ్యకు పిలుచుకొనిపోవాలి- అనే ఆశతో చార్వాకసిద్ధాంతానుసారంగా కొన్ని నాస్తికవాదాలను చేయగా, **"జాబాలిః బ్రాహ్మణోత్తమః"** (బ్రాహ్మణులలో ఉత్తముడైన జాబాలి) (రామా-అయో-108-1) అని శ్రీరామునిపట్ల అతనికి గల ప్రేమాతిశయాన్ని చూచి వాల్మీకి భగవానుడు అతనిని కీర్తించాడు. అదే రీతిలో ఇదికూడా కీర్తించదగినదే. ఆళ్వార్ల ఉద్దేశ్యం ధర్మార్థకామాలను నిందించడంలో కాదు. తమ పురుషార్థం అయిన భగవద్భక్తిరూపకామాన్ని కీర్తించడంలోనే దృష్టి. (ఇక్కడ "న హి నిందా" న్యాయాన్ని అన్వయించాలి).

"కడలన్న కామత్తరాకిలుమ్ మాతర్ మడలూరార్ మన్నియార్‌మేల్" అని అంటూ ద్రావిడగ్రంథాలలో పురుషులు మడల్ ఎక్కవచ్చు తప్ప, స్త్రీలు మడల్ ఎక్కరాదు- అని అంటూ ఒక నియమాన్ని, మర్యాదను ఏర్పరచారు కదా ! అని అంటే, రాజాజ్ఞవలె దానిని విధినిషేధవచనంగా గ్రహించకూడదు. కామ మనేది వారి వారి మనోభీష్టానికే కట్టుబడి ఉంటుంది కనుక, తాను అభిమానించే విషయంలో చాలా అభినివేశాన్ని పొందేవారు మడల్‌ను ఎత్తడంలో తప్పు లేదు. అది విధినిషేధాత్మకమైన వచనమే అయితే రాజు ఆజ్ఞకు కట్టుబడి ఉండే కామం కదా ప్రవర్తించాలి. కాని, ఆ విధంగా మనం గమనించడం లేదుకదా !

అయితే, ఆ విధంగా మడల్‌ను ఎక్కినవారెవరైనా ఉన్నారా ? అని అంటే, **"స దేవగంధర్వమనుష్యపన్నగం జగత్ సశైలం పరివర్తయామ్యహమ్"** (దేవతలు, గంధర్వులు, మానవులు, సర్పాలు మొదలైనవానితో కూడినదైన లోకాన్ని పర్వతాలతోపాటు తలకిందుచేస్తాను) (రామా-ఆర-64-75) అని, **"అశోక ! శోకాపనుద! శోకోపహతచేతసమ్, త్వన్నామానం కురు క్షిప్రం ప్రియసందర్శనేన మామ్"** (శోకాన్ని పోగొట్టే ఓ అశోకవృక్షమా ! నా ప్రేయసిని చూపించడంద్వారా దుఃఖం తీరిన మనస్సును కల నన్ను త్వరగా నీ పేరును కల్గినవాడను- అంటే - అశోకునిగా చేయాలి'') (రామా-ఆర-10-17) అని, **"న మే స్నానం బహుమతం వస్త్రాణ్యాభరణాని చ, తం వినా కైకయీపుత్రం భరతం ధర్మచారిణమ్'** (ధర్మ మార్గంలో ప్రవర్తించే కైకేయిపుత్రుడైన భరతుని వీడిన నాకు స్నానం చేయడం, మంచి వస్త్రాలను ధరించడం, ఆభరణాలను అలంకరించుకోవడం అభిమతం కాదు. నాకు ఇష్టపడడం లేదు.) (రామా.యుద్ధ-124-7) అని, **"యా న శక్యా పురా ద్రష్టుం భూతై రాకాశగై రపి, తా మద్య సీతాం పశ్యంతి రాజమార్గగతా జనాః"** (ఏ దేవిని ఆకాశంలో సంచరించే జీవరాసులు సైతం చూడలేకపోయారో,

ఆ సీతను ఇపుడు రాజవీథిలో ఉండే జనం అంతా చూస్తున్నారు) (రామా-అయో-33-7) అని, **"మన్నన్ ఇరామన్‌పిన్ వైదేవి ఎన్ఱురైక్కుమ్ అన్ననడైయ అణఙ్గు నడన్దిలళే"** (పెరియ తిరుమడల్ -10) అని- ఈ విధంగా ప్రేమకు వశులైనవారు ఈ విధంగా మడల్ ఎత్తడం అన్నది ఆచారంలో ఉన్నది. వాసవదత్త మొదలైనవారి విషయంలో దీనిని చూచాము. రాచకులంలో పుట్టినవారే ఈ మడల్ ఎత్తినట్లుగా ఈ ఉదాహరణాలవల్ల స్పష్టపడుచున్నది. ఈ పరకాలనాయకి రాజపుత్రియేనా? అని అంటే, **"స శ్లాఘ్యః స గుణీ ధన్యః స కులీనః స బుద్ధిమాన్, స శూరః స చ విక్రాంతో యం త్వం దేవి! నిరీక్షసే"** (ఎవనిని లక్ష్మీదేవివి అయిన నీవు కటాక్షిస్తున్నావో అతడే కీర్తించదగినవాడు. అతడే గుణవంతుడు, అతడే భాగ్యశాలి. అతడే సత్కులప్రసూతుడు. అతడే జ్ఞాని, అతడే శూరుడు, అతడే వీరుడు) అని, **"తేశమ్ తిఱలుమ్ తిరువుమ్ ఉరువుమ్, మాశిల్ కుడిపిఱప్పుమ్ మ*ఱ్ఱ*వైయుమ్, పేశిల్ వలమ్ పురిన్ద వాన్‌శఙ్గమ్ కొణ్డాన్ పేరోత నలమ్ పురిన్దు నన్గడైయుమ్ వన్దు"** (మూన్ఱామ్ తిరు-10) అని, **"కులమ్ తరుమ్ శెల్వమ్ తన్దిడుమ్ అడియార్ పడు తుయరాయన వెల్లామ్, నిలమ్ తరుమ్ శెయ్యుమ్ నీళ్ విశుమ్బరుళుమ్ అరుళొడు పెరునిల మళిక్కుమ్, వలన్దరుమ్ మ*ఱ్ఱు*మ్ తన్దిడుమ్ పె*ఱ్ఱ* తాయినుమ్ ఆయిన శెయ్యుమ్, నలమ్ తరుమ్ శొల్లై నాన్ కణ్డుకొణ్డేన్ నారాయణా ఎన్నుమ్ నామమ్"** (పెరియతిరు- 1-1-1) అని పలికే రీతిలో శ్రీమన్నారాయణుని కటాక్షంచేత రాజపుత్రికలకు ఉండే గొప్పతనం ఈమెకుకూడా ఉన్నందువల్ల ఈమె మడల్ ఎత్తడంలో లోటు లేదు. **"తుళమ్బుడు ముఱువల్ తో*ఴి*యర్ క్కరుళాళ్ తుణైములై శాన్దు కొణ్డణియాళ్, కుళమ్బుడు కువళై క్కణ్ణిణై యె*ఴు*తాళ్ కోల నన్ మలర్ కు*ఴ*ల్కణియాళ్, వళమ్బుడు మున్నీర్ వైయ మున్నళన్ద మాలెన్నుమ్ మాలిన మొ*ఴి*యాళ్"** (పెరియతిరు-2-7-2) అనే రీతిలో భగవానుని విశ్లేషించి, ఒక వాడిన మాలికవలె ఉండే ఈమెకు ప్రేమ అతిశయించి మడల్ ఎక్కాలని నిశ్చయించుకోగా, ఆ నిశ్చయంవల్ల ఈమె ముఖం, కార్చిచ్చు జల్లినవారి ముఖంవలె కోపాన్ని కల్గి కఠినంగా కన్పించకుండా, స్నానం చేసి విందుభోజనం చేసినవారి ముఖంవలె చల్లగా, అందం అతిశయించి ఉన్నది. **"నిర్గుణః పరమాత్మాఽసౌ దేహం తే వ్యాప్య తిష్ఠతి, తమహం జ్ఞానవిజ్ఞేయం నావమన్యే న లంఘయే"** (భార-ఆర-149-8) (అల్లైతాడు సంధించని వింటిని కల పరమపురుషుడైన శ్రీరామచంద్రుడు నీ తిరుమేనిలో వ్యాపించి ప్రకాశిస్తున్నాడు. జ్ఞానంచేత తెలియదగినవాడైన అతనిని నేను అవమానించను; దాటనుకూడా) (భార-ఆర-149-8) అని అంటూ భీమసేనుడు హనుమానునితో "శ్రీరామచంద్రుడు శ్రీహస్తంలో విల్లు అమరి ఉండే తిరుమేని నీ శరీరంలో సాక్షాత్కరిస్తున్నది'' అని అన్నట్లు ఈమె (పరకాలనాయకి) తిరుమేనిలో మడల్ ఎత్తాలనే నిష్చయం వ్యక్తం చేయడాన్ని చూచిన సఖి, **"ఒర్ప్పాల్ ఇవ్వొణ్ణుతల్ ఉ*ఱ్ఱ* నల్‌నోయిదు తేఱినోమ్"** (తిరువాయ్-4-6-1) అని ఈమె మడల్ ఎత్తే రీతిని తెలిసికొని, **"తయా సరాజర్షసుతోఽభిరామయా సమేయివా నుత్తమరాజకన్యయా, అతీవ రామః శుశుభేఽతికామయా విభుః శ్రియా విష్ణు రివామరేశ్వరః"** (రాజర్షి అయిన దశరథుని పుత్రుడు ఆ శ్రీరామచంద్రుడు, అందమైన, గొప్ప రాజకన్యక అయిన సీతాదేవితో కూడి, చాలా అభిలషింపబడే శ్రీదేవితో కలసిన దేవదేవుడైన విష్ణువు ప్రకాశించేటట్లుగా, చాలా ఎక్కువగా ప్రకాశించాడు) అని పలికే రీతిలో, "నీ ఆభిజాత్యం, అందం, గుణం మొదలైన గొప్పతనాలకు, అతని ఆ గొప్పతనాలకు తగినది కాదు- ఈ నిశ్చయం. లోకులు కూడా నిన్ను నిందిస్తారుసుమా ! నీ తల్లి దండ్రులు నిన్ను విడిచి వేస్తారు'' అని ఈమెను మడల్ ఎక్కనీయకుండ అడ్డుకోగా, **"ఎన్ శెయ్యుమ్ ఊరవర్ కవ్వై తో*ఴి* ! ఇని నమ్మై"** (తిరువాయ్ 5-3-2) అని, **"అన్నై ఎన్ శెయ్యిలెన్ ! ఊరెన్ శొల్లిలెన్ !"** (తిరువాయ్- 5-3-6) అని, **"యామ్ మడలూర్న్దుమ్ ఎమ్మా*ఴి*యఙ్గై ప్పిరానుడై త్తూమలర్ తణ్ణన్దు*ఴా*య్‌మలర్ కొణ్డు శూడువోమ్"** (తిరువాయ్ -5-3-10) అని మడల్‌ను ఎక్కడం తప్ప ఇంకొక జన్మసాఫల్యం ఇపుడు లేదు- అని నిరూపిస్తున్నది పరకాలనాయకి.

నాయకి త్వరగా మడల్ ఎత్తడం ఆరంభించకుండా, సఖికి బదులు పల్కడంలో కాలాన్ని గడపడం ఎందుకు ?- అని అంటే, **"చాప మానయ సౌమిత్రే!"** (లక్ష్మణా ! వింటిని తీసికొని రా) (రామా-యుద్ధ-21-22) అని, శ్రీరాముడు అనగానే ఆ సముద్రం పరుగెత్తి వచ్చినట్లు, **"మడలూర్‌తుమే"** (తిరువాయ్-5-3-9) అని నమ్మా*ఴ్వా*ర్లు అనగానే- **"ఇరైక్కుమ్ కరుమ్ కడల్‌వణ్ణన్"** (తిరువాయ్-5-3-11) అని అతడు పరుగెత్తి వచ్చినట్లు, "మనం మడల్- అని అనగానే ఆ సముద్రం క్షోభిల్లేటట్లు కలతచెంది నాయకుడు పరుగెత్తి వస్తాడు- అనే భావంతో రహస్యస్థలంలో దాగి నిలచి భయపెట్టినట్లు, బెదిరిస్తున్నది. సఖికూడా ఈమె పల్కిన బదులును వింటూ కాలక్షేపం చేస్తే ఇంతలో నాయకుడు రావచ్చు- అనే భావంతో "బదులు పల్కు'' అని అంటున్నది

అవతారికానువాదం సంపూర్ణం

తిరుమజ్ఞైయాఴ్వార్ అనుగ్రహించిన

# పెరియతిరుమడల్

**మన్నియ పల్పొఱి శేర్ ఆయిరవాయ్ వాళరవిన్***
**శెన్ని మణిక్కుడుమి త్తెయ్వచ్చుడర్ నడువుళ్*** **1**

మన్నియ = వర్ధిల్లాలి, పల్ పొఱి శేర్ ఆయిరమ్ వాయ్ వాళ్ అరవిన్ = పలు గీతలను (రేఖలను), వేయి నోళ్ళను, కాంతిని కల ఆదిశేషునియొక్క, శెన్ని మణి కుడుమి = పడగలలో ప్రకాశించే మాణిక్యాల శిఖల నుండి వెలువడుతున్న, తెయ్వమ్ శుడర్ నడువుళ్ = అప్రాకృతమైన జ్యోతిస్సుల నడుమ, మన్ని=

## పెరియవాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యానానువాదం

**(మన్నియ)** -మంగళం కలగాలి. అని భావం. శ్రీరాముడు, సీతాదేవి కలసి ఉన్న సన్నివేశాన్ని చూడగానే **'భద్రం తే"** (నీకు మంగళం) (రామా.బాల-73-28) అని జనకుడు అన్నట్లు, **"వాழియరో!"** (తిరువిరు-2) అని తిరువిరుత్త ప్రబంధ ప్రారంభంలో నమ్మాழ్వార్లు మంగళాశాసనం చేసినట్లు, **"యా మోషధివాయుష్మన్! అన్విష్యసి మహావనే"** (ఆయుష్మంతుడా! మహావనంలో అరుదైన ఓషధిని అన్వేషించేటట్లు, నీవు ఎవరినిగూర్చి అన్వేషిస్తున్నావో) (రామా-ఆరణ- 67-15) అని సీతావిశ్లేషంలో చూడగానే జటాయుమహారాజు మంగళాశాసనం చేసినట్లు మడల్ను ఎక్కాలనే ప్రస్తావం రాగానే నాయకి పల్లాణ్డు పాడుతున్నది. తన వాక్పటిమ తనకు తెలుసు కనుక, నా వాక్కులో చిక్కుకొని నశించిపోకుండా, నా కాలిపై పడి బ్రతికి స్వామి బయటపడనీ'' అని అంటున్నది పరకాల నాయకి ఆరంభంలో.

**(పల్ పొఱి)** - పలు రేఖలను (గీతలను) కల్గి ఉన్న (ఆదిశేషుడు) - అని అర్థం. బంగారంలో రత్నాలను పొదిగినట్లుగా, చూచిన చూపును తిప్పుకోలేని రీతిలో ఉండే అందాన్ని తెలుపుతున్నది.

**(శేర్)** -గీతలు ఆదిశేషుని శరీరంపై చేరి ఉండడం- పాలు, కలకండల కలయికవలె పరకాలనాయకికి పరమభోగ్యంగా ఉన్నది.



**మన్నియ నాకత్తణైమేలోర్ మామలై పోల్***
**మిన్ను మణిమకరకుణ్డలజ్గళ్ విల్ వీశ*** **2**

పొందికగా ఉండే, అ నాకత్తు అణైమేల్ = ఆ ఆదిశేషుడనే శయనంపై, ఓర్ మా మలై పోల్ కిడన్దు =విలక్షణమైన ఒక నల్లని గొప్ప కొండ శయనించినట్లుగా పరుండి, మిన్ను మణి మకర కుణ్డలజ్గళ్ విల్ వీశ = రత్నాలు ప్రకాశిస్తున్న మకరకుండలాలు

**(ఆయిరమ్)** - భగవానుని పుష్పహాసం (పూవువికాసం) వలె సుకుమారంగా ఉండే తిరుమేనిని స్పర్శించడంవల్ల (ఆదిశేషునకు) కల్గిన ఆనందం పెల్లుబికి ప్రవహించి, ఆ ఆనందమహాప్రవాహం వెలువడడానికి వీలుగా వేయి కాలువలు తవ్వినట్లున్నవి- ఆదిశేషుని వేయినోళ్ళు.

**(వాళరవిన్)** - **"వాళ్"** -కాంతి. భగవానుని స్పర్శవల్ల ఆదిశేషుని కాంతి వృద్ధి చెంది వెలుగుతున్నది. **"అహం పున ర్దేవకుమారరూప మలంకృతం తం సుత మావ్రజంతమ్, నందామి పశ్యన్నపి దర్శనేన భవామి దృష్ట్వైవ పునర్యువేవ"** (రామా-అయో-12-104) (దేవకుమారునివంటి రూపాన్ని కలవాడు, అలంకరింప బడ్డవాడు, నావైపు వచ్చే కుమారుడైన శ్రీరాముని మనస్సు అనే ఆంతరనేత్రంతో నేను చూడగానే ఆనందిస్తున్నాను. బాహ్యాచక్షువుతో చూస్తే ఇక తిరిగి యువకుడనే కాగలను) అని దశరథుడు, **"మహోత్సవ మివాసాద్య పుత్రాననవిలోకనాత్, యువేవ వసుదేవోఽభూత్ విహాయాభ్యాగతాం జరామ్'** (పుత్రుని ముఖం చూడగల్గి నందువల్ల గొప్ప ఉత్సవాన్ని అనుభవించినట్లుగా తనకు వచ్చిన వార్ధక్యాన్ని విడచి వసుదేవుడు యువకుడయ్యాడు) అని వసుదేవుడు కూడా పరమపురుషుని చూచిన వెంటనే ముసలితనం పోయి, యువకుడు అయినపుడు, అతనిని స్పృశించిన ఆదిశేషుడు కాంతిని గొప్పగా పొందడంలో ఆశ్చర్యమేమున్నది ?

**(శెన్ని మణిక్కుడుమి ద్దెయ్వచ్చుడర్ నడువుళ్)- "శెన్ని"** -శిరస్సు, ఇక్కడ ఈ పదం ఆదిశేషుని పడగలను తెలుపుతున్నది. **"మణి"** -ఆ పడగలలో ఉండే మణులు. **"కుడుమి"** ఆ రత్నాల కాంతిపుంజం. **"దెయ్వమ్"**- దివ్యమైన, అప్రాకృతమైన- అని అర్థం. ఆదిశేషుని పడగలపై గల మణులనుండి పుట్టి వ్యాపించే అప్రాకృతమైన కాంతిపుంజం నడుమ, తెల్లగా ప్రవహించే గంగనీటి అలలమధ్య ఉన్నట్లుగా స్వామి వేంచేసి ఉన్నాడు.

తున్నియ తారకైయిన్ పేరొళి శేర్ ఆకాశమ్*
ఎన్నుమ్ వితానత్తిన్ కీఴాల్ * - ఇరు శుడరై 3

ఇంద్రధనుస్సువలె ప్రకాశించగా, తున్నియ తారకైయిన్ పేర్ ఒళి శేర్ ఆకాశమ్ ఎన్నుమ్ = నిబిడమైన నక్షత్రాల పూర్ణకాంతి నిండిన ఆకాశం అనే, వితానత్తిన్ కీఴాల్ = మేల్కట్టు కింద, ఇరు శుడరై = పాంచజన్య శ్రీసుదర్శనాలనే రెండు

**(మన్ని)** పొందికగా, స్థిరంగా ఉండి - అని అర్థం. ఆదిశేషుని తిరుమేని భోగ్యతవల్ల, లక్ష్మీదేవి భోగ్యతయొక్క పర్యంతసీమ అయిన తన స్తనతటంతో అదిమి లేపినా నిద్రలేవని రీతిలో ఒళ్ళు మఱచి నిద్రపోతున్న -అని భావం.

**(అన్నాకమ్)** - ప్రకాశించే సర్పం అయిన ఆ ఆదిశేషుడు. కాంతిని పొందికగా కల్గిన ఆదిశేషుడు.

**(అణైమేల్)** - ఆదిశేషుడనే పర్యంకంపై.

**(ఓర్ మామలైపోల్)** - పాలకడలిలో ఒక నల్లని కాటుక కొండ పరుండి ఉన్నట్లున్నది.

**(మిన్ను మణి మకరకుణ్డలఙ్గళ్ విల్వీశ)** - తిరుమేనియొక్క వర్ణంతో ఏర్పడిన కారుచీకటిలో దారికోసం చేతిదీపాన్ని పట్టుకొన్నట్లున్నది - మకర కుండలాల కాంతి. మెఱిసే మణులను కల్గిన మకరకుండలాలు తమ కాంతిని చుట్టూ ప్రసరింపజేయగా.

**(తున్నియ తారకైయిన్ పేరొళి శేర్ ఆకాశమ్ ఎన్నుమ్ వితానత్తిన్ కీఴాల్)**- నిబిడంగా ఉండే నక్షత్రాలైన తారాగణాలయొక్క గొప్ప కాంతిని కల ఆకాశం వలె ఉండే ముత్యాల పందిరికింద- అనే అర్థాన్నికూడా గ్రహించవచ్చు. లేక, ఆకాశమనే ముత్యాలపందిరి కింద- అనే అర్థాన్నికూడా గ్రహించవచ్చు. "ఆకాశం వలె'' అని అన్నపుడు పైన కట్టబడిన మేల్‌కట్టును తెలుపుతుంది. ఆకాశం స్వచ్ఛంగా ఉండే స్వభావాన్ని పురస్కరించుకొని ఉపమానంగా చెప్పబడింది. నక్షత్రస్థానంలో ముత్యాలు కాంతిని వెలువరించే సామ్యంకూడా వివక్షితం.

**(ఇరు శుడరై మన్నుమ్ విళక్కాక ఏఱ్ఱి)** - శ్రీసుదర్శనాఴ్వాన్, శ్రీపాంచజన్యాఴ్వాన్ ఇతడు (భగవానుడు) అవతరించినచోటకు అంతా ఇతనితో పాటు పోయి అవతరిస్తారు కదా ! ఆ ఇద్దరిని స్థిరమైన, ఆరని దీపాలుగా వెలిగించి-



మన్నుమ్ విళక్కాక వేఱ్ఱి* మఱి కడలుమ్
పన్ను తిరై క్కవరి వీశ* - నిలమఙ్గై 4

తేజస్సులను, మన్నుమ్ విళక్కు ఆక ఏఱ్ఱి = ఏనాటికీ ఆరని దీపంగా వెలిగించి, నిల మఙ్గై తన్నై మునమ్ నాళ్ ఆళవిట్ట =పూర్వం ఒకానొక సమయంలో భూదేవిని

అని భావం. **"ఇరు శుడరై"** అని అనడం- లోకప్రసిద్ధమైన చంద్రసూర్యులను తెల్పుతున్నదనికూడా చెప్పవచ్చు. **"యోకత్తుఒక్కమ్ తలైక్కొణ్డపిన్నై త్తన్ నాబివలయత్తు ప్పేరొళి శేర్ మన్నియ తామరై మామలర్ పూత్తు అమ్మలర్‌మేల్ మున్నై త్తిశైముకనై త్తాన్ పడైక్క"** అని అంటూ ప్రళయకాలమహాజలంలో లోకాన్ని సృష్టించడంకోసం శయనించి ఉండడాన్ని తెలిపే ప్రకరణం అయినందుల్ల దానికి పిమ్మట ఏర్పడే ఈ ఇరువురు అపుడు దీపంగా ఉండే అవకాశం లేదుకదా ! అని అంటే, ఈ అర్థంలో ఈ అస్వారస్యం, క్లేశం ఉన్నందువల్లనే ముందు వేఱొక అర్థం తెలుపబడింది. లేక, **"ఇరు శుడర్‌కళ్"** అనే చంద్రసూర్యులను తెలిపే శబ్దాలు వారితో పోలిన కాంతిని కల శంఖచక్రాలను లక్షిస్తున్నవనికూడా చెప్పవచ్చు. ప్రబంధకర్త అయిన తిరుమఙ్గై ఆఴ్వార్లు అనంతరకాలానికి చెందినవారు కనుక, తమకు ముందు కాలంలో ఉండే చంద్రసూర్యవాచక శబ్దాలను ప్రయోగించడంలో లోటు లేదుకదా!

**(మఱి కడలుమ్ మన్ను తిరై క్కవరి వీశ)** - అలలు వీచే సముద్రం, తాను వ్యాపింపజేసిన అలలు అనే చామరాలతో వీచగా- అని అర్థం. సర్వేశ్వరుడు ఆదిశేషునిపై నిద్రిస్తున్నపుడు ఉండే అందాన్ని దర్శించిన ఆనందంవల్ల కిందుండే మన్నును పైకి కొనివచ్చేటట్లు విజృంభించే సముద్రం తాను విస్తరింపజేసిన కెరటాలు అనే చామరాలను వీచగా - అని అర్థం. గొప్ప కెఱటంగా వచ్చి, విఱిగిన చిన్న అలలు భగవానుని శ్రీచరణాలవద్దకు వచ్చి తాకి, పాదసంవాహనం చేయగా అతడు నిద్రిస్తున్నట్లున్నది - భగవానుని యోగనిద్రను చూస్తే సముద్రం ఎవరికోసం చామరాలను వీస్తున్నది? అని అంటే, **"మన్నియ శేవడియై ప్పన్నుతిరై క్కవరి వీశ"**-అని అన్వయించి శ్రీచరణాలకు చామరం వీస్తున్నది- అనే అర్థాన్ని గ్రహించాలి.

ఆ శ్రీచరణం ఎటువంటిది ? అని అంటే, **(నిలమఙ్గైతన్నై ముననాళ్ అళవిట్ట తామరైపోల్) "భూమి ర్భూమ్నాద్యౌ"** (భూసూక్తం) (గొప్పతనంచేత భూమి అనే పేరును పొందినది) అనే రీతిలో ఎవరికి పరిచ్ఛేదించడానికి సాధ్యం కాని రీతిలోకదా

తన్నై ముననాళ్ అళవిట్ట తామరైపోల్*
మన్నియ శేవడియై వానియఙ్గు తారకైమీన్* 5

కొలిచిన, తామరైపోల్ మన్నియ శే అడియై = తామరపూలవలె ప్రకాశించే ఎఱ్ఱని అందమైన శ్రీచరణాలను ఉద్దేశించి, మఱి కడలుమ్ మన్ను తిరై కవర్ వీశ = అలలు వీచే సముద్రుడు కెఱటాలనే చామరాలను వీచగా, వాన్ ఇయఙ్గు మీన్

భూమి ఉన్నది. ఆ విధంగా పరిచ్ఛేదించడానికి సాధ్యం కాని భూమిని ఎఱ్ఱని అందమైన తామరపూవువంటి శ్రీచరణంతోకదా భగవానుడు కొలిచాడు. మృదుత్వం, శైత్యం, కాంతి, పరిమళం, అందం- మొదలైనవానిలో ఏదో కొంచెం పోలిక ఉన్నందువల్ల తామరపూవు శ్రీచరణానికి ఉపమానంగా చెప్పబడింది.

**(ముననాళ్)** -పూర్వం ఒకానొకనాడు - అని భావం. లోకాన్ని కొలువడం పలు యుగాలకు పూర్వం సంభవించినా, భావనాప్రకర్షవల్ల వీరికి (ఆఴ్వార్లకు) కొద్ది సమయానికి ముందే ఆ సంఘటన జరిగినట్లుగా తోస్తున్నది.

**(అళవిట్ట తామరైపోల్)** - పూర్వం లోకాలను కొలిచినందువల్లనే ఈ తిరువడి కంది, ఎఱ్ఱబడి ఎఱ్ఱతామరవలె దర్శనమిస్తున్నది- అని నిరూపించ దగినట్లున్నది.

**(మన్నియ శేవడియై)** - మృదుత్వం మొదలైన కొన్ని గుణాలకు తామరపూవును ఒక చిన్న ఉపమానంగా చెప్పారు; అంతే. కొంచెం సేపు గడిస్తే అందం, సువాసన మొదలైనవి మాఱి, వాడిపోతుందికదా తామరపూవు. ఇది ఆ విధంగా కాకుండా ఈ గుణాలను అన్నిటినీ నిత్యంగా కల్గి ఉన్నది. "మన్నియ శేవడియై"- మాఱని ఎఱ్ఱదనాన్ని కల శ్రీచరణాలను -అని అర్థం. **"మన్నియ శేవడియై మఱి కడలుమ్ పన్ను తిరై క్కవరి వీశ"** అని పూర్వభాగంతో అన్వ యించాలి. ఇక, భూదేవి భగవానుని శ్రీచరణాన్ని సంవాహనం చేయడాన్నిగూర్చి తెలుపబడుతున్నది.

**(వానియఙ్గు తారకైమీన్ ఎన్నుమ్ మలర్ప్పిణైయల్ ఏయ్న్ద మఴైక్కూన్దల్)**- ఉత్తమనాయకి అయిన ఈమెకు నల్లని దీర్ఘమైన కేశాలు, అందులో అలంకరించుకొన్న కదంబమాల ఉండి ఉండాలికదా ! అవి ఉన్నవా ? అని అంటే, ఆకాశంలో సంచరించే నక్షత్రాలు, తారాగణాలనే అనే కదంబమాలచే అలంకరింప బడినదై, దానిని అంతర్భవింపచేసికోగల్గిన విస్తృతిని కల్గినదై, తాపహరమైన



ఎన్నుమ్ మలర్ప్పిణైయల్ ఏయ్న్ద* - మఴైక్కూన్దల్
తెన్ననుయర్ పొరుప్పుమ్ తెయ్వ వడమలైయుమ్* 6

ఎన్నుమ్ = ఆకాశంలో తిరిగే నక్షత్రాలనే, మలర్ పిణైయల్ ఏయ్న్ద = కదంబమాలను అలంకరించుకొన్నదై, మఴై కూన్దల్ = మేఘాలనే కేశాలను కల్గినదై, తెన్నన్ ఉయర్ పొరుప్పుమ్ దెయ్వమ్ వడమలైయుమ్ ఎన్నుమ్ ఇవైయే ములై

మేఘమనే కేశబంధాన్ని కల్గినది- ఈమె- అని భావం. నాయకుడైన సర్వేశ్వరుడు ఈమె ఒక సారి కేశపాశాన్ని విప్పి విడదీస్తే, అతని సర్వేంద్రియాలు సర్వవిధభోగా లను పొందగలిగేటట్లున్నది. **"తారకై"** - అశ్వినిమొదలైన ఇరవై ఏడు నక్షత్రాలు. **"మీన్"**-మిగిలిన తారాగణాలు.

**(తెన్ననుయర్ పొరుప్పుమ్ దెయ్వ వడమలైయుమ్ ఎన్ను మివైయే ములైయా)** - వైదికులు పూర్వకాలంలో పోగొట్టుకొన్న, మ్లేచ్ఛభూమి అయిన దక్షిణ దేశంలోని చేర, చోళ, పాండ్య రాజులచే "నాది-నాది'' అని అభిమానింపబడే తిరుమాలిరుమ్శోలై పర్వతం, సంసారిజనులు వచ్చి ఆశ్రయించేటట్లున్న సౌలభ్యంలోని గొప్పతనంతో అతిశయించి ఉండే శ్రీవేంకటాద్రి- అనే ఈ రెండిటిని తుంగ-పీన- కఠినస్తనాలుగా కల ఉత్తమ నాయకి ఈ దేవేరి అని తెలుపబడు తున్నది. తల్లి స్తనం ఆమె బిడ్డలు తనది అని అభిమానించేటట్లుగా, ఏ తేడా లేకుండా ఆశ్రయించేటట్లు ఉండే రీతిలోనే, ఈస్తనాలు కూడా ఉన్నాయి అని భావం. ఔన్నత్యంలోను, బలిసి ఉండడంలోను, కాఠిన్యంలోను వీటికంటే గొప్పదైన మేరువు, హిమవత్పర్వతం మొదలైన పర్వతాలు ఎన్నో ఉండగా, వాటిని భూదేవికి స్తనాలుగా చెప్పకుండా, ఈ రెండు పర్వతాలనే స్తనాలుగా చెప్పడంలో ఏమి కారణం ? అని అంటే, ప్రేమికుడు అభిమానించి, విడువకుండా శ్రయించి ఉండేవేకదా స్తనాలు. ఆవిధంగా సర్వేశ్వరుడు ఈ స్తనాలను కోరి విడువకుండా ఉంటాడు కనుక వీటినిగూర్చి పల్కుతున్నారు. **"తెన్కొళ్ తిశైక్కు త్తిలదమాయ్ నిన్ఱ తిరుమాలిరుమ్ శోలై తఙ్గళ్ కున్ఱమ్ కైవిడాన్"** (తిరువాయ్- 10-7-4) అని, **"పరన్ శెన్ఱుశేర్ తిరువేఙ్గడమ్"** (తిరువాయ్-3-3-4) అని పల్కినందువల్ల ఇవి స్తనాలుగా చెప్పబడ్డాయి. ఈ తిరుమాలిరుమ్శోలై పర్వతంయొక్క గొప్పతనాన్ని భావించికదా వాల్మీకి భగవానుడుకూడా శ్రీరాముడు వేంచేసి ఉండే చిత్రకూటపర్వతానికి దీనిని ఉపమానంగా పలికాడు. ఎక్కడ? అని అంటే, **"సుభగ శ్చిత్రకూటోஉసౌ గిరిరాజోపమో గిరిః"** (గిరిరాజు అని తిరుమాలిరుమ్ శోలైకు పేరు. తిరుమాలిరుమ్

ఎన్ను మివైయే ములైయా వడివమైన్ద*
అన్ననడైయ అణజ్గే* - అడియిణైయై 7

ఆ = తిరుమాలిరుమ్ శోలై పర్వతం, తిరువేంకటాచలం - అనే రెండిటిని రెండు స్తనాలుగా కల్గినదై, వడివు అమైన్ద = తగిన రూపాన్ని కల్గినదై, అన్నమ్ నడైయ = హంసల నడకలవంటి నడకలను కల్గినదై, అణజ్గు = దివ్యకాంత అయిన భూదేవి,

శోలైలో సాటి వచ్చే చిత్రకూట పర్వతం చాలా అందమైనది. (ఇపుడు ఈ ప్రమాణ శ్లోకం వ్యాఖ్యానింపబడుతున్నది.)

**(సుభగః)** - చాలా అందమైనది. కంటికి చాలా అందమైనది అయినా, ప్రియుడు ఆదరించకుండా ఉండవచ్చునుకదా! ఆ విధంగా ఉన్నదా? అని అంటే,

**(గిరిరాజోపమో గిరిః)** - భూదేవికి స్తనంవంటి తిరుమాలిరుమ్ శోలై పర్వతాన్ని పోలి ఉన్నది. దానిలోవలెనే ఇందులోకూడా ప్రియుడు నివసిస్తున్నాడా ? అని అంటే,

**(యస్మిన్ వసతి కాకుత్థ్సః)**- పిరాట్టియొక్క స్తనతటం కనుక శ్రీరాముడు దీనినికూడా అభిమానించి ఆశ్రయించి ఉన్నాడు.

**(యదధ్యాస్తే మహాతేజాః కుబేర ఇవ నందనే)** - దుష్టమృగాలు నిండిన ఈ చిత్రకూటపర్వత సానువులో మహాతేజస్వి అయిన శ్రీరాముడు, కుబేరుడు తనకు ఆనందాన్ని కల్గించే చైత్రరథంలో విడువకుండా ఉండేటట్లు, విడువకుండా ఉన్నాడు.

**(అసౌ చిత్రకూటః సుభగః)** - అటువంటి చిత్రకూటంకంటే గొప్పతనాన్ని పొందిన పర్వతం ఇంకొకటి లేదు.(ఇక,ప్రకృత ప్రబంధం వ్యాఖ్యానింపబడుతున్నది)

**(వడివమైన్ద)** - పర్వతాలనే స్తనాలకు తగిన రీతిలో భూదేవియొక్క తిరుమేని కూడా పొందికగా ఉన్నది.

**(అన్న నడైయ)** - హంసగతిని పోలిన నడకను కల్గినదై, నాయకునితో కలయిక కోసం అతని సమక్షంలో నాలుగు అయిదు అడుగులు నడిస్తే, అతడు ఈ నడకకే దాసుడై, వేఱొక దానిని దేనినీ మనస్సులో భావించని రీతిలో ఈమె నడక ఉన్నది.

**(అణజ్గే)** - **"శూరు మణజ్గుమ్ దెయ్వప్పెణ్ణే"** అనే నిఘంటువచనానుసారం దైవకాంతను తెలిపే పదం కనుక ఇది అప్రాకృతమైన స్వభావాన్ని కల్గినది- అని



త్తన్నుడైయ అజ్గైకళాల్ తాన్ తడవ త్తాన్ కిడన్దు* - ఓర్
ఉన్నియ యోకత్తుఉక్కమ్ తలైక్కొణ్డ 8

తన్నుడైయ అమ్ కైకళాల్ అడి ఇణైయై తడవ = తన అందమైన చేతులతో శ్రీచరణాలను సంవాహనం చేస్తూ ఉండగా (ఈ విధంగా ఇటువంటి వైలక్షణ్యాలతో), కిడన్దు = గొప్పగా పరుండి, ఓర్ ఉన్నియ యోకత్తు ఉఅక్కమ్ తలైక్కొణ్డ

తెలుపుతున్నది. ఇక్కడ స్తనాలని, సంగమమనే పదాలతో పల్కినది ప్రాకృతమైన, నీచమైన అల్పానందాన్ని కాదు. అప్రాకృతమైన మహానందాన్ని సూచించేవానినే అవి తెలుపుతున్నవని తెలియాలి. ఆవిధంగా కాకుండా, ఇంతకు ముందు, భగవానునకు భోగ్యంగా ఉండడానికి తగిన భూదేవి స్వభావాలు తెలుపబడ్డాయని, **"అణజ్గే"** అనే పదం బిడ్డలైన తమకు భూదేవి దైవంవలె ఆశ్రయించదగినదై ఉండే రీతిని తెలుపుతున్నదనికూడా చెప్పవచ్చు. **"దేవతాభిః సమా"** (రామా-బాల- 77-30) (సీతాదేవి దేవతలతో సమానం) అని వాల్మీకి, **"త్రయాణాం భరతాదీనాం భ్రాతౄణాం దేవతా చ యా, రామస్య చ మనఃకాంతా"** (రామా-సుంద-55-26) (భరతుడు మొదలైన ముగ్గురు తమ్ములకు ఏ దేవి దైవమై ఉన్నదో, శ్రీరామునకు భోగ్యభూతయై ఉన్నదో) అని అన్నట్లు, సీతాదేవి తమ్ములు ముగ్గురికి దైవం, శ్రీరామునకు మనఃకాంత. అందువల్ల ఈవిధంగా నల్గురికి ఆశ్రయించదగినదై ఉన్నది- అని హనుమానుడు పల్కినట్లే పల్కుతున్నారు.

**(అడి యిణైయై)** - ఈ విధంగా అప్రాకృతస్వభావాన్ని కల్గిన ఈమె సైతం తాకడానికి జంకేటట్లుగా చాలా సుకుమారంగా ఉండే శ్రీచరణాలను- అని భావం.

**(తన్నుడైయ అజ్కైయాల్)** - సర్వేశ్వరుడైన అతడుకూడా కోరి ఆశించే గొప్పతనాన్ని కల తన అందమైన శ్రీకరాలతో.

**(తాన్ తడవ)** - ఎవరైనా తనకు ధారకమైన వస్తువును ఇతరులచే తాగించి తాను బ్రతుకగలరా ? అందువల్ల భూదేవి తనకు ధారకం అయిన శ్రీపాదసేవను తానే స్వయంగా చేస్తున్నది. శ్రీచరణాలను సేవిస్తే జీవించగల్గి, లేకపోతే ప్రాణం నిలుపుకోలేనట్లుండే ఆర్తిని కల్గినదై, తానే స్పృశిస్తున్నది- అని భావం. ఈ విధంగా, సముద్రం చామరం వీచగా, భూదేవి శ్రీచరణాలను సంవాహనం చేస్తుండగా సర్వేశ్వరుడు నిద్రిస్తున్నాడు.

పిన్నై తన్నాబివలయత్తు ప్పేరొళి శేర్*
మన్నియ తామరై మామలర్ పూత్తు* - అమ్మలర్మేల్ 9

---

పిన్నై= సాటిలేని జగద్రక్షణాన్నిగూర్చి చింతించే యోగనిద్రను స్వీకరించిన తరువాత, తన్ నాబి వలయత్తు = తన నాభీమండలంలో, పేర్ ఒళి శేర్ = గొప్ప కాంతి నిండుగా ఉండే, మన్నియ తామరై మా మలర్ పూత్తు = ఏనాటికీ నశించని

---

**(తాన్ కిడన్దు)** - సహజంగానే అన్నిటిని తెలిసినవాడై, ఏ కారణంవల్ల కూడా, ఏవిధంగాను కాలుష్యం లేనివాడైన అతడు (భగవానుడు) ఈమె (భూదేవి) సంవాహనం చేసినందువల్ల కల్గిన గొప్ప ఆనందంచేత, సముద్రం చామరం వీచడం, ఈమె శ్రీచరణాలను సంవాహనం చేయడంకూడా తెలియకుండా నిద్రిస్తున్నాడు స్వామి.

**(ఓర్ ఉన్నియ యోగత్తుఒక్కమ్ తలైక్కొణ్డపిన్నై)** - సాటి లేని భావనా రూపమైన యోగనిద్రను స్వీకరించిన తరువాత - అని భావం. సామాన్యులైన మనవంటి వారికి మనస్సులో చీకట్లు ముసురుకొని ఉంటాయి. నేత్రాలను తెఱచినపుడు బాహ్యవస్తువులు మాత్రం కొంచెం ప్రకాశిస్తాయి. కన్నులను మూసికొంటే బాహ్యవస్తువులు సైతం మఱుగుపడి మనస్సులో ఒకే చీకటి నిండి ఉంటుంది. ఇతనికి ఈ విధంగా ఉండదుకదా. **"పశ్యత్యచక్షుః"** అనే రీతిలో కంటితో చూచేవాడు కాడుకదా ఇతడు. అందువల్ల ఇతడు కన్నులను మూసికోవడం ఇతని మనస్సు లోపల సాగే భావనలను వృద్ధి పొందిస్తుంది. **"ఉణ్ణువతు"**- అను సంధించడం - అని అర్థం. **"యోగత్తుఒక్కమ్"** -మనవలెనే రజస్తమోగుణాలు ప్రకోపించడంవల్ల నిద్రించేవాడు కాడితడు. **"ఉఱఙ్గువాన్‌పోల్ యోకు శెయ్‌త పెరుమాన్"** (తిరువాయ్-5-4-11) అని చెప్పబడే నిద్రకదా ఇతని నిద్ర. ఈ చేతనుడు (జీవుడు) ఒక సన్మార్గాన్ని పొంది సంసారసాగరంనుండి దరి చేరే దారి ఏది?'' అనే లోకరక్షణచింతతోకదా నిద్రిస్తున్నాడు.

**(తలైక్కొణ్డపిన్నై)** - ఆయా కాలాలలో పూచే పుష్పాలు వికసించేటట్లే, సృష్టికాలంలో మేల్కొన్న తరువాత సృష్టిస్తే తప్ప నిలువలేని పదార్థాలను తెలుపుతున్నారు ఇకపై.

**(తన్ నాబివలయత్తు)** - భూవలయమని అంటూ భూలోకంయొక్క విస్తృతి, గొప్పతనం చెప్పబడినట్లే, **"నాబివలయమ్"** అని అంటూ ఆ భూమండలానికి



మున్నమ్ తిశైముకనై త్తాన్ పడైక్క* మఱ్ఱవనుమ్
మున్నమ్ పడైత్తనన్ నాన్మఱైకళ్* - అమ్మఱైతాన్ 10

---

గొప్ప తామరపూవును పుష్పింపజేసి, అ మలర్ మేల్ = ఆ తామరపూవుపై, మున్నమ్ తిశై ముకనై తాన్ పడైక్క = సృష్టికాలంలో చతుర్ముఖుని తాను సృష్టించగా, మఱ్ఱు అవనుమ్ = ఆ బ్రహ్మకూడా, మున్నమ్ నాల్ మఱైకళ్ పడైత్తనన్ = మొదట నాల్గు వేదాలను (పరమపురుషునివద్దనుండి) పొందాడు, అమ్మఱైతాన్=

---

కారణమైన నాభియొక్క గొప్పతనం చెప్పబడుతున్నది.

**(పేరొళి శేర్ మన్నియ తామరై మామలర్ పూత్తు)** - దీని కార్యమైన లోకం అంతా కలిసినా-ఈ కాంతికి సాటి రాదు - అని చెప్పే రీతిలోని చాలా గొప్ప కాంతిని కల్గిన తామరపూవు ఇది.

**(మన్నియ తామరై మామలర్ పూత్తు)** - లోకంలో మట్టినుండి కుండలను కుమ్మరి రూపొందించేటపుడు కార్యాలైన కుండలను చేసేకొద్దీ అందుకోసం ఉపయోగించే మన్ను తఱిగిపోతూ వస్తుంది. చిట్టచివరకు మట్టి ఏమీ లేకుండా పోతుంది. కాని, జగత్కారణమైన ఈ తామరపూవును చూస్తే, తన కార్యాలైన లోకాలు ఎంతగా వృద్ధిజెందినా, తాను కొంచెం కూడా తఱిగిపోకుండా, నశించకుండా, నిత్యమై ఉండే గొప్పతనాన్ని కల్గినదై ఉన్నది. **"మన్నియ తామరై"** అని తామరపూవుకు విశేషణంగా అన్వయించినపుడు ఈ అర్థం వస్తుంది. ఆ విధంగా కాకుండా **"మన్నియ పేరొళి శేర్ తామరై మామలర్ పూత్తు"** అని అన్వయించి, ఈ తామరయొక్క గొప్ప కాంతి నిత్యంగా ఉన్నదనే అర్థాన్ని గ్రహించవచ్చు.

**(అమ్మలర్‌మేల్ మున్నమ్ తిశైముకనై త్తాన్ పడైక్క)** - ఆ అద్వితీయమైన ఎఱ్ఱతామరపూవులో (నాభీపద్మంలో) నాల్గు తామరపూవులు పూచినట్లుగా, సృష్టికాలంలో నాల్గు ముఖాలను కల్గిన బ్రహ్మను తాను సృష్టించగా.

**(మఱ్ఱవనుమ్)** - సర్వేశ్వరుడు చతుర్ముఖుని సృష్టించగానే, "ఇతడేనా సర్వేశ్వరుడు?'' అని భగవానునితో సమానంగా చెప్పదగినట్లుగా వర్ధిల్లిన ఆ చతుర్ముఖుడు. **"తస్మాద్విరాడజాయత, విరాజో అధి పూరుషః, స జాతో అత్యరిచ్యత, పశ్చాద్భూమి మథో పురః"** (పు.సూ. 1-5) (ఆ విష్ణువునుండి

మన్ను మఱమ్పొరుళ్ ఇన్బమ్ వీడెన్రులకిల్*

ఆ వేదాలు, మన్నుమ్ అఱమ్ పొరుళ్ ఇన్బమ్ వీడు ఎన్రు = స్థిరంగా ఉండే

బ్రహ్మాండం ఉద్భవించింది. దానినుండి బ్రహ్మ ఉద్భవించాడు. ఆ చతుర్ముఖుడు పుట్టినంతలోనే భూమిని పార్శ్వభాగాలలోను, కింద, పైన ఆక్రమించాడు) అని చెప్పబడిందికదా!

**(మున్నమ్ పడైత్తనన్ నాన్మఱైకళ్)** - ఈ సూక్తిని చూస్తే "ఆ చతుర్ముఖుడు నాల్గు వేదాలను పూర్వం సృష్టించాడు'' అనేటట్లున్నది. "వేదం సర్వేశ్వరునిచేత కూడా సృష్టింపబడినది కాదు. అతడు సైతం, నిద్రించినవాడు నిద్రనుండి మేల్కొని నిద్రించడానికి ముందు జరిగిన వృత్తాంతాలను స్మరించేటట్లే, సృష్టికాలంలో, పూర్వసృష్టి కాలంలో ఉన్న వేదాక్షరరాశి క్రమాన్ని తలచి, చతుర్ముఖునకు ఉపదేశించాడు; అంతే''అని వైదికులు వేదం పురుషబుద్ధి ప్రణీతం కాదు (అపౌరుషేయం) అని చెబుతూ ఉండగా, **"పిరమన్ పడైత్తాన్"** (బ్రహ్మ సృష్టించాడు) అనే సూక్తి వైదికవచనరూపప్రమాణాలకు విరుద్ధంకదా! అంతేకాక, **'యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై"** (తైత్తి.నారా. శ్వేతా) (ఎవడు బ్రహ్మను ముందు సృష్టించాడో, ఎవడు అతనికి వేదాలను ఉపదేశించాడో) అని పలికే వేదవచనంతోకూడా విరోధిస్తుంది. అందువల్ల వేద-వైదిక వచనవిరోధం లేని రీతిలో ఈ సూక్తికి ఏమి అర్థం గ్రహించాలి? అని అంటే, **"ఇన్నాన్తన్ పితావిన్ పక్కల్ పడైత్త ద్రవ్యమ్ ఇన్నతనై",** (ఇతడు తన తండ్రివద్దనుండి పొందిన అర్థం ఇంత) అని లోకంలో వ్యవహరించడం చూస్తున్నాము. తండ్రివద్ద నుండి పొందిన సంపదను **"పిఱన్దు పడైత్త శెల్వమ్"**- పుట్టి పొందిన సంపద అనివ్యవహరిస్తున్నాము. ఆ సందర్భాలలో **"పడైత్త"** అనే పదం 'పొందిన' అనే అర్థాన్ని ఇచ్చేటట్లే, ఇక్కడకూడా **"మున్నమ్ పడైత్తనన్ నాన్ మఱైకళ్"** అనే ప్రయోగానికి "ఆ చతుర్ముఖుడుకూడా సృష్టికాలంలో సర్వేశ్వరునివద్దనుండి నాల్గు వేదాలను పొందాడు'' అనే అర్థం. అంతే.

**(అమ్మఱైతాన్)** - ఆ వేదాలు కూడా.

**(మన్ను మఱమ్ పొరుళ్ ఇన్బమ్ వీడెన్రులకిల్ నన్నెఱి మేమ్బట్టన నాన్గన్రే)**- ధర్మ-అర్థ-కామ-మోక్షాలని లోకంలో చక్కని మార్గంలో గొప్పవైన నాల్గు పురుషార్థాలనే తెల్పుతుంది- అని భావం. **"అఱమ్"** అని అన్నందువల్ల ధర్మమనే అర్థం వస్తుందికదా. **"మన్ను మఱమ్"** అని అనడం ఎందుకు? అని అంటే, తాను



నన్నెఱి మేమ్బట్టన నాన్గన్రే* - నాన్గినిలుమ్ 11

పిన్నైయతు పిన్నై ప్పెయర్ తరు మెన్బదు*- ఓర్

ధర్మం, కామం, అర్థం, కామం, మోక్షం అని, ఉలకిల్ నల్ నెఱి మేమ్బట్టన నాన్గు అన్రే = ఈలోకంలో సన్మార్గంలో గొప్పవిగా చెప్పబడుతున్నవి నాల్గు పురుషార్థాలు కదా, నాన్గినుమ్ = ఆ నాల్గు విధాలైన పురుషార్థాలలో కూడా, పిన్నైయతు = చివరలో చెప్పబడ్డ మోక్షపురుషార్థం, పిన్నై పెయర్ తరుమ్ ఎన్బతు = ఈ శరీరం

అర్థంతో సాధ్యంగాను, కామానికి, మోక్షానికి సాధనంగాను- ఈ విధంగా రెండు రూపాలతో స్థిరంగా ఉన్నందువల్ల **"మన్ను"** అనే విశేషణం ధర్మానికి ప్రయోగింపబడింది. **"పొరుళ్"** అంటే అర్థమనే పురుషార్థం- **"ఇన్బమ్"** అనేది తాము ఆదరించే కామపురుషార్థాన్ని తెల్పుతుంది. **"వీడు"** అంటే నాల్గవదిగా ఇతరులు చెప్పే మోక్షపురుషార్థం.

**(నాన్గిలుమ్)**- ఈ నాల్గింటిలో.

**(పిన్నైయతు పిన్నై)** - **"పిన్నైయతు"** - చివర చెప్పబడే మోక్షపురుషార్థం.

**(పిన్నై)** - అది జన్మలు జన్మల తరబడి వెనుకకు వెనుకకు పోతూ అందకుండా ఉంటుంది. ఈ శరీరంతో దీనిని పొంది తెలిసినవారెవరూ లేరు. శాస్త్రసిద్ధమైన, పరమపురుషార్థమైన మోక్షాన్ని ఈ విధంగా కాలదన్ని తక్కువగా చేసి పలుకవచ్చునా? అని అంటే, ఈ శరీరంతో ఇక్కడే పొందాలి- అనే ఆశతో దానిని ఆళ్వార్లు తక్కువగా పల్కుతున్నారు. కనుక ఇక్కడ **"న హి నిందా న్యాయా"**న్ని స్మరించాలి. ఆశపడిన ఈ శరీరాన్ని విడచి వేఱొక శరీరాన్ని పరిగ్రహించి, చాలా దూరంలో ఉండే ఒక దేశంలోకి పోయి ఎపుడో ఏదో ఒక కాలంలో అనుభవించే అదికూడా ఒక అనుభవం అవుతుందా! కానే కాదు. ఆ అనుభవాన్నికూడా ఏవో కొన్ని వేదవాక్యాలు చెప్పగా వింటున్నాము. అంతే తప్ప, దానిని చూచి వచ్చి చెప్పినవారెవరూ లేరు. **"పెయర్ తరుమ్"** -అనే ప్రయోగం శరీరాంతరాన్ని ఇచ్చే- అనే అర్థాన్ని ఇస్తుంది. మోక్షం ఈ శరీరాన్ని విడచి వేఱొక శరీరాన్ని పొంది అనుభవించవలసినదై ఉన్నది. ఈ శరీరాన్ని వీడి ఇంకొక శరీరాన్ని పొంది అనుభవించడం అంటే- ఒకడు తపస్సు చేస్తే, ఆ తపఃఫలాన్ని వేఱొకడు అనుభవించడంవంటిది. లేక, **"పిన్నై ప్పెయర్ తరుమ్"** అని కలిపి, "తరువాత తరువాత గొప్పతనాన్ని ఇచ్చే''- అని గతంలో చెప్పిన అర్థాన్ని గ్రహించవచ్చు.

తొన్నెఱియై వేణ్డువార్ వీ*ఴ్*కనియు మూ*ఴి*లైయుమ్* 12
ఎన్ను మివైయే నుకర్న్దుడలమ్ తామ్ వరున్ది*

విడిచిపోయిన తరువాత వేఱొక శరీరాన్ని ఇస్తుంది అని (శాస్త్రాలలో) చెప్పబడింది, ఓర్ తొల్ నెఱియై = విలక్షణమై, అనాదియై ఉండే ఆ పరమపదాన్ని (లేక, అర్చిరాదిమార్గాన్ని), వేణ్డువార్ తామ్ = పొందాలని కోరేవారు తాము, వీ*ఴ్* కనియుమ్ ఊ*ఴ్* ఇలైయుమ్ ఎన్నుమ్ = తమకుతామే పండి రాలే పండ్లు, ఎండు

**(ఓర్ తొన్నెఱియై వేణ్డువార్)** - సంసారాన్ని పోగొట్టుకొని సాటి లేని ఆనందమైన మోక్షాన్ని పొందగోరేవారు. **"ఓర్"**- సాటి లేని.

**(ఓర్ తొల్ నెఱియై వేణ్డువార్)** - ఈ విధంగా సాటి లేనిదిగా చెప్పబడే, ప్రాచీనమైన మోక్షాన్ని పొందగోరేవారు. **"నెఱి"** అనే మార్గాన్ని తెలిపే పదం ఆ మార్గంద్వారా పొందబడే చోటును లక్షిస్తుంది. లేక, మార్గాన్నే తెలుపుతున్నదని భావించినా దోషం లేదు. ఆ చోటు (దేశం) అభిలషింపబడేది అయినపుడు అక్కడికి పోయే అ దారికూడా అభిలషింపబడేదే అవుతుంది కదా !

**(వేణ్డువార్)** - దానినిసైతం ఒక విషయంగా భావించి కోరేవారు ఉండడమా! అని దానిపట్ల తమకుగల అనాదరం స్ఫురించేటట్లు పల్కుతున్నారు.

ఇక, ఆ మోక్షపురుషార్థాన్ని పొందగోరేవారు అనుష్ఠించే సాధనంయొక్క నైచ్యాన్ని వివరిస్తున్నారు.

**(వీ*ఴ్* కనియుమ్)** - తానే స్వయంగా రాలిన సారహీనమైన పండు- అని భావం. తానే స్వయంగా రాలినందువల్ల సారహీనంగా ఉంటుంది.

**(ఊ*ఴి*లైయుమ్)** - **"ఊ*ఴ్*"** అనే పదం రాలడాన్ని, పాతబడి పోవడాన్ని తెలుపుతుంది. మొలకలో రాలి ఎండి పోయిన ఆకును, బాగా ముదిరి పండి రాలి ఎండిన, పాతబడిన ఆకును తెలుపుతుంది. ఇందులోను సారం లేదు- అని భావం.

**(ఎన్ను మివైయే నుకర్న్దుడలుమ్ తామ్ వరున్ది)** - ఎండిన ఆకులను తిని, రసం లేని (సారం లేని) కాయకూరలను, దుంపలను తినికదా తపస్సును అనుష్ఠిస్తారు. **"ఇవైయే"** అనే చోటగల ఏకారంతో, ఒక వ్రతాన్ని ముగించి ఇంకొక



తున్ను మిలైక్కురమ్బై త్తుఞ్జియుమ్* వెఞ్జుడరోన్ 13

ఆకులు అనే, ఇవైయే నుకర్న్దు = ఈ రెండిటినే తిని, ఉడలమ్ వరున్ది = శరీరాన్ని బాధపెట్టి, తున్నుమ్ ఇలై క్కురమ్బై త్తుఞ్జియుమ్ = చాలా సంకుచితమైన పర్ణశాలలో నివసించి, వెమ్ శుడరోన్ = చాలా వేడి కిరణాలను కల సూర్యునియొక్క, మన్నుమ్

వ్రతం ఆరంభించే ముందు అయినా ఒకసారి అయినా అన్నాన్ని తినడం లేదు- అనే అర్థం స్ఫురిస్తుంది. దీనివల్ల, నిరంతరంగా శరీరాన్ని శుష్కింపజేసికొని బాధపెట్టాలి- అని తెలుపబడింది.

**(నుకర్న్దు)** - ఆస్వాదించి, భుజించి -అని భావం. సాధ్యవిషయంపట్లగల ఆశచేత దాని సాధనంలోకూడా గొప్ప ఆదరం ఉంటుంది. దానికి అంగంగా ఎండిన ఆకులను తినినపుడుకూడా, వాటిని చాలా రసవంతమైన భోజనాన్ని భుజించేటట్లు, ఆదరంతో భుజిస్తారని భావం.

**(ఉడలమ్ తామ్ వరున్ది)** - భోగ్యవస్తువును (అర్చారూపాన్ని) దర్శిస్తూ ఇక్కడే అనుభవించదగిన శరీరాన్ని క్లేశపెట్టి,

**(తామ్ వరున్ది)** - లోకంలో, కర్మవశంచేత నీచమైన చోట్లకు పోయి బాధపడడం, యముడు మొదలైన దైవాలు ఇతనిని తమ లోకాలకు తీసికొనిపోయి బాధపెట్టడంకూడా ఉన్నది. ఇది ఆవిధంగా ఇతరులవల్ల కలిగిన క్లేశం కాదు. తనకు తానే తెచ్చుకొన్న బాధ-అని తెలుపుతున్నారు.

**(తున్ను మిలైక్కురమ్బై త్తుఞ్జియుమ్)** - దట్టమైన ఆకులతో నిర్మింపబడ్డ పర్ణశాలలో నివసించి, నిద్రించి. **"కురమ్బై"** - ఇల్లు. (గుడిశె). **ఇలై క్కురమ్బై**- పర్ణశాల. ఈ పర్ణశాలలలో ఉండేటపుడు వాటినుండి రాలే ధూళి కంటిలో పడి చాలా బాధ కల్గగా క్లేశపడి. **"తుఞ్జుతల్"** అనే పదం మరణం, తూగు (నిద్ర) అనే రెండిటిని తెల్పుతుంది. ఇక్కడ ఇతడు నిద్రించే నిద్ర మరణంతో సాటివచ్చే బాధను కల్గిస్తుంది. కనుక **"తుఞ్జియుమ్"** -అని అన్నారు.

**(వెఞ్జుడరోన్ మన్నుమ్ అ*ఴ*ల్ నుకర్న్దుమ్)** - ఉష్ణకిరణుడైన సూర్యుని ఎండలో భుజించి. **"మన్నుమ్ అ*ఴ*ల్"** (స్థిరంగా ఉండే వేడిమి) అనేది ఇతని శరీరంలో ప్రవేశించి ఆ ఉష్ణం స్థిరంగా ఉండడాన్ని తెల్పుతుంది. తినే తిండి స్థానంలో మాత్రమే కాకుండా, తాగే నీటి స్థానంలోకూడా ఇతనికి ఇదే స్థితి అని సూచిస్తున్నది.

మన్ను మழ్ల్ నుకర్న్దుమ్ వణ్తడత్తినుట్కిడన్దుమ్*
ఇన్నదోర్ తన్మైయరాయ్ ఈఙ్గుడలమ్ విట్టెழున్దు* 14
తొన్నెఱి క్కణ్ శెన్ఱారెనప్పడుమ్ శొల్లల్లాల్*

అழల్ నుకర్న్దుమ్ = స్థిరంగా ఉండే ఎండలో భుజించి, వణ్ తడత్తిన్ ఉళ్ కిడన్దుమ్ = ఔదార్యాన్ని కల్గిన తటాకాలలో మునిగి ఉండి, ఇన్నతు ఓర్ తన్మైయర్ ఆయ్ = ఇటువంటి స్వభావాలను కలవారై, ఈఙ్గు ఉడలమ్ విట్టు ఎழున్దు = ఈ లోకంలో శరీరాన్ని విడచిపెట్టి పైకి పోయి, తొల్ నెఱిక్కణ్ శెన్ఱార్ ఎనప్పడుమ్

గాలిని, ఎండను భుజించి, కనీసం నీటినికూడా తాగకుండాకదా ఇతడు తన శరీరాన్ని కాపాడుకుంటాడు!

**(వణ్ తడత్తినుట్కిడన్దుమ్)** - కొలనుకు గల అందాన్ని (ఔదార్యాన్ని) అనుభవించే అదృష్టానికి నోచుకోలేకపోయాడే ! **"వణ్ తడమ్"** - అందం (ఔదార్యం) అతిశయించిన కొలను. ఆనందాన్ని కోరేవారిని "రండి ! రండి !" అని ఆహ్వానించే కొలను. గ్రీష్మకాలంలో స్త్రీలతో పాటు అందంగా స్నానం చేసి ఆనందంగా కాలాన్ని గడపదగిన తటాకాలలో చల్లని శీతకాలంలో ప్రవేశించి నీటికాకులవలె మునిగి, పాచి పట్టేటట్లు అక్కడే పడి ఉండి తపస్సును చేసి.

**(ఇన్నతోర్ తన్మైయరాయ్)** - దుఃఖంలో అలవాటుపడి అలవాటుపడి, అదే స్వభావమైన ఇతనికి, తపఃఫలం అయిన బ్రహ్మానందం లభించినా, అది అతనికి ఏవిధంగా రుచిస్తుంది ?

**(ఈఙ్గుడలమ్ విట్టెழున్దు)** - తలచిన రీతిలో అనుభవించదగిన ఈ లోకంలో, స్వయంగా ఇతనిచే అభిమానింపబడినదై, చిరకాలంగా ఇతని వెంట ఉండి అలవాటు పడిపడినందువల్ల **"ఉడలమ్"** అనబడే ఈ శరీరాన్ని విడచి పోయి.

**(తొన్నెఱిక్కణ్ శెన్ఱార్ ఎనప్పడుమ్ శొల్లల్లాల్)** - ప్రాచీనమైన మోక్షానికి వెళ్ళారు- అనే మాటను వింటున్నామే తప్ప.

**(ఇన్నతోర్ కాలత్తు)** -ఏదయిన ఒక కాలంలో.

**(ఇనైయార్ ఇతు పెற్ఱార్ ఎన్నవుమ్ కేట్టఱివతిల్లై)** - ఎవరైనా ఒకరు ఈ



ఇన్నతోర్ కాలత్తు ఇనైయారితు పెற్ఱార్* 15
ఎన్నవుమ్ క్కేట్టఱివతిల్లై* ఉళతెన్నిల్
మన్నుమ్ కడుఙ్కతిరోన్ మణ్డలత్తిన్ నన్నడువుళ్* 16

శొల్ అల్లాల్ = ప్రాచీనమైన ఒక స్థానంలోకి పోయి చేరారు- అని చెప్పడం తప్ప, ఇన్నతు ఓర్ కాలత్తు ఇనైయార్ ఇతు పెற్ఱార్ = ఈదినంలో ఈ మానవుడు ఈ మోక్షంలోనికి పోయిచేరాడు, ఎన్నవుమ్ కేట్టు అఱివతు ఇల్లై = అని చెప్పగా విన్నది లేదు, ఉళతు ఎనిల్ = (పూర్తిగా లేదు అని చెప్పే ఆమోక్షం) ఉన్నది అనే పక్షంలో, మన్నుమ్ కడుమ్ కతిరోన్ నల్ నడువుళ్ = నిత్యమై, తీక్ష్ణమై ఉండే

ఫలాన్ని పొందినట్లుగా వారి నోటినుండి మనం విని తెలియలేదు. శబ్దప్రమాణాలు చెప్పగా వినడం తప్ప ప్రత్యక్షప్రమాణాన్ని వినలేదు. **"శుకో ముక్తో, వామదేవో ముక్తః"** అనే వచనాలను వినడం తప్ప, మోక్షాన్ని చూచి, అక్కడ ముక్తులను చూచి వచ్చాను- అని చెప్పేవారు లేరు. శుకుడు, వామదేవుడు మొదలైనవారు ముక్తిని పొందినట్లు ఋషులు చెప్పారు కదా! దానిని విని తెలియవచ్చునే! అని అంటే, "నేను మోక్షస్థానానికి వెళ్ళాను; అక్కడ ఈ విధంగా ఈ విధంగా ఉన్నది"- అని అక్కడి వారి పరిస్థితిని చూచి వచ్చి చెప్పినవారెవరూ లేరు.

**(ఉళతెన్నిల్)** - మొట్టమొదట ఆ విధంగా మోక్షమనే ఒక పురుషార్థం లేదు. **"అగ్నినా సించేత్"** (నిప్పుతో తడపాలి) అనే రీతిలో మోక్షం ఉందనే మాట విరుద్ధమైన వచనం. ఆ విధంగా ఉందని ఒక మొండివాదం వాదించినా, ఆ మోక్షంయొక్క లక్షణాన్ని వినండి- అని అంటున్నారు.

**(మన్నుమ్ కడుమ్ కతిరోన్ మణ్డలత్తిన్ నన్నడువుళ్)** - నిత్యంగా ఉండేవాడై, దరి చేరడానికి వీలు కాని రీతిలో క్రూరమైన వేడిమిని కల సూర్యుని మండలం లోపల ప్రయాణం చేయాలట.

**(అన్నతోర్ ఇల్లి)** -**"అన్నతు"** (అటువంటిది) అని చెప్పడం తప్ప వివరించ డానికి సాధ్యం కాని సన్నని ద్వారం.

**(వీడెన్నుమ్ తొన్నెఱిక్కణ్ శెన్ఱారై చ్చొల్లుమిన్కళ్)** - ముక్తుడు భగవత్సంబంధ మనే రాజకులమాహాత్మ్యం స్ఫురించేటట్లు అందఱిచే స్వాగతింప బడి ఉపచారం చేయబడగా పయనిస్తాడట. భగవానుడు ఇతని శరీరం విడిచి పోయేవరకు వేచి

అన్నతోరిల్లియి నూడుపోయ్* - వీడెన్నుమ్
తొన్నెఱిక్కణ్ శెన్నారై చ్చొల్లుమిన్కళ్ శొల్లాతే* 17
అన్నతే పేశు మఱివిల్ శిఱుమనత్తు* - ఆఙ్గు

కిరణాలను కల సూర్యుని మండలంలో నడుమ, అన్నతు ఓర్ ఇల్లియిన్ ఊడు పోయ్ = నోటితో చెప్పడానికి సాధ్యం కాని అటువంటి సూక్ష్మమైన ద్వారంద్వారా పయనించి, వీడు ఎన్నుమ్ తొల్ నెఱిక్కణ్ శెన్నారై శొల్లుమిన్కళ్ = మోక్షమని మీరు చెప్పే ఒక స్థానానికి పోయి తిరిగి వచ్చినవారిని చెప్పండి, శొల్లాతే = అటువంటివారిని చెప్పలేకుండా, అన్నతే పేశుమ్ = (మోక్షమున్నదని, శాస్త్రంలో చెప్పబడినదని) పాతపాటనే పాడుతున్న, అఱివు ఇల్ శిఱు మనత్తు అన్నవరై =

ఉండి తరువాత ముఖం చూపిస్తాడట. **"హార్దానుగృహీతః"** (హృదయంలో ఉండే పరమాత్మచే అనుగ్రహింపబడ్డవాడై, దారిని తెలిసికొని ముక్తజీవుడు ప్రయాణం చేస్తాడు-) (బ్రహ్మ.సూ. 4-2-16) అనే రీతిలో ఆతివాహికులు అనబడే పిలుచుకొనిపోయే దివ్యులవద్ద ఇతనిని సర్వేశ్వరుడు అప్పగిస్తాడట. "ఈ విధంగా వెళ్ళే మోక్షమనే ప్రాచీనమైన దేశంలోకి నేను వెళ్ళాను; దీనిని చూచాను; దీనిని అనుభవించాను'' అని చూచి వచ్చినవారిని చెప్పండి చూద్దాం. ఈ విధంగా అక్కడికి పోయి వచ్చినవానిని చూపిస్తే, దానిని ఒక విషయంగా గ్రహించవచ్చు. దానికి కూడా అవకాశం లేదే !

**(శొల్లాతే)** - ఈవిధంగా ప్రబలప్రమాణాలైన ప్రత్యక్షంచేత, అనుమానం చేత దీనిని నిరూపించదగిన హేతువులను చూపి, దీనిని స్తుతించకుండా.

**(అన్నతే పేశుమ్)** - పూర్వపక్షం చేసేవారు దేనిని అడిగినా, దానికి బదులుగా మళ్ళీ మళ్ళీ **"శుకో ముక్తో వామదేవో ముక్తః"** అనే వచనాన్నే పఠించడంవల్ల ఏమి లాభం ఉన్నది?

**(అఱివిల్.....)** - ఆ విధంగా పలికేవారు తమకు ఉండవలసిన వివేకం లేని మూఢులు. ఇతరుల మాటలను అనుసరించి పలికే జ్ఞానశూన్యులు.

**(అఱివిల్ శిఱు మనత్తు)** - ఇపుడే జ్ఞానం లేదు అంటే, ఇంకా వేఱొక కాలంలో జ్ఞానం కలిగేటట్లు విశాలమైన మనస్సును కల్గి ఉంటారా ! అని చూస్తే, అదీ లేదు. సంకుచితమైన మనస్సును కల్గినవారవుతున్నారు.



అన్నవరై క్కఱ్పిప్పోమ్ యామే* - అతు నిఱ్క 18
మున్నమ్ నాన్ శొన్న అఱత్తిన్ వழி ముయన్ఱ*

వివేకం లేనివారు, సంకుచితమనస్కులు అయినవారికి, కఱ్పిప్పోమ్ యామే = ఉపదేశించే వాళ్ళం మనమా! అతు నిఱ్క = ఆ మోక్షాన్నిగూర్చిన సంగతి అటు ఉండ నివ్వండి, మున్నమ్ నాన్ శొన్న అఱత్తిన్ వழி ముయన్ఱ అన్నవర్తామ్

**(ఆఙ్గు అన్నవరై క్కఱ్పిప్పోమ్ యామే)** - అటువంటి బాధపడదగిన స్థితిలో ఉన్నవారిని ఉపదేశించి సంస్కరించడం మనకు కర్తవ్యం అయినదే! ఏమి కష్ట సమయం ! చేతిలో మడల్ను (తాటిమట్టను) పట్టుకొని దారికి రెండు వైపుల ఉన్నవారు అలమటించేటట్లు అధ్యయనోత్సవంలో (నమ్బిరుమాళ్ళ)వలె సంచరించ వలసి ఉండగా, ఆ జ్ఞానం లేనివారికి తెలియజెప్పడం మనకు కర్తవ్యమైనదే! అయ్యో!

**(అదు నిఱ్క)** - ఇపుడు ఆ పనిని (కర్తవ్యాన్ని) అటు ఉండనీ.

**(మున్నమ్ నాన్ శొన్న అఱత్తిన్ వழி ముయన్ఱ అన్నవర్)** - మొట్టమొదట **"మన్ను మఱమ్ పొరుళ్ ఇన్బమ్ వీడు"** అని ఈ నాల్గు పురుషార్థాలనుగూర్చి పల్కినపుడు, ధర్మమనే ప్రథమపురుషార్థాన్నిగూర్చి ప్రస్తావిస్తూ సాధ్యంగాను, పరలోక సాధనంగాను ఉండే దాని స్వభావాలనుబట్టి **"మన్నుమ్ అఱమ్"** అని దానిని స్థిరంగా ఉండే పురుషార్థమని అన్నాను. ఈ లోకంలో పొందే అర్థం అనే పురుషార్థంకంటే తారతమ్యదృష్టిలో ఇది స్థిరంగా ఉండే రీతినిగూర్చి తెలియజేశాను తప్ప, అదికూడా నిత్యంగా నిలచి ఉండేది కాదు. దానిని తెలియకుండా, అది కూడా నిత్యపురుషార్థమని కొందఱు జ్ఞానశూన్యులు భావించవచ్చు. అది అస్థిరమైనదే కాకుండా, "ఎపుడు అధఃపతనం చెందుతామో? ఏమో ?'' అనే భయంతో కలసి ఉన్నది కనుక అల్పంగాకూడా ఉంటుంది. **"న కేవలం ద్విజశ్రేష్ఠ ! నరకే దుఃఖ పద్ధతిః, స్వర్గేఽపి పాతభీతస్య క్షయిష్ణోః నాస్తి నిర్వృతిః"** (వి.పు.6-5-50) (ఓ బ్రాహ్మణశ్రేష్ఠా ! నరకంలో మాత్రమే దుఃఖపరంపరలున్నాయని భావించవద్దు. పుణ్యం తఱిగిపోతూ ఉండే మానవునకు స్వర్గంలో ఉన్నపుడుకూడా- ఎపుడు కిందకు పడిపోతానో! అనే భయం ఉన్నందువల్ల ఆనందం లేదు) అని చెప్పబడుతున్నదికదా! ఈ విషయాన్ని తెలియజెప్పడానికి ఇక స్పష్టంగా పల్కుతున్నాను వినండి- అని అంటున్నారు.

అన్నవర్తామ్ కణ్డీర్కళ్ ఆయిరక్కణ్ వానవర్కోన్* 19
పొన్నకరమ్ పుక్కు అమరర్ పోఱ్ఱి శెప్ప*- పొఙ్గొళి శేర్

---

కణ్డీర్కళ్ = నేను పల్కిన ధర్మంయొక్క దారిలో అనుష్ఠానం చేసే అటువంటివారు, ఆయిరమ్ కణ్ వానవర్ కోన్ పొన్ నకరమ్ పుక్కు = వేయి కన్నులను కల ఇంద్రుని అందమైన లోకంలోకి చేరి, అమరర్ పోఱ్ఱి శెప్ప = దేవతలచే మంగళాశాసనం చేయబడి, పొఙ్గు ఒళి శేర్ = ఇంకా ఇంకా వృద్ధి చెందే కాంతిని

---

**(మున్నమ్ నాన్ శొన్న అఱత్తిన్ వఴిముయన్ఱ అన్నవర్)** - నేను పల్కిన ధర్మాన్ని శాస్త్రంలో పల్కిన దారిలో అనుష్ఠించినవారు- అని భావం. **"అఱత్తిన్ వఴి"** అని అనడం ఆ జ్యోతిష్టోమాదిధర్మానుష్ఠానంలోని కాఠిన్యాన్ని తెలుపుతుంది. దానిని అనుష్ఠించేటపుడు కరణం తప్పితే మరణం సంభవిస్తుంది- అని, మంత్రస్వరంలో కాని, ఉపాయంలోని అంగంలో కాని ఏదైనా లోపం ఏర్పడితే తరువాత బ్రహ్మరాక్షసులుగా పుట్టవలసివస్తుందని తెలుపుతున్నది.

**(అన్నవర్తామ్ కణ్డీర్కళ్)** - ఆ ధర్మాన్ని అంత శ్రమపడి అనుష్ఠించేవారు.

**(ఆయిరక్కణ్ వానవర్కోన్)** - ఇక్కడనుండి పోయేవారికి నాయకుడై ఉండే ఇంద్రుడు తన వేయి కన్నులతో అనుభవించేటట్లుగా అంతు లేని, గొప్పదై ఉంటుంది- ఆ దేవలోకసుఖం.

**(పొన్నకరమ్ పుక్కు)**- ఆ దేవతల లోకంలో గొప్పదై, "ఇందులో నివసించడమే మహానందం'' అనేటట్లుండే అమరావతి అనే నగరాన్ని చేరి.

**(అమరర్ పోఱ్ఱి శెప్ప)** - **"ముడియుడై వానవర్ ముఱై ముఱై ఎదిర్కొళ్ళ"** (తిరువాయ్-10-9-8) అనే రీతిలో ముక్తులకు ఎదురేగి స్తుతించేటట్లే, అక్కడి దేవతలు ''అర్థంలో అభినివేశాన్ని కలవారై భూలోకంలో ఉన్నా, ఈ కామపురుషార్థాన్ని కోరి, దీనిని పొందడంకోసం తపస్సును చేయగోరి, తన శరీరాన్ని కృశింపజేసి, ఉపాయానుష్ఠానాన్ని చేసే ఒక మహాత్ముడు ఉన్నాడే !'' అని వీరిని కీర్తించేటట్లు.

**(పొఙ్గొళి శేర్)** - ఈలోకంలోని వస్తువులవలె కాలం గడువగా, గడువగా కాంతి తఱిగి పోకుండా, పుణ్యఫలం కనుక, కాలం గడిచేకొలదీ వృద్ధి చెందే కాంతిని కల్గి ఉంటాయి.



కొన్నవిలుమ్ కోళరిమాత్తాన్ శుమన్ద కోలమ్ శేర్ 20
మన్నియ శిఙ్గాశనత్తిన్ మేల్* - వాణెడుఙ్కణ్

---

కల్గినది, కొల్ నవిలుమ్ కోళ్ అరి మా తాన్ శుమన్ద కోలమ్ శేర్ = వధించే ప్రవృత్తిని సూచించేటట్లుండే బలమైన సింహంచేత ప్రేమతో మోయబడినది, అందమైనది, మన్నియ శిఙ్గ ఆశనత్తిన్ మేల్ = స్థిరంగా ఉండే సింహాసనంపై (ఉంటూ), వాళ్ నెడుమ్ కణ్ = ఖడ్గంవలె నిశితమైన, దీర్ఘమైన కన్నులను కల,

---

**(కొల్ నవిలుమ్ కోళరిమా)** - "ఎదురు వచ్చేవారిని వధించడంకోసం లేచి పైన బడుతున్నవి కాబోలు!'' అని చెప్పే రీతిలో గొప్ప బలాన్ని కల్గిన, శిల్పరూపంలోని సింహాలు.

**(తాన్ శుమన్ద)** - మనస్సులోని ప్రేమతో (భక్తితో) ప్రాణం కల సింహం మోస్తున్నట్లుగా ధరిస్తున్నవి.

**(కోలమ్ శేర్)** - పలువిధాలైన అందమైన భాగాలను సహజంగానే కల్గినట్లుగా పొందికగా అందంగా ఉన్నది.

**(మన్నియ శిఙ్గాశనత్తిన్మేల్)** - ఈ లోకంలోని భోగాలకంటే కొంచెం కాలం ఎక్కువ కాలం కూర్చుని వేంచేసి ఉండే సింహాసనంపైన.

**(వాళ్ నెడుఙ్కణ్)** - ఇక, అక్కడ (స్వర్గంలో) ఉండే అప్సరసలతో కలసి అనుభవించే ఆనందాన్నిగూర్చి తెలుపబడుతున్నది.

**(వాళ్ కణ్)** - ఎదురుపడినవారిని ఒక కత్తివేటుతో పడగొట్టేటట్లు ఒక కంటిచూపుతో ఒక్కొక్కరిని వశం చేసికొన గలిగిన నేత్రాలను కల్గినవారు.

**(నెడుఙ్గణ్)** - కాలం ఉన్నంతవరకు అనుభవించినా నిత్యనూతనంగా తోచే విశాలమైన నేత్రసౌందర్యాన్ని కల్గినవారు.

**(కన్నియరాల్ ఇట్ట కవరిప్పొది అవిఴ్న్దు)** - ఇటువంటి స్త్రీలచేత వీచబడ్డ చామరాల సమూహం విస్తరించి వికసించి.

**(అఙ్గన్నిళమ్ పూన్దెన్ఱల్ ఇయఙ్గ)** - అక్కడ భోగ్యమై, మందంగా వీచే, పూవుల పరిమళాలను మోస్తూ వచ్చే మలయమారుతం వీస్తున్నది.

కన్నియరాల్ ఇట్టకవరిప్పొతి యవిఴ్గ్న్దు* - ఆజ్గు 21

ఇన్నిళమ్ పూన్దెన్ఱల్ ఇయజ్గ* - మరుజ్గిరున్ద
మిన్ననైయ నుణ్మరుజ్గుల్ మెల్లియలార్ వెణ్ముఱువల్* 22

---

కన్నియరాల్ ఇట్ట= దేవకన్యలచే వీచబడ్డ, కవరి పొది అవిఴ్గ్న్దు = చామరాలు దగ్గరలో విస్తరించగా, ఇన్ ఇళ పూ తెన్ఱల్ ఇయజ్గ = తీయనిది, భోగ్యమైనది, మందమైనది, పరిమళంతో కూడినదిగా ఉండే మలయమారుతం వచ్చి వీచగా, మరుజ్గు ఇరున్ద = దగ్గరలో ఉండే, మిన్ అనైయ నుణ్ మరుజ్గుల్ మెల్ ఇయలార్= మెఱుపువలె సూక్ష్మమైన నడుమును కల మృదువైన స్త్రీలు, మున్నమ్ ముకిఴ్త్త= మొదటనే వ్యక్తం చేసిన (విరిసిన), వెణ్ ముఱువల్ = తమ మందహాసం అనే,

---

**(మరుజ్గిరున్ద)** - ఇంకా పలువురు స్త్రీలు వీరికి సమీపంలో ఉన్నారు. నీటి ప్రవాహానికి ఎదురు ఒడ్డడం సాధ్యం కానట్లే, భోగ్యతాతిశయాన్ని కల వీరిని దూరం చేసికోలేక, దగ్గరలోనే నిలుపుకొని ఆనందించవలసినట్లున్నది.

**(మిన్ననైయ నుణ్ మరుజ్గుల్)** - మెఱుపు తనను చూచేవారికి మిఱుమిట్లు గొల్పే రీతిలో ఇది (నడుము) కూడా మిఱుమిట్లు గొల్పుతుంది. అదికూడా దీనికి పోలిక మాత్రమే అనేటట్లుగా దానికంటే సూక్ష్మమైన నడుమును కల్గిన స్త్రీలు.

**(మెల్లియలార్)** - మార్దవాన్ని సహజంగా కల్గినవారు.

**(మున్నమ్ ముకిఴ్త్త వెణ్ ముఱువల్ ముకిఴ్నిలా వన్దరుమ్బ)** - తమ అభిప్రాయాన్ని మొదటిలోనే సూచించే తెల్లని (స్వచ్ఛమైన) మందహాసం అనే లేత వెన్నెల వచ్చి వ్యాపించగా.

**(మున్నమ్ ముకిఴ్త్త)** - అనంతరం వివరించబోయే ఉద్యానవనంలో పూలను కోయడం అనే వారి కార్యాన్ని ముందుగానే తెలుపుతున్నట్లున్నది- వీరి లేలేత వెన్నెలవంటి మందహాసం- అని భావం.

**(అన్నవర్తమ్ మానోక్కమ్ ఉణ్డు)** - అటువంటి అందమైన స్త్రీల, జింకచూపులవంటి చూపుల అందాన్ని అనుభవించి.

అనంతరం పుణ్యఫలంచేత తలచగానే కంటిముందు కన్పించే ఉద్యానవనంలో మందహాసంచేత సూచింపబడ్డ పూవులను కోసి, క్రీడించడం తెలుపబడుతున్నది.



మున్న మ్ముకిఴ్త్త ముకిఴ్నిలా వన్దరుమ్బ*
అన్నవర్ తమ్మానోక్క ముణ్డాజ్గణిమలర్ శేర్* 23

పొన్నియల్ కఱ్పకత్తిన్ కాడుడుత్త మాడెల్లామ్*
మన్నియ మన్దారమ్ పూత్త మతుత్తివలై* 24

ఇన్నిశై వణ్డమరుమ్ శోలైవాయ్ మాలైశేర్*

---

ముకిఴ్ నిలా = లేత వెన్నెల, వన్దు అరుమ్బ = వచ్చి వ్యాపించగా, అన్నవర్తమ్ = అటువంటి స్త్రీలయొక్క, మాన్ నోక్కమ్ ఉణ్డు = లేడిచూపువంటి అందమైన చూపులను అనుభవించి, ఆజ్గు = ఆ సమయంలో, అణి మలర్ శేర్ = అందమైన పూలతో నిండి ఉండే, పొన్ ఇయల్ కఱ్పకత్తిన్ కాడు ఉడుత్త = బంగారుమయమైన కల్పకోద్యానాలచేత చుట్టబడి ఉండేది, మాడు ఎల్లామ్ మన్నియ మన్దారమ్ పూత్త మతు తివలై = పరిసరాలలో అంతటా మన్నికగా (స్థిరంగా) ఉండే మందారవృక్షాల

---

**(ఆజ్గు)** - అపుడు ఆ కాలంలో.

**(అణి మలర్ శేర్)** - ఆ లోకానికి అలంకారం అయిన పూవులు నిండి ఉండే.

**(పొన్నియల్ కఱ్పకమ్)** - బంగారు నగరానికి తగిన బంగారుమయమైన కల్పవృక్షం. బంగారంవలె స్పృహణీయమై ఉన్నది. **“మన్నియ కఱ్పకమ్”** అని వ్యాఖ్యానంలోని పాఠం. స్థిరంగా ఉండే కల్పవృక్షమని దీని భావం.

**(కఱ్పకత్తిన్ కాడుడుత్త)** -ఇది ఉద్యానవనానికి విశేషణం. కల్పవృక్షవనం చేత పరివేష్టితమై ఉండే ఉద్యానవనం.

**(మాడెల్లామ్ మన్నియ మన్దారమ్ పూత్త మతుత్తివలై)** - చుట్టు పక్కల అంతా మందారవృక్షాలలో ఉండే పూలలోని మధుబిందువులలో,

**(ఇన్నిశై వణ్డమరుమ్ శోలై)** - తీయగా ధ్వనించే తుమ్మెదలు పొందికగా ఉండే ఉద్యానవనం. పూవులలో తుమ్మెదలు ఉన్నట్లు వాటి రెక్కల ధ్వనినిబట్టి తెలియవచ్చు అంతే; అవి పూలలో అణిగిపోతాయి.

**(శోలైవాయ్)** - తోటలలో - అని భావం. ఇకపై ఆ స్త్రీల కేశవర్ణనచేయబడుతున్నది.

మన్నియ మామయిల్‌పోల్ కూన్దల్* - మళైత్తడగణ్ 25

మిన్నిడైయారోడుమ్ విళైయాడి వేణ్డిడత్తు*
మన్ను మణిత్తలత్తు మాణిక్కమఞ్జరియిన్* 26

పూలలోని తేనె తుంపురలలో, ఇన్ ఇశై వణ్డు అమరుమ్ శోలై వాయ్ = భోగ్యమైన రాగాలను పాడుతున్న తుమ్మెదలు పొందికగా ఉండే పూలతోటలలో, మాలై శేర్ మన్నియ మా మయిల్ పోల్ కూన్దల్ = పూలను అలంకరించుకొని, పొందికగా నెమలిపింఛంవలె ఉండే కేశాలను కలవారై, మళై తడమ్ కణ్ = మేఘంవలె నల్లని, చల్లని, విశాలమైన కన్నులను కలవారై, మిన్ ఇడైయారోడుమ్ = మెఱుపువలె సూక్ష్మమైన నడుమును కలవారై ఉండే అప్సరసస్త్రీలతో, వేణ్డిడత్తు విళైయాడి = కోరిన చోట్ల క్రీడించి, మన్నుమ్ మణి తలత్తు = గొప్ప రత్నాలు పొదిగిన

**(మాలై శేర్)** - పూలమాలికలతో అలంకరింపబడ్డ కేశపాశం.

**(మన్నియ మామయిల్‌పోల్ కూన్దల్)** - స్వభావసిద్ధంగానే పొందికగా ఉండే గొప్ప నెమలిపింఛంవంటి కేశాలను కలవారు.

**(మాలై శేర్ కూన్దల్)** తోటలో వీరి కేశాలకు చేయడుతున్న అలంకారాలను ఈ ప్రయోగం తెలుపుతున్నది.

**(మళైత్తడక్కణ్)** - మేఘంవలె చల్లగా, నల్లగా ఉన్న, విస్తరించి ఉండే నేత్రాలను కలవారు.

**(మిన్నిడైయారోడుమ్ విళైయాడి)** -మెఱుపువంటి నడుమును కలవారైన ఆ స్త్రీలతో క్రీడించి.

ఇక, **'వేణ్డిడత్తు... కేట్టిన్బుఱ్ఱు"** అనే ప్రయోగంతో దేవసభలో కొలువుండే తీరు తెలుపబడుతున్నది.

**(వేణ్డిడత్తు)** తాము కోరిన చోట. **"మన్ను మణిత్తలత్తు"** అని ప్రారంభించి **"శెమ్బొన్ శెయ్"** అనే ప్రయోగంవరకుగల ప్రయోగం మండపానికి విశేషణం.

**(మన్ను మణిత్తలత్తు)** మన్నికగా ఉండే రత్నాలచే పొదగబడిన భూప్రదేశాన్ని కల్గినది.



మిన్నినొళిశేర్ పళిఙ్గు విళిమ్బడుత్త*
మన్నుమ్ పవళక్కాల్ శెమ్బొన్‌శెయ్ మణ్డపత్తుళ్* 27

అన్ననడైయ వరమ్బైయర్‌తమ్ కైవళర్‌త్త*
ఇన్నిశై యాళ్‌పాడల్ కేట్టు ఇన్బుఱ్ఱు* - ఇరువిశుమ్బిల్ 28

భూతలాలను కల్గినది, మాణిక్కమ్ మఞ్జరియిన్ = మాణిక్యమయమైన పూగుత్తుల తోరణాలుగా కల్గినది, మిన్నిన్ ఒళి శేర్ పళిఙ్గు విళిమ్బు అడుత్త = మెఱుపులో తళతళమని వెలిగే స్ఫటికమణులతో అంచు కట్టబడినది, మన్నుమ్ పవళత్తాల్= ప్రకాశించే పగడపు స్తంభాలను కల్గినది, శెమ్ పొన్ శెయ్ = అందమైన బంగారంతో చేయబడినది అయిన, మణ్డపత్తుళ్= మండపంలో, అన్న నడైయ అరమ్బైయర్‌తమ్ కై వళర్‌త్త = హంసగమనాన్ని కల్గిన అప్సరసలు తమ చేతులలో తడవి, వృద్ధి చేయబడినది, ఇన్ ఇశై యాళ్ పాడల్ = భోగ్యమైన రాగాన్ని కల వీణాగానాన్ని, కేట్టు ఇన్బు ఉఱ్ఱు = విని ఆనందించి, ఇరు విశుమ్బిల్ మన్ను మళై తవళుమ్=

**(మాణిక్కమఞ్జరియిన్)** -మాణిక్యాలు చేర్చి, పూలగుత్తులవలె కట్టబడిన.

**(మిన్నినొళి శేర్)** - ఆ గుత్తులయొక్క మెఱిసే కాంతి ప్రసరించే మండపం.

**(పళిఙ్గు విళిమ్బు అడుత్త)** - స్ఫటికశిలలతో మండపం అంచులు పొదగబడి ఉన్నాయి.

**(మన్నుమ్ పవళక్కాల్)** - రంభ, మేక, తిలోత్తమ, ఊర్వశి మొదలైన నాట్యస్త్రీలు శయనించడంవల్ల ప్రకాశించే పగడపు. స్తంభాలను కల్గినది ఈ మండపం.

**(శెమ్బొన్ శెయ్ మణ్డపత్తుళ్)** - పదహారు కళలను కల మేలిమి బంగారంతో చేయబడ్డ మండపంలో.

**(అన్న నడైయ అరమ్బైయర్‌తమ్ కైవళర్‌త్త)** - హంసనడకలవంటి నడకలను కల దేవతాస్త్రీలు, వృక్షాలకు నీరు పోసి పెంచినట్లుగా, తమ చేతులతో తడవి వృద్ధి చేసిన గానం.

**(ఇన్ ఇశై)** - గానంలోకూడా గొప్ప దేవగానం.

మన్ను మழை తవழுమ్వాణిలా నీణ్మతి తోయ్*
మిన్నినొళి శేర్ విశుమ్బూరుమ్ మాళికై మేల్* 29
మన్ను మణివిళక్కై మాట్టి* - మழைక్కణ్ణార్

విస్తరించిన ఆకాశంలో పొందికగా ఉండే మేఘమండలాలు వచ్చి చేరే, వాళ్ నిలా నీళ్ మది తోయ్ = అందమైన వెన్నెలను కల్గిన పెద్ద చంద్రునిచే ఆశ్రయింప బడినది, మిన్నిన్ ఒళి శేర్ = మెఱపు కాంతివంటి కాంతిని కల్గినది, విశుమ్బు ఊరుమ్ మాళికై మేల్ = ఆకాశంలోసంచరించే విమానంలో, మழை కణ్ణార్ =

**(యాழ்పాడల్ కేట్టు ఇన్బుగ్ఱు)**- అటువంటి విలక్షణమైన గానాన్ని కల వీణయొక్క పాటను విని, దాని భోగ్యతను అనుభవించి,

ఇక, **"ఇన్నముతమ్ మాన్దియిరుప్పర్"** అనే పర్యంతం దేవతాస్త్రీలతో ఇతడు (జీవుడు) అల్పానందం అనుభవించడంగూర్చి తెలుపబడుతున్నది.

**(ఇరు విశుమ్బిల్)** - విశాలమైన దేవతల లోకంలో

**(మన్ను మழை తవழுమ్)** - గ్రీష్మకాలంలో, ఎండాకాలంలో తేడా లేకుండా ఎల్లప్పుడు మేఘాలు చేరి ఉండే హర్మ్యం. **"ఉయిరళిప్పాన్ మాకజ్గళ్ ఎల్లామ్ తిరిన్దు నన్నీర్కళ్ శుమన్దు, తమ్ ఆకజ్గళ్ నోవ వరున్దియ వరుత్తమ్"** తీరడంకోసం కట్టిన విశ్రమస్థానాలవలె ఉన్నవి.

**(వాళ్ నిలా నీణ్ మతి తోయ్)** - కాంతి పొందికగా ఉండే వెన్నెల కాంతిని కల్గినవాడై, భోగ్యతలో గొప్పవాడైన చంద్రుడు,

**(మిన్నిన్ ఒళి శేర్)** - మెఱపువలె కంటిని మిఱుమిట్లు గొల్పే కాంతిని కల్గి ఉన్నది.

**(విశుమ్బూరుమ్)** - చంద్రుడు, మేఘం శ్రమ తీర్చుకొనే చోట్లు పల్లమైనవి అని అనేటట్లు చాలా ఉన్నతమై ఆకాశంయొక్క విస్తృతిని అంతా పొందినట్లుండే ఎత్తైన స్థలాలను కల విమానం. ఎత్తు, పల్లాలను కల చోటు.

**(మాళికైమేల్ మన్ను మణివిళక్కై మాట్టి)** -విమానం పైన మాణిక్యంలోని దోషం (మురికి) పోయేటట్లు సానబట్టి పాదిగి దానిని దీపంగా నిలిపి.



పన్ను విశిత్తిరమాప్పొప్పడుత్త పళ్లి మేల్* 30
తున్నియ శాలేకమ్ శూழ்కతవమ్ తాళ్ తిఱప్ప*
అన్నముழக్క నెరిన్దుక్క వాణీల* 31

చల్లని కన్నులను కల్గినవారైన స్త్రీలు, మన్ను మణి విళక్కై మాట్టి = ఆరని మాణిక్యాలు అనే దీపాలను వేలాడదీసి (కట్టి), విశిత్తిరమా పా ప్పడుత్త = పలు వర్ణాలలో విస్తృతంగా వ్యాపింపజేసిన, పన్ను పళ్ళిమేల్ = కీర్తించదగిన శయనంపై, తున్నియ శాలేకమ్ శూழ் కతవమ్ తాళ్ తిఱప్ప = దగ్గర దగ్గరగా ఉండే రంధ్రాలను చుట్టూ కల్గిన తలుపులు తెఱచుకోగా, అన్నమ్ ఉழக్క నెరిన్దు ఉక్క వాళ్ నీలమ్

**(మழைక్కణ్ణార్)** - వర్షాన్ని కురిసే మేఘంవలె నల్లగా చల్లగా వెలిగే నేత్రాలను కల స్త్రీలు అని భావం. ఒకసారి చూపు నిలిపి చూస్తే చాలు కాలం ఉన్నంతవరకు ఉండే కంటియొక్క చల్లదనం "వ్వవ్వవ్వ'' అనేటట్లు (వణికేటట్లు) చేస్తున్నది.

**(పన్ను)** - పడుక విస్తరించిన అందాన్ని చూస్తే, కాలం అంతా దానినే కీర్తించవలసినట్లున్నది.

**(పన్ను విశిత్తిరమా ప్పొప్పడుత్త పళ్ళిమేల్)** - కీర్తించదగినదిగా, పలు వర్ణాలను కల్గినదిగా విస్తరింపజేయబడ్డ పడుకమీద.

**(తున్నియ శాలేకమ్)** - దగ్గర దగ్గరగా రంధ్రాలను కల కిటికి. గొప్ప గాలి వీచకుండా, గాలే బొత్తుగా లేకుండా ఉండకుండా, గాలి పరిమితంగా వీచేటట్లుగా సన్నని రంధ్రాలను కల్గిన కిటికీ (గవాక్షాలను).

**(శూழ் కతవుమ్)** - ఆ గవాక్షాన్ని మూసే తలుపుకూడా

**(తాళ్ తిఱప్ప)** - గాలి అవసరమైనపుడు తానుగానే తెఱచుకొనేటట్లు- అని అర్థం. గవాక్షంద్వారా ప్రవేశించిన మలయమారుతాన్ని ఒక మహాపురుషునివలె వర్ణిస్తూ పల్కుతున్నారు ఇకపై.

**(అన్నమ్ ఉழக்క నెరిన్దుక్క)** -జలప్రదేశాలలో ఉండే నీలోత్పల పుష్పాలలో హంసలు ప్రవేశించి, బురదను కలియబెట్టేటట్లు, పూవులోని మకరందం, పుప్పొడి, రేకులు ఒకటిగా కలిసేటట్లు కలియబెట్టగా, అది పొడి (చూర్ణం) అవుతున్నది.

**(వాళ్ నీల చ్చిన్న నఱున్దాతు శూడి)** - ఆ విధంగా పొడి అయిన గొప్ప

చ్చిన్న నఱున్దాతు శూడి* - ఓర్ మన్దారమ్
తున్ను నఱుమలరాల్ తోళ్ కొట్టి* కఱ్పకత్తిన్ 32

మన్ను మలర్వాయ్ మణివణ్డు పిన్ తొడర*
ఇన్నిళమ్ పూన్దెన్దల్ పుకున్దు ఈఙ్గిళములైమేల్* 33

నఱు శిన్న తాతు శూడి = హంసలు కాళ్ళతో తొక్కడంవల్ల విరిగిన ముక్కలు అయిన అందమైన నీలోత్పలాలలోని సువాసన నిండుగా కల చక్కని పుప్పొడిని అలంకరించుకొని, ఓర్ మన్దారమ్ తున్ను నఱు మలరాల్ తోళ్ కొట్టి = చక్కని మందారవృక్షంపై నిబిడంగా ఉన్నవి, మిక్కిలి సువాసనను కల్గినవి అయిన పూలతో బాహువులను అలంకరించుకొని, కఱ్పకత్తిన్ మన్ను మలర్ వాయ్ మణి వణ్డు పిన్ తొడర = కల్పవృక్షంలో పొందికగా ఉండే పూవులలో చేరిన అందమైన తుమ్మెదలచేత వెంబడింపబడి, ఇన్ ఇళ పూ తెన్దల్ = పరమభోగ్యమైన మంద మారుతం, ఈఙ్గ పుకున్దు = వీరు ఆనందించే చోట్లకు వచ్చి చేరి, ఇళ ములై

కాంతిని కల నల్లకలువ పూవులోని చిన్నదైన పరిమళించే పుప్పొడిన రాజులు తలలో, మాలగా అలంకరించుకొన్నట్లు, అలంకరించుకొని

**(ఓర్ మన్దారమ్ తున్ను నఱుమలరాల్ తోళ్ కొట్టి)** - సాటి లేని మందారపుష్పాలతో దట్టంగా బిగువుగా కట్టిన, సువాసనను కల్గిన మాలను. ప్రభువులు బాహువులకు మాలగా అలంకరించుకొన్నట్లు ధరించి.

**(కఱ్పకత్తిన్ మలర్వాయ్ మన్నుమ్ మణివణ్డు పిన్ తొడర)** - కల్పవృక్షంలోని తేనెయొక్క పౌష్కల్యానికి వశమై, అందులోనే నిత్యవాసం చేసే తుమ్మెదలు, దానినికూడా మఱచిపోయి ఈ మలయమారుతంయొక్క భోగ్యతలో వ్యామోహాన్ని పొంది, ప్రభువులను వందిమాగధులు స్తుతిస్తూ వెంట వచ్చేటట్లుగా, ఝంకారాలను చేస్తూ వెంబడించేటట్లుగా,

**(ఇన్నిళమ్ పూత్తెన్దల్ ఈఙ్గ పుకున్దు)** - స్పృశిస్తే సుఖావహంగా ఉన్నదై, మందంగా వీస్తున్నదై, పూవుల పరిమళాన్ని కల్గినదైన మలయమారుతం వీరుండే చోటులో ప్రవేశించి,

**(ఇళములైమేల్ నన్నఱుమ్ శన్దనచ్చేఱు ఉళ్ పులర్త్త)** - స్త్రీసంగమాన్ని గర్హించే మునులను సైతం, చూస్తే అభినివేశాన్ని పొందేటట్లు చేసే భోగ్యతను



నన్నఱుమ్ శన్దనచ్చేఱుళ్ పులర్త్త* - తాఙ్గరుమ్ శీర్
మిన్నిడై మేల్ కైవైత్తిరున్దు ఏన్దిళములై మేల్* 34

పొన్నరుమ్బారమ్ పులమ్బ* - అకఙ్కుళైన్దాఙ్గ
ఇన్నవురువిన్ ఇమైయాడత్తఙ్కణ్ణార్* 35

మేల్ = లేలేత స్తనాలపై పూయబడ్డ, నల్ నఱు శన్దనమ్ శేఱు ఉళ్ పులర్త్త= మంచి సువాసను కల చందనపంకాన్ని చక్కగా పూసికొన్న, తాఙ్గ అరు శీర్ మిన్ ఇడై మేల్ కై వైత్తు ఇరున్దు = ధరించలేని (సూక్ష్మమైన), అందమైన, మెఱపువంటి నడుముపై చేతిని పెట్టుకొని, ఏన్దు ఇళ ములై మేల్ = గొప్ప లేత స్తనాలపై, పొన్ అరుమ్బు ఆరమ్ పులమ్బ = కాసుల పేర్లు ధ్వనించేటట్లుగా ఉండే, ఆఙ్గ = ఆ చోట, అకమ్ కుళైన్దు = మనస్సు కఱగి, ఇన్న ఉరువిన్ ఇమైయా తడమ్ కణ్ ఆర్ = ఇటువంటి గొప్ప పెద్ద కన్నులను కల, అన్నవర్తమ్=

కల్గినదైన, దేవతాస్త్రీల స్తనాలపైన పూయబడిన, సుగంధం అతిశయించి కల్గిన చందన పంకాన్ని చిన్న వినసకర్రతో వీచేటట్లుగా, శ్రమతో ఆరేటట్లు చేయగా.

**(తాఙ్గరుమ్ శీర్ మిన్నిడైమేల్ కై వైత్తు)** - స్తనభారాన్ని మోయలేక, అందమైన, మెఱపువలె సూక్ష్మమైన నడుముపై చేతిని పెట్టుకొని, ప్రియుడైన ఇతనికి తనను పూర్ణభోజనంగా అనుభవించేటట్లు సమర్పించుకొని,

**(పొన్నరుమ్బు ఆరమ్ పులమ్బ)** - బంగారు కాసులతో పేర్చిన హారం ధ్వనించేటట్లు- అని భావం. సంభోగంలో శరీరాలు ఆలింగనం చేసికొనడంవల్ల కదలాడే కాసుల పేర్లు ధ్వనించేటట్లు.

**(అరుమ్బు ఆరమ్ పులమ్బ)** - "వీరికి ఆభరణమై మనం ఇటువంటి పాట్లను పడ్డాము కదా" -అని స్తనాలలో మొలకెత్తినట్లుగా పొందికగా ఉండే నగలు రోదించి నట్లున్నది -వాటి చప్పుడు. సంభోగసుఖాన్ని శాస్త్రముఖంగా పల్కుతున్నారు.

**(అకమ్ కుళైన్దు)** - ఆ సుఖానికి మనస్సు ద్రవించి, అంగీకరించి.

**(ఆఙ్గ)** - ఆ దేవలోకంలో

**(ఇన్న ఉరు)** - మూసలో పెట్టి కఱగించి తీసిన బంగారంవలె వర్ణించడానికి సాధ్యం కాని అందాన్ని కల్గిన- అని భావం.

అన్నవర్తమ్ మానోక్క ముణ్డు ఆజ్గ అణిముఱువల్*
ఇన్నముతమ్ మాన్దియిరుప్పర్* - ఇతువన్తే 36

అన్న వఱత్తిన్ పయనావతు* - ఒణ్బొరుళుమ్
అన్న తిఱత్తతే యాతలాల్* - కామత్తిన్ 37

---

అటువంటి దేవకాంతయొక్క, మాన్ నోక్కమ్ ఉణ్డు =లేడి చూపులవంటి చూపులను అనుభవించి, ఆజ్గ = దానితోపాటు, అణి ముఱువల్ ఇన్ అతముతమ్ మాన్ది ఇరుప్పర్ = అందమైన మందహాసం అనే అమృతాన్ని పానం చేస్తూ ఉంటారు, అన్న అఱత్తిన్ పయన్ ఆవతు ఇతు అన్తే = అటువంటి (ముందే నేను పల్కిన) ధర్మపురుషార్థానికి ఫలంగా పొందే ప్రయోజనం ఇదే, ఒణ్ పొరుళుమ్ = గొప్ప అర్థపురుషార్థంయొక్క ఫలం కూడా, అన్న తిఱత్తే = ఆ విధంగా అల్పంగా, అస్థిరంగా ఉన్నదే, ఆతలాల్ = ఈ విధంగా ధర్మార్థాలనే రెండు పురుషార్థాలు కామమే ప్రయోజనంగా కల్గినవి అని పర్యవసించినందున, కామత్తిన్ = ఆ

---

**(ఇమైయా త్తడజ్కణ్ణార్ అన్నవర్ మానోక్కమ్ ఉణ్డు ఆజ్గణి ముఱువల్ ఇన్నముదమ్ మాన్ది)** -కనురెప్పలను ఎత్తి చూడలేని నేత్రసౌందర్యాన్ని కల్గినవారి జింకచూపులను అనుభవించి, ఆ చూపులనే భోజనాన్ని పూర్ణంగా అనుభవించిన తరువాత, వారి మందహాసం వికసించగా ఆ మందహాసాన్ని, అధరపానాన్ని తాగి దేహశాంతిని పొందుతారు.

**(ఇరుప్పర్)** - మాధుర్యాతిశయంచేత ఈ ఆనందాన్ని విడచి వెళ్ళలేకుండా ఉండడాన్ని (ఈపదం) తెల్పుతుంది.

**(ఇతువన్తే అన్నవఱత్తిన్ పయనావతు)** - ఆ విధంగా శ్రమపడి అనుష్ఠించే ధర్మంయొక్క ఫలం ఇంత అల్పంకదా. పడరాని పాట్లు పడి చివరికి దోసిలి మాత్రమైన అన్నాన్ని పొందినట్లుగాకదా ఉంటుంది. శ్రమకు తగిన ఫలం లేదని భావం.

**(ఒణ్ పొరుళుమ్ అన్న తిఱత్తతే)** - ప్రకాశించే అర్థపురుషార్థం కూడా ఆ విధంగా అల్పంగానే, అస్థిరంగానే ఉండేదే. పరమాత్మను పొందించే ఆచార్యులను సైతం దీనికోసం విడచి, దీనిని ఆదరించి ఆశ్రయించే ఇతడు దీనినే గొప్ప అర్థంగా భావిస్తాడు. కనుక, అతని అభిప్రాయానికి అనుగుణంగా **"ఒణ్ పొరుళ్"** అని అంటున్నారు తప్ప. తమ అభిప్రాయానుసారం కాదు.



మన్నుమ్ వ*ళి* ముఱైయే ని*ఱ్ఱు*మ్ నామ్* - మానోక్కిన్
అన్ననడైయారలరేశ ఆడవర్ మేల్* 38

మన్ను మడలూరార్ ఎన్బతోర్ వాశకముమ్*

---

కామపురుషార్థంయొక్క, మన్నుమ్ వ*ళి* ముఱైయే = స్థిరంగా ఉండే దారి అనే భగవత్కామమార్గాలలో, నామ్ ని*ఱ్ఱు*మ్ =మనం ఊనికను కలవారమై ఉన్నాము, మాన్ నోక్కిన్ అన్నమ్ నడైయార్ = లేడి చూపువంటి చూపును, హంసల నడకవంటి నడకను కల స్త్రీలు, అలర్ ఏశ = (లోకులు) నిందించేటట్లు, ఆడవర్మేల్ = పురుషులపై (మగవారినిగూర్చి), మన్నుమ్ మడల్ ఊరార్ ఎన్బతు ఓర్ వాశకముమ్ = (ప్రాణాన్ని) నిలిపే మడల్‌ను అధిరోహించరాదు- అని పలికే

---

**(కామత్తిన్ మన్నుమ్ వ*ళి*ముఱైయే ని*ఱ్ఱు*మ్ నామ్)** - కామంలో అధమ మార్గం అయిన ఇతరవిషయకామాన్ని ధర్మార్థాలవలె విడచిపెట్టి, స్థిరమైన కామమార్గం అయిన భగవద్విషయక కామమార్గంలో మనం స్థిరంగా నిలిచాము.

**(నామ్)** - కామాన్ని తప్ప మిగిలిన అన్నిటినీ విడచిపెట్టిన మనం.

**(మాన్నోక్కిన్ అన్ననడైయార్ అలర్ ఏశ ఆడవర్మేల్ మన్ను మడల్ ఊరార్ ఎన్బదోర్ వాశముమ్)** - స్త్రీలు మగవారిని ఉద్దేశించి మడల్ ఎక్కకూడదు- అని తమిళులు కట్టడి చేయడాన్నిగూర్చి ఇక్కడ ప్రస్తావిస్తున్నారు.

**(మాన్నోక్కిన్ అన్ననడైయార్)** - వీరి చూపుల అందాన్ని, నడకల హొయలను చూచిన మగవారు ఒక్కొక్క దానికి వేఱు వేఱుగా మడల్ ఎక్కవలసి ఉండగా, వీరు (స్త్రీలు) వారిని (మగవారిని) ఉద్దేశించి మడల్ ఎక్కడం ఏమి ? - అని తమిళుల భావం.

**(అలరేశ)** - ఇతరులు నిందించేటట్లుగా -అని భావం. నిందలు మగవారికి కల్గినా కలుగవచ్చు. స్త్రీలకు మాత్రం నింద కలుగకూడదని తమిళుల ఉద్దేశ్యం.

**(ఆడవర్మేల్)** - నాయకునిపై- అని భావం. నాయకునకు శేషభూతురాలైన నాయకి అతనికి అపవాదును కల్గించకూడదు- అని తమిళుల భావం.

**(మన్ను మడలూరార్)** - ప్రాణధారణకోసంకూడా మడల్‌ను ఎక్కరు. నాయకికి తన ప్రాణంకంటే తన స్వరూపం గొప్పది- అని తమిళుల భావం.

తెన్నురైయిల్ కేట్టఱివతుణ్డు* - అతనై యామ్ తెళియోమ్ 39
మన్నుమ్ వడనెఱియే వేణ్డినోమ్* - వేణ్డాతార్

ఒక మాటను, తెన్ ఉరైయిల్ కేట్టు అఱివతు ఉణ్డు = ద్రావిడభాషలో విని, తెలిసికొన్నాము, యామ్ అతనై తెళియోమ్ = ఆ వాక్యాన్ని అర్థవంతంగా మేము తెలియము (అది పొసగదు), మన్నుమ్ వడ నెఱియే వేణ్డినోమ్ =(ఈ విషయంలో) గొప్ప సంస్కృతగ్రంథాలలో చెప్పబడ్డ దారినే అభిలషిస్తాము, వేణ్డాతార్ = (ఆ విధంగా సంస్కృతగ్రంథాలలో చెప్పబడ్డ రీతిలో కామం (మర్యాదను అతిక్ర

**(ఎన్బదోర్ వాశకముమ్)** - ఈ అర్థాన్ని చెప్పే ఒక వాక్యాన్ని.

**(ఓర్ వాశకముమ్)** - ప్రేమయొక్క గౌరవాన్ని తెలియలేని ఇది కూడా ఒకమాటా ! అనే నింద స్ఫురిస్తున్నది.

**(తెన్నురై)** - మ్లేచ్ఛజాతికి చెందినవారు జల్పించే భాషలోని మాట ప్రేమయొక్క గౌరవాన్ని తెలుపగలదా ! (మడల్‌ను అనుష్ఠించడంలోని ఉద్వేగాతిశయంవల్ల తమిళభాషను, తమిళుల కట్టుబాటును ఆళ్వార్లు నిందిస్తున్నారే తప్ప, వాస్తవానికి తమిళభాషపై ఆళ్వార్లకు ద్వేషం ఏమీ లేదు. న హి నిందాన్యాయాన్ని ఇక్కడ స్మరించాలి. మడల్‌ను ఎత్తుతానని ఆళ్వార్లు అన్నారే తప్ప, నిజానికి మడల్‌ను అనుష్ఠించలేదుకదా ! అందువల్ల చివరకు తమిళభాష, తమిళుల కట్టుబాటే జయించాయి- అని ఉ.వే శ్రీమాన్ కృష్ణస్వామి అయ్యంగార్ స్వామివారి వివరణం)

**(ఉరై)** - కేవలం మాటయే తప్ప, అర్థం కల్గినది కాదు.

**(అతనై యామ్ తెళియోమ్)** - ఆ వార్తలో అర్థం ఉన్నా, అది మా జ్ఞానానికి అందలేదు.

**(మన్నుమ్ వడనెఱియే వేణ్డినోమ్)** -పురుషుని ఎడబాసిన, మడల్‌ను ఎక్కడమే పురుషార్థం- అని తెలిపే శ్రీరామాయణం మొదలైన సంస్కృతభాషలోని గ్రంథాలలో చెప్పబడ్డ మార్గాన్నే ఆదరిస్తాము.

**(వేణ్డాతార్)** - ఉత్తరదేశంలోని మార్గాన్ని కోరకుండా దక్షిణదేశంలోని పద్ధతినిగూర్చి జల్పించేవారు కామపురుషార్థం ఇటువంటిది- అని తెలియనివారు.



తెన్నన్ పొతియిల్ శెళ్ళుమ్ శన్దనక్కుళమ్బిన్* 40
అన్నతోర్ తన్మై యఱియాతార్* - ఆయన్ వేయ్

మించడం) ఆదరించనివారు (అంగీకరించనివారు) ఎటువంటివారు ? అని అంటే, తెన్నన్ పొతియిల్ శెళ్ళు శన్దన కుళమ్బిన్ అన్నతు ఓర్ తన్మై అఱియాతార్= పాండ్యదేశ ప్రభువు నాడులో ఉండే మలయపర్వతంపై పుట్టిన, చందనంయొక్క పంకానికి గల అటువంటి (అనిర్వచనీయ) స్వభావాన్ని తెలియనివారు, ఆయన్

**(తెన్నన్....)** - ద్రావిడదేశంలో ఉన్నా ఆ దేశంయొక్క గొప్పతనాన్ని తెలియనివారు.

**(తెన్నన్ పొతియిల్)** - చందనం మన ద్రావిడదేశంలోని మలయపర్వతంలో (అగస్త్యుని పర్వతంలో) ఉద్భవించే ఒక స్థావరం అనే విషయాన్ని కూడా తెలియని వారు.

**(శెళ్ళుమ్ శన్దనక్కుళమ్బు)** - మొత్తం అన్నిటిని త్యజించిన మునిశ్రేష్ఠులను సైతం వ్యామోహపఱచగల్గిన ప్రభావాన్ని కల చందనం. దీనిని పూసికోగానే ఒకచిన్న గడ్డిపోచకూడా లేచి ఆడే రీతిలోని ప్రభావాన్ని కల్గించగల్గిన చందనం.

**(కుళమ్బిన్ అన్నతోర్ తన్మై అఱియాతార్)** - ప్రియుని ఎడబాసినవారికి ఈ చందనం శరీరానికి బొబ్బలు వచ్చేటట్లు బాధించే స్వభావాన్ని కల్గినది- అనే విషయాన్ని తెలియనివారు.

**(అన్నతోర్తన్మై)** - ఇటువంటిది ఇది అని చెప్పినా నోరు ఎండిపోయే రీతిలోని దాని స్వభావాన్ని తెలియనివారు.

**(ఆయన్ వేయ్ ఇన్నిశై యోశైక్కు ఇరఙ్గాతార్)** - గొల్లల పిల్లనగ్రోవి రవాన్ని విని, "అయ్యో! ఈధ్వనిని మనం ప్రియునితో కలసి ఉండి అనుభవించలేక పోయామే!" అని ద్రవించనివారు వారు. ఆ వేణురవాన్ని తరువాత కూడా, కాంతుని స్మరణ లేకుండా, అదే జోలపాటగా నిద్రించగల్గిన రాతిమనస్సు కలవారు వారు. బ్రాహ్మణులు వేదాన్ని అధ్యయనం చేయడం, పాణకులానికి చెందినవారు పాడడం, గొల్లలు వేణువును ఊదడం- అనేవి వినేవారికి అందఱికి అభినివేశాన్ని కల్గిస్తాయి. బ్రహ్మాస్త్రంవలె తప్పనిది అయిన ఆ వేణు రవానికి కూడా అభినివేశాన్ని పొందని అరసికులు వారు.

ఇన్నిశైయోశైక్కిరజ్గాతార్* మాల్విడైయిన్ 41
మన్ను మణి పులమ్బ వాడాదార్* - పెణ్ణైమేల్
పిన్ను మవ్వన్టిల్ పెడైవాయ్ చ్చిఱుకురలుక్కు* 42

---

వేయ్ ఇన్ ఇశై ఓశైక్కు ఇరజ్గాతార్= గొల్లవాడు ఊదే పిల్లనగోవి పాట రవాన్ని విని ఆర్తిని పొందనివారు, మాల్ విడైయిన్ = (గోవుపై) మోహించి వచ్చే ఆబోతు యొక్క, మన్ను మణి పులమ్బ వాడాతార్ = గొప్ప (బలమైన) గొంతులో కట్టబడ్డ గంట మోగగా విని వాడనివారు, పెణ్ణై మేల్ పిన్నుమ్ = తాటిచెట్టుపై మగపక్షితో గొంతు కలిపి కూస్తున్న, ఆ అన్టిల్ పెడై వాయ్ శిఱు కురలుక్కు = క్రౌంచపక్షి

---

**(ఇన్నిశై ఓశై)** - విషాన్ని పూసిన బాణం. "ఓశై"- బాణం, "ఇశై"- విషం. ఈవిధంగా ఇది విషం కావడమేమి? అని అంటే, అతని తీయని పలుకులను స్మరింపజేయడంద్వారా క్లేశపెట్టడంవల్ల.

**(మాల్విడైయిన్ మన్ను మణి పులమ్బ వాడాదార్)** - "మాల్ విడై"-ఆవుపట్ల కోరికను కల్గిన ఎద్దు. దాని గంట నిరంతరం ధ్వనించగా, దానిని విని, అగ్నిలో పడిన చిగురుటాకు వాడేరీతిలో వాడనివారు. దానిని విని ఎందుకు క్లేశపడాలి ? అని అంటే, సంగమించడంకోసం వచ్చే ఎద్దును చూచి ఆవు దానికి తన అనంగీకారం స్ఫురించేటట్లు ఉండగా, ఎద్దు తానే దాని పైనబడి కలవడంవల్ల ఎద్దుమెడలో కట్టిన గంట ధ్వనిస్తుంది. ఈ ధ్వని, తాను అంగీకరించినా రాని నాయకుని స్మరింపజేసి నాయకిని బాధిస్తుంది.

**(పెణ్ణైమేల్ పిన్నుమ్ అవ్వన్టిల్ పెడైవాయ్ చ్చిఱుకురలుక్కు ఉన్ని ఉడలురుకి నైయాతార్)** - తాటిచెట్టుపై తన నాయకునితో కలువడంవల్ల పరస్పరం గవ్వవంటి చిన్న నోటితో చేసే క్రౌంచపక్షియొక్క ఆర్తనాదాన్ని విని, తాను నాయకునితో సంగమించిన విషయాన్ని స్మరించి శరీరం ద్రవించి బాధపడనివారు. "పిన్నుమ్" అనే పదాన్ని మొదట చేర్చి, ఎడమకు వచ్చిన ఎద్దుమెడలోని గంట చప్పుడును విన్న బాధకు మించి- అనే అర్థాన్ని గ్రహించవచ్చు.

**(శిఱు కురల్)** - కలయికవల్ల కృశించిన క్రౌంచపక్షి చిన్న గొంతును కల్గి ఉన్నది.

**(ఉన్ని)** -తాము ఆనందించడాన్ని స్మరింపజేసేయడం ద్వారా ఇది శరీరాన్ని ద్రవింపజేస్తున్నది.



ఉన్ని యుడలురుకి నైయాతార్* - ఉమ్బర్వాయ్
త్తున్ను మతియుకుత్త తూనిలా నీణెరుప్పిల్* 43

---

జంటలోని ఆడపక్షి గొంతునుండి వెలువడే చిన్న స్వరాన్ని విని, ఉన్ని = తమ సంశ్లేషాన్ని తలచి, ఉడల్ ఉరుకి నైయాతార్ = శరీరం ద్రవించి శిథిలం కానివారు, ఉమ్బర్ వాయ్ = ఆకాశంలో, తున్ను మతి ఉకుత్త = దట్టమైన కిరణాలను కల చంద్రుడు ప్రసరించిన, తూ నిలా నీళ్ నెరుప్పిల్ = పరిశుద్ధం అయిన వెన్నెల

---

**(ఉమ్బర్వాయ్ ..... తళరాతార్)** - నాయకుని ఎడబాసి వెన్నెల అనే నిప్పులో పరుండ గల్గినవారు. "ఉమ్బర్వాయ్" అనే పదం ఆకాశాన్ని తెలుపుతుంది.

**(తున్ను మది ఉకుత్త తూ నిలా నీళ్ నెరుప్పిల్)** - నిబిడమైన కిరణాలను కల చంద్రుడు వెలువరించిన పవిత్రమైన వెన్నెల అనే క్రూరమైన నిప్పులో.

**(మతి ఉకుత్త తూ నిలా నీళ్ నెరుప్పు)** - తనవలె వేడిమిని సహించలేక చంద్రుడుకూడా తన గొప్ప వేడి కిరణాలను తన దగ్గర పెట్టుకోకుండా బయటకు చిందిస్తున్నాడు- అని అంటున్నది. (పరకాలనాయకి)

**(తూ నిలా)** - తాపంవల్ల బొబ్బలెక్కేటట్లు చేసినతర్వాత గమనించి చూస్తే స్వచ్ఛమైన వెన్నెల అని తెలిసికొన్నాను.

**(నీళ్ నెరుప్పిల్)** - తాను దహించే వస్తువును భస్మం చేసిన తరువాతకూడా ఆరని నిప్పు. "నెరుప్పు- నీళ్ నెరుప్పు" -నిప్పు చల్లబడింది - అని చెప్పవచ్చు. ఈ వెన్నెలయొక్క వేడిమిని చూచినపుడు నిప్పు వెన్నెలగా తోస్తున్నవి. వెన్నెల గొప్ప నిప్పుగా ఉన్నది. ఆ నిప్పు శరీరాన్ని మాత్రం దహిస్తుంది. ఇది అదాహ్యంగా చెప్పబడే ఆత్మనుసైతం దహించడంవల్ల "నీళ్ నెరుప్పు" అని అనబడింది. ఆ నిప్పు నీటితో ఆరిపోతుంది. ఇది దానివల్లకూడా ఆరదు. జలవర్ణుడే వచ్చి దానిని ఆర్పాలి. అందువల్లకూడా ఇది "నీళ్ నెరుప్పు".

**(తమ్ముడలమ్ వేవ త్తళరాతార్)** - అద్దెకు తెచ్చుకొన్న శరీరంకాదుకదా వేగిపోకుండా ఉండడానికి! తమ శరీరంకదా! అది (ఆ శరీరం) వేగినపుడు కూడా బాధపడకుండా భరించగల్గి ఉండడమా! "**ఉణర్వు ముయిరు ముడమ్బుమ్ మఱ్ఱు ఉలప్పినవుమ్ పழுతే యామ్ ఉణర్వై ప్పెఱ**" (తిరువాయ్- 8-8-3) అని పలికే ఆழ்వార్లవలె శరీరాన్ని గర్హించే జ్ఞానాన్ని పొందినవారు కారుకదా! శరీరాన్ని ఆదరించి అభిమానించేవారుకదా!

తమ్ముడలమ్ వేవ త్తళరాతార్* - కామవేళ్
మన్నుమ్ శిలైవాయ్ మలర్వాళి కోత్తెయ్య 44
ప్పొన్నెడు వీతి పుకాదార్* - తమ్ పూవణైమేల్

అనే పెద్ద నిప్పులో, తమ్ ఉడలమ్ వేవ తళరాతార్ = తమ శరీరం వేగిపోయేటట్లుగా తల్లడిల్లనివారు, (అరసికులు ఎవరు? అంటే), కామవేళ్ = మన్మథుడు, శిలై వాయ్ మన్నుమ్ మలర్ వాళి కోత్తు ఎయ్య = తన వింటిలో పొందికగా ఉండే పూలబాణాలను సంధించి ప్రయోగించేటపుడుకూడా (ఇక మడల్ ఎక్కడమే పురుషార్థమని నిశ్చయించుకొని), పొన్ నెడు వీతి పుకాతార్ = అందమైన పెద్ద వీథులలో బయలుదేరనివారు ఎవరో వారు, తమ్ పూ అణైమేల్ = తమ పుష్ప

**(కామవేళ్ శిలైవాయ్ మన్నుమ్ మలర్ వాழి కోత్తెయ్య పొన్నొడు వీతి పుకాతార్)** -మన్మథుడు తన చెఱకు వింటికి తగిన పూల బాణాలను సంధించి ప్రయోగించగానే, అందమైన, దీర్ఘమైన వీథిలో చేతిలో మడల్‌ను ధరించి బయలుదేరకుండా, కట్టుబాటు మీరని పతివ్రత్యాన్ని భావిస్తూ, తలుపులను మూసికొని లోపల ఉండగల్గినవారు. **“పొన్ వీతి”** -అందమైన వీథి. మడల్ ఎక్కేవారిని “రండి! రండి !” అని తన అందాన్ని చూపి పిలిచే వీథి. **“నెడు వీతి”**- కల్పకాలం అంతా మడల్ ఎత్తేటట్లున్న విశాలమైన, దీర్ఘమైన వీథి.

**(పూకాతార్)** - తలుపులను మూసికొని లోపల ఉన్నంతవరకు కాముని బాణాలు ఇంకా ఇంకా మీదపడి బాధిస్తూనే ఉంటాయి. అవి పడకుండా ఉండేటట్లు **“పొన్నెడు వీతి”** అనే రాతికోట లోపలకు పోలేని జ్ఞానహీనులు వీరు.

**(తమ్ పూవణైమేల్ ... పొన్ననైయార్)** - మలయమారుతం స్పృశించగానే ప్రియుని చేతిని స్పృశించినట్లు తలచి పూలశయ్యపై శయనించగల్గిన సౌభాగ్యాన్ని కలవారు వారు.

**(తమ్ పూవణైమేల్)** - ప్రియుని విశ్లేషించినపుడు బాధతో నేలపై శయనించవలసి ఉండగా, తామే పూలపడుకను సిద్ధం చేసికొని, దానిలో శయనించే వారు.

**(తమ్ పూవణై)** - ఇద్దరికోసం ఏర్పడిన శయ్యపై తాము ఒంటరిగా శయనించగల్గినవారు.



శిన్నమలర్క్కుழలు మల్కులుమ్ ఎన్ముల్లైయుమ్* 45
ఇన్నిళవాడై తడవ త్తామ్ కణ్డుయిలుమ్*

శయనంపై, శిన్నమ్ మలర్ కుழలుమ్ = అపుడే విరిసిన పుష్పాలను అలంకరించు కొన్న కేశాలను, అల్కులుమ్ = నితంబాన్ని, మెల్ ముల్లైయుమ్ = మృదువైన స్తనాలను, ఇన్ ఇళ వాడై తడవ = భోగ్యమైన, లేతప్రాయంలో ఉండే మలయ మారుతం వచ్చి స్పృశించగా, కణ్ తుయిలుమ్ =ఆనందంగా తూగుతున్న, పొన్

**(పూవణై)** - “మెన్ మలర్ పళ్ళి వెమ్ పళ్ళియాలో !” (తిరువాయ్-9-9-4) అనే రీతిలో మాకు నిప్పును కఱగించి పోత పోసినట్లుగా ఉండే పడుకలో పొందికగా ఉండడమా!

**(శిన్న మలర్ క్కుழలుమ్)** - అపుడే విరిసిన పూలను కల కేశాలను. **“మలరిట్టు నామ్ ముడియోమ్”** అనే రీతిలో అతడు అలంకరిస్తే తప్ప పూలను అలంకరించుకోము -అని తలచి ఉండవలసినవారు పూలను ముడుచుకోవడమా ! **“శిన్నమ్”**- పూవు పూయడం.

**(కుழలుమ్ అల్కులుమ్ మెన్ ముల్లైయుమ్ ఇన్నిళవాడై తడవ)** - నాయకుడు ఒక్కొక్క అంగాన్ని ప్రత్యేక ప్రత్యేకంగా స్పృశించేటపుడు పొందే ఆనందాన్ని ఈ మలయమారుతం స్పర్శవల్లకూడా పొందడమా !

**(ఇన్నిళ వాడై)**- విషం పూసిన బాణంవంటిది.

**(ఇళ వాడై)** - ఇతరులను బాధించగా బాధించగా బాల్యం వృద్ధి అయిన మలయమారుతం.

**(తామ్ కణ్ తుయిలుమ్)** - ప్రియుని విశ్లేషించిన తాము నిద్రించడమా ! **“పొరుకయల్కణ్ణిణై తుఞ్జా”** (నాచ్చి. తిరు- 5-5) అనే రీతిలో ఉండవద్దా ! కళ్ళు నిద్రించడంవల్ల ఇది వారి కళ్ళు కాదు కాబోలు ! అద్దెకు తెచ్చుకొన్న నేత్రాలు అయి ఉండాలి.

**(పొన్ననైయార్)** - పూలపడుక అనే నిప్పులో ఉండి శోభిల్లే వీరు, నిప్పులో ఉండి ప్రకాశాన్ని పొందే బంగారంతో సాటి వచ్చేవారే ! అని భావం. లేక, **“పొన్ననైయార్”** అనే ప్రయోగం “సౌభాగ్యవతులు” అనే అర్థంలో ప్రయోగింప

పొన్ననైయార్ పిన్నుమ్ తిరువుఱుక* - పోర్ వేన్దన్ 46

తన్నుడైయ తాతై పణియాల్ అరశొழிన్దు*

అనైయార్ తామ్ = భాగ్యవతులు, పిన్నుమ్ తిరు ఉఱుక = ఇంకా ఇంకా మేని అందం వృద్ధి చెంది ప్రకాశించనీ, పోర్ వేన్దన్ = యుద్ధంలో పులివలె గొప్ప వీరుడైన, శ్రీరాముడు తన్నుడైయ తాతై పణియాల్ = తన తండ్రి అయిన దశరథుని మాటప్రకారం, అరశు ఒழிన్దు = రాజ్యపాలనను మానివేసి (అరణ్యానికి బయలు

బడిందని అనవచ్చు. కార్చిచ్చు దహించినా నిద్రించగల్గిన వీరు నిజానికి సౌభాగ్యవతులే! సుమా! అని పరిహసిస్తున్నారు.

**(పిన్నుమ్ తిరువుఱుక)** - ఈ సౌభాగ్యం వారికి నిత్యంగా ఉండనీ !

**(పోర్వేన్దన్)** - యుద్ధంలో గొప్ప పౌరుషాన్ని కల పులివంటివాడు. రణముఖరాముడు అని పిలువబడేవాడు.

**(వేన్దన్)** - దశరథచక్రవర్తి రాజ్యం ఏలినా అతనిని మౌనంగా ఉండేటట్లుచేసి, తానే రాజ్యం ఏలగల బలాన్ని కలవాడు. భరతుడు **"న మంథరాయా న చ మాతు రస్యా దోషో న రాజ్ఞో న చ రాఘవస్య, మత్పాప మేవాత్ర నిమిత్త మాసీత్ వనప్రవేశే రఘునందనస్య"** (రామా -?) (శ్రీరాముడు వనానికి పోవడానికి కారణం మంథర, నా తల్లి అయిన ఈ కైకేయి, దశరథచక్రవర్తి, శ్రీరాముడు- అనే వీరి దోషం కాదు. రఘునందనుడు వనానికి పోవడానికి నా పాపమే కారణం) అనే చోట తన దోషాన్నిగూర్చి పలికేటపుడు "శ్రీరాముడు వనానికి పోవడం అతని దోషం కాదు'' అని అన్నాడు. "ఏడు సాలవృక్షాలను ఒకే బాణం తొలిచేటట్లు బాణప్రయోగం చేసినవాడు తనకు శక్తి లేనందువల్ల రాజ్యాన్ని కాదని అరణ్యాలకు పోయాడు - అని చెప్పడానికి సాధ్యం కాదు'' అనేది భరతుని భావం.

**(తాతై పణియాల్)** - దశరథచక్రవర్తియొక్క మనస్సులోని భావాన్ని గమనించకుండా, అతని నోటినుండి వచ్చిన మాటను మాత్రమే గ్రహించి అరణ్యాలకు పోయాడు.

**(అరశు ఒழிన్దు)** - వాడిన పూలమాలను తీసి పారవేసేటట్లు శిరోభారం అని కిరీటాన్ని తీసివేశాడు.



పొన్నకరమ్ పిన్నే పులమ్బ వలఙ్గొణ్డు* 47

మన్నుమ్ వళనాడు కైవిట్టు* - మాతిరఙ్గళ్

దేరినపుడు), పిన్నే పులమ్బ = (నీవు అరణ్యానికి పోవద్దు అని) వెంట ఏడుస్తూ వెంబడించినా, వలమ్ కొణ్డు = తాను తీసికొన్న నిర్ణయాన్ని విడువకుండా గ్రహించి, వళమ్ మన్నుమ్ నాడు కై విట్టు = సంపత్సమృద్ధమైన కోసలరాజ్యాన్ని ఉపేక్షించి

**(పొన్నకరమ్)** - **"పొన్నులకు"** (తిరువాయ్ -6-9-1) అని చెప్పబడే అప్రాకృతమైన శ్రీవైకుంఠంతో సాటి వచ్చే అయోధ్యానగరం. దానికి కారణం- నిత్యముక్తులవలె శ్రీరామునితో కలవడమే గొప్ప ఆనందంగా భావించేవారు అయోధ్యాపురజనులు. **"అపి వృక్షాః పరిమ్లానాః సపుష్పాంకురకోరకాః"** (రామా.-అయో-59-9) (పూలు, మొలకలు, మొగ్గలు మొదలైనవానితో కూడిన వృక్షాలు సైతం రాముని విశ్లేషించి వాడిపోయాయి) అనే చోట అయోధ్యానగరంలోని స్థావరాలుకూడా శ్రీరాముని కల్యాణగుణాలను ధారకంగా కల్గినవై ప్రాణధారణను చేశాయికదా !

**(పొన్నకరమ్ పిన్నే పులమ్బ)** - అయోధ్యాజనులు శ్రీరాముని విశ్లేషించి బతుకలేక అతనిని వెంబడించి, ఏడుస్తూ ఆక్రందించగా- అని భావం. **"ఉఱ్ఱ మెల్లామ్ పిన్ తొడర తొల్ కానమ్ అడైన్దవనే !"** (పెరుమాళ్. తిరు-8-6) అని కులశేఖరాழ்వార్లు అన్నారుకదా !

**(వలఙ్గొణ్డు)** -సౌలభ్యమార్దవాదిగుణాలను వ్యక్తం చేయడంకోసమే జన్మించిన శ్రీరాముడు. తనకు భోగ్యమైనవానిని అన్నిటినీ విడచి పోగల్గిన మనః స్థైర్యాన్ని **"వలమ్"** అనే శబ్దం తెల్పుతుంది. **"వలమ్"** -బలం

**(మన్నుమ్ వళనాడు కైవిట్టు)** - కిరీటాన్ని (అధికారాన్ని) త్యజించినా, కనీసం రాజ్యంలో అయినా ఉన్నాడా ! రాజ్యాన్నికూడా వీడి అరణ్యాలకుకదా పోయాడు.

**(మన్నుమ్ వళనాడు)** - తనకు రాజ్యనీతిప్రకారం చెందినదై, అయోధ్యకంటే కూడా భోగ్యమైన కోసలరాజ్యాన్ని.

**(కైవిట్టు)** - "మమత్వశ్వా నివృత్తస్య న ప్రావర్తంత వర్త్మని, ఉష్ణ మశ్రు విముచంతో రామే సంప్రస్థితే వనమ్" (రామా-అయో) (శ్రీరాముని వనంలో విడచిపెట్టి తిరిగి వచ్చిన నా అశ్వాలు దారిలో రాలేకపోయాయి. శ్రీరాముడు

మిన్నురువిల్ విణ్దేర్ తిరిన్దు వెళిప్పట్టు* **48**

క్కన్నిరైన్దు తీయ్న్దు కఴై యుడైన్దు కాల్ శుఴన్దు*

---

విడచి, మా తిరజ్గళ్ మిన్ ఉరువిల్ వెణ్ తేర్ తిరిన్దు = దిక్కులంతటా (కళ్ళు మెఱిసే) మెఱుపువంటి అరణ్యమే విస్తరించి ఉన్నది, వెళిప్పట్టు = అన్నీ శూన్యస్థలాలై ఉండేది, కల్ నిఱైన్దు తీయ్న్దు కఴై ఉడైన్దు కాల్ శుఴన్దు = రాళ్ళు నిండి, ఎండకు బాగా వేగిన వెదుళ్ళు పగిలి, వేడి గాలి వీస్తున్నది, పిన్నుమ్ = దానికి పిమ్మట,

---

వనానికి వెళ్ళినపుడు అవికూడా దుఃఖాశ్రువులను విడిచాయి) అని సుమంత్రుడు పల్కిన రీతిలో ప్రాణులు సైతం దుఃఖించేటట్లుగా పోయాడు. **"తిరిన్దదు వెజ్ఞమత్తు తేర్ క్కడవి, అన్దు పిరిన్దతు శీతైయై మాన్‌పిన్ పోయ్, పురిన్దతువుమ్ కణ్ పళ్ళికొళ్ళ అఴుకియతే నాకత్తిన్ తణ్‌పళ్ళికొళ్ళాన్‌తనక్కు"** (ఇరణ్డామ్ -తిరు. 15) అనే పాశురంలో పూదత్తాఴ్వార్లవంటి ప్రేమను (భక్తిని) కలవారు "ఇతడేనా అరణ్యాలలో ప్రవేశించి సీతను విశ్లేషించాడు ! శేషశయనుడైన ఇతడేనా భూమిపై శయనించాడు !' అని బాధపడే లీలకదా ఇది. **"ఎవ్వాఱు నడన్దనై ఎమ్మిరామా ! వో !"** (పెరుమాళ్ తిరు- 9-2), **"కల్లణైమేల్ కణ్ తుయిల క్కఱ్ఱనైయో కాకుత్తా !"** (పెరుమాళ్ తిరు- 9-3) అని భక్తిని కలవారికి అంతా కడుపు నిండే (బాధకలిగే) కార్యాన్నికదా చేశాడు. ఇక, "వెజ్కానమ్" అనే పర్యంతం వనానికి విశేషణం.

**(మాతిరజ్గళ్)** - దిక్కులలో

**(మిన్నురువిల్ వెణ్దేర్)** - మెఱుపువంటి అరణ్యపు నీరు. **"వెణ్ తేర్"** అని, **"పేయ్ త్తేర్"** అని చెప్పబడేది అరణ్యంలోని జలం. కళ్ళు మిఱుమిట్లు గొలిపే అరణ్యం.

**(వెళిప్పట్టు)** - కనబడిన చోట అంతా ఏ ఊరు లేదు. అంతా శూన్యస్థలంగా ఉన్నది.

**(కల్ నిఱైన్దు)** - భూప్రదేశం అంతా రాళ్ళతో నిండి ఉన్నది.

**(కఴై ఉడైన్దు)**- వెదుళ్ళు వేడిమివల్ల పగిలి ఉన్నాయి.

**(కాల్ శుఴన్దు)** - సుడిగాలి వీస్తున్నది.

**(పిన్నుమ్)** - పూర్వం చెప్పినదానికి మించి ఇంకా



పిన్నుమ్ తిఱై వయిఱ్ఱుప్పేయేతిరిన్దులవా* **49**

కొన్నవిలుమ్ వెజ్గానత్తూడు* - కొడుజ్కతిరోన్

---

తిఱై వయిఱు పేయే తిరిన్దు = (ఆహారం లేనందువల్ల) ఎండిన కడుపును కల పిశాచాలే తిరుగుతున్నది, ఉలవా కొల్ నవిలుమ్ = వధకు సంబంధించిన శబ్దమే(మాటలే) నిరంతరం సంభాషించబడుతున్నది అయిన, వెమ్ కానత్తూడు= మిక్కిలి వేడి అయిన అరణ్యంలో, కొడు కతిరోన్ తున్ను వెయిల్ వఱుత్త వెమ్ పరల్ మేల్ = ఉష్ణకిరణుడైన సూర్యునియొక్క ఎండచే పగులగొట్టబడ్డ గులకరాళ్ళ పైన నడిచేటపుడు, వైతేవి ఎన్దు ఉరైక్కుమ్ = వైదేహి అని చెప్పబడేది, అన్నమ్

---

**(తిఱై వయిఱ్ఱు ప్పేయే తిరిన్దు)** -ఎండిన కడుపును కల పిశాచాలు తిరుగుతున్నాయి. ఆహారం లేనందువల్ల పిశాచాల కడుపులు ఎండిపోయాయి. **"పేయే"** అని ఏకారాన్ని ప్రయోగించినందువల్ల అక్కడ ఇక వేఱే ఏ జంతువులు లేవని భావం.

**(ఉలవాక్కొల్ నవిలుమ్)** - "ఈ వనంలో ప్రవేశించిన ఇతడు మరణించాడు; ఇతడు చావడానికి సిద్ధంగా ఉన్నాడు'' అనే మాటే వినబడుతున్నది. **"ఉలవా వెజ్కానమ్"** అని అన్వయం. అపుడు అంతు లేని దీర్ఘమైన భీకరారణ్యం- అని చెప్పవచ్చు. **"తే వనేన వనం గత్వా"** (రామా-బాల- 1-30) అని చెప్పబడింది కదా!

**(వెజ్కానత్తూడు)** - మిక్కిలి భయంకరమైన అరణ్యం నడుమ.

**(కొడుమ్ కదిరోన్)** - సూర్యుడు కైకేయిపక్షానికి చెందినవాడయ్యాడు. శ్రీరాముని బాధించడంకోసమే పొందిన క్రూరమైన కిరణాలను కలవాడయ్యాడు.

**(తున్ను వెయిల్)** - పూర్ణమైన నిండైన ఎండ

**(వెయిల్ వఱుత్త వెమ్పరల్)** - ఎండ పాలరాళ్ళను పగులగొడుతున్నది. అది పగులగొట్టగా పగులగొట్టగా అవి గులకరాళ్ళుగా మాఱుతున్నవి. చివరకు సూర్యునికూడా ఎదిరించి దహించే వేడిమిని కల్గినవి అవుతున్నవి.

**(వెమ్ పరల్‌మేల్)** - అటువంటి వేడిరాళ్ళపై.

తున్ను వెయిల్వఱుత్త వెమ్బురల్మేల్ పఞ్జడియాల్* 50

మన్ననిరామన్ పిన్ వైతేవి యెన్ఱురైక్కుమ్*
అన్ననడైయ అణఙ్గు నడన్దిలళే* 51

---

నడైయ అణఙ్గు = హంసగమనంవంటి గమనాన్ని కల సీతాదేవి, మన్నన్ ఇరామన్

---

**(పఞ్జడియాల్)** - దూదివలె మెత్తగా ఉండే శ్రీచరణాలతో. **"పద్మసమప్రభా"** (తామరవంటి కాంతిని కల్గినది) అనే రీతిలో కాంతి, మృదుత్వం మొదలైన గుణాలకు తామరపూవు, దూది మొదలైనవానినేకదా వాటికి ఉపమానాలుగా చెప్పవలసి ఉన్నది!

**(మన్నన్)** - లోకం అనే భూదేవిని పాలించడంకోసం అలంకరించుకోనున్న కిరీటాన్ని విడచి శ్రీదేవి అయిన ఈమెనే పాలించడంకోసం అరణ్యాలకు వెళ్ళినందువల్ల ఈమెకు భర్త కావడం అరణ్యాలకు వెళ్ళినపుడే. **"దీయమానం న తు తథా, ప్రతిజగ్రాహ రాఘవః, అవిజ్ఞాయ పితుః ఛందమ్"** (రామా- అయో- 118-51) (దానజలధారాపూర్వకంగా దాన మిచ్చే నన్ను, తన తండ్రి భావాన్ని తెలియకుండా శ్రీరాముడు పరిగ్రహించలేదు) అని అంటూ సీతాదేవి స్వయంగా పల్కిన రీతిలో, తనను దానం చేయడానికి ప్రయత్నించగానే, "నా తండ్రి వచ్చారా?" అని శ్రీరాముడు అడుగగా, ఆ పితృపారవశ్యాన్ని గమనించి, దానికే తాను జిత అయినట్లే, రాజ్యాన్ని విడచిన గొప్పతనానికి జిత అయిన రీతిని "మన్నన్" అనే పదం తెల్పుతున్నది.

**(ఇరామన్)** - అందఱిని ఆనందింపజేసే శ్రీరాముని వెనుక పోయేటట్లు అయితే, ఈ అరణ్యానికి మాత్రమే కాదు, ఏచోటికి అయినా పోవచ్చునుకదా! నరకానికికూడా పోవచ్చునుకదా! **"యస్త్వయా సహ స స్వర్గో నిరయో య స్త్వయా వినా"** (రామా-అయో- 30-18) (నీతో కలసి ఉండడమే స్వర్గం; నిన్ను విశ్లేషించడమే నరకం) అని అన్నది కదా (సీతాదేవి)

**(వైతేవి)** - విదేహరాజు అయిన జనకుని పుత్రిక అయినందువల్ల రాజ్యాన్ని విడచి అరణ్యానికి వెళ్ళగల్గిన గొప్పతనాన్ని కల్గినది ఈమెకూడా.

**(ఎన్ఱురైక్కుమ్)** - అని శ్రీరామాయణం పల్కుతుంది. **"సీతాయా శ్చరితం మహత్"** (బాల-2-41) అనే రీతిలో సీతాదేవియొక్క గొప్ప చరిత్రమేకదా శ్రీరామాయణం- అని అన్నాడుకదా వాల్మీకిమహర్షికూడా.



పిన్నుమ్ కరునెడుఙ్గణ్ శెవ్వాయ్ ప్పిణైనోక్కిన్*

---

పిన్ = ఆశ్రీరామప్రభువు వెంట, పఞ్జ అడియాల్ = పత్తివలె మృదువైన శ్రీచరణాలతో, నడన్దిలళే = తానుకూడా నడచివెళ్ళలేదా ! పిన్నుమ్ =అంతేకాక, కరు నెడు కణ్ శెమ్ వాయ్ పిణై నోక్కిన్ మిన్ అనైయ నుణ్ మరుఙ్గుల్ = నల్లని

---

**(ఎన్ఱురైక్కుమ్)** - ఈమె స్త్రీలకు తిలకం అని లోకం అంతా పలికేటట్లున్నది సీతాదేవి- అనికూడా భావం.

**(అన్న నడైయ)** - ఈమె హంసగమనాన్ని చూస్తే శ్రీరాముడు సైతం మడల్ ఎత్తవలసినట్లు ఉంటుంది.

**(అణఙ్గు)** - **"అణఙ్గు"** అంటే దేవతాస్త్రీ. **"తస్య భూయో విశేషేణ మైథిలీ జనకాత్మజా, దేవతాభి స్సమా"** (రామా-బాల- 77-35) (జనకపుత్రిక అయిన మైథిలి శ్రీరామునకు తగినది. విశేషించి దేవతలతో సమానురాలు), **"త్రయాణాం భరతాదీనాం భ్రాతౄణాం దేవతా చ యా"** (రామా-సుంద-55-26) (భరతుడు మొదలైన ముగ్గురు భ్రాతలకు ఏ సీతాదేవి దైవమో), **"శీతై యెన్బదోర్ దెయ్వమ్"** (పెరియ తిరు-10-2-5) అనే రీతిలో మిగిలినవారితోపాటు, శ్రీరామునితోపాటు తేడా లేకుండా అందఱికి సీతాదేవి దైవమై ఉన్నది.

**(నడన్దిలళే)** - అటువంటి గొప్పతనాన్ని కల్గినదికదా శ్రీరాముని వెంట వెళ్ళింది. సర్వలోకజనని అయిన ఆమె తన స్వరూపాన్ని గమనించకుండా, శ్రీరాముని నిర్బంధించి అరణ్యాలకు వెళ్ళినపుడు, మనవంటివారు అతనిని పొందనపుడు మడల్ ఎత్తడంలో ఏమి తప్పు ?

**(పిన్నుమ్..... పుణర్న్దిలళే)** - "ఒక గంధర్వస్త్రీని ఒక గంధర్వుడు వివాహం చేసికొని తీసికొని పోగా, ఆమె సోదరుడు వచ్చి యుద్ధం చేసి ఆమెను వెనుకకు తీసికొని పోవాలని ప్రయత్నించినపుడు, ఆమె తన సోదరునితో యుద్ధం చేసి జయించి, తాను అతడు కలసి సుఖంగా జీవించారనే మహాభారతంలో ఒకానొక వృత్తాంతం ఉన్నది. దానిని ఈసూక్తి తెల్పుతున్నది" అని అழకియమణవాళ ప్పెరుమాళ్ నాయనార్ తమ వ్యాఖ్యలో తెలియజేశారు.

**(పిన్నుమ్)** - సీతా పిరాట్టినిగూర్చిన పల్కిన నోటితో తిరిగి పలుకదగిన గొప్పతనాన్ని కల్గిన ఒకతె. (ఇంచుమించు పిరాట్టితో సమానమైన గొప్పతనాన్ని కల్గిన ఒకతె)

మిన్ననైయ నుణ్మరుఙ్గుల్ వేకవతి యెన్ఱురైక్కుమ్ 52
కన్ని తన్ ఇన్నుయిరాఙ్కాతలనై క్కాణాతు*

దీర్ఘమైన నేత్రాలను, ఎఱ్ఱని అధరాన్ని, లేడి చూపువంటి చూపును, మెఱుపువంటి సూక్ష్మమైన నడుమును కల్గినదై, వేకవతి ఎన్ఱు ఉరైక్కుమ్ = వేగవతి అని చెప్పబడే, కన్ని = ఒక కన్యక, తన్ ఇన్ ఉయిర్ ఆమ్ కాతలనై కాణాతు = తన తీయని

**(కరునెడుఙ్కణ్)** -**"అసితేక్షణా"** (రామా-సుంద- 16-5), **"మైయార్ కరుమ్ కణ్ణి కమలమలర్ మేల్ శెయ్యాళ్"** (తిరువాయ్-9-4-1) అని నల్లని నేత్రాలను కల్గినది - అని పిరాట్టికి కల వైలక్షణ్యం ఏమంటే నేత్రాలలోని విస్తృతి.

**(శెవ్వాయ్)** -సర్వరక్షకుడైన అతనిని (శ్రీరాముని) కూడా **"పురేవ మే చారుదతీమ్... జగత్ సశైలం పరివర్తయామ్యహమ్"** (రామా- ఆర-64-76) (అందమైన చిఱునవ్వును కల సీతను పూర్వంవలె నావద్ద అప్పగించకపోతే, పర్వతాలతో కూడిన లోకాన్ని పరిభ్రమింపజేస్తాను) అని అనేటట్లు తన విశ్లేషంవల్ల లోకాన్ని తలకిందులుగా చేసే **"శురి కుழల్ పనివాయ్ తిరు"** (పెరియతిరు-5-7-7) అయిన సీతాదేవి మందహాసంతో పోలి ఉన్నది.

**(పిణై నోక్కిన్)** - అరక్షణం విశ్లేషిస్తే, **"న జీవేయం క్షణ మపి"** (రామా-సుంద-96-10) (ఒక్కక్షణం కూడా విడిచి ఉండలేను) అనేటట్లు చేసే **"మాన మరుమ్ మెన్నోక్కి"** (పెరియతిరు-11-5-1) అయిన సీతయొక్క చూపుతో పోలి ఉన్నది.

**(మిన్ననైయ నుణ్ మరుఙ్గుల్)** - **"మిన్ననైయ నుణ్ మరుఙ్గుల్ మెల్లియల్"** (పెరియతిరు-3-9-5) అని, **"సుమధ్యమా"** (రామా-ఆర-11-1) అని చెప్పబడే ఆమె (సీత) వలె నాయకునకు ఎల్లప్పుడు "ఎప్పుడు పడిపోతుందో ! ఏమో !" అని భయసందేహాలను కల్గించే సన్నని నడుమును కల్గినది.

**(వేకవతి ఎన్ఱురైక్కుమ్)** - వేగవతి అని చెప్పబడే- అని భావం. శ్రీరామాయణం అంతా సీతాదేవి వృత్తాంతాన్ని తెల్పినట్లే, మహాభారతం అంతా తననుగూర్చి (వేగవతిని గూర్చి) చెప్పేటట్లున్నది'' **(శ్రీరామాయణమాక ప్పిరాట్టి వృత్తాన్తమ్ శొన్నాప్పోలే మహాభారతమాక త్తన్నై చ్చొల్లుమ్పడి యిరున్దవళ్)** - అని నాయనార్ వ్యాఖ్యానసూక్తి.



తన్నుడైయ మున్తోన్ఱల్ కొణ్డేక త్తాన్ శెన్ఱు* - అఙ్గు 53
అన్నవనై నోక్కాతు అழித్తురప్పి* - వాళమరుళ్

ప్రాణం వంటి భర్తను తాను చూడలేని రీతిలో, తన్నుడైయ మున్ తోన్ఱల్ కొణ్డు ఏక = తన అన్న అడ్డుకొని, తనను తీసికొనిపోగా, అఙ్గు = ఆ స్థితిలో, అన్నవనై = ఆ అన్నను, నోక్కాతు = లక్ష్యం చేయకుండా, అழిత్తు ఉరప్పి = చాలా తక్కువ అయిన మాటలను పల్కి, అతనిని నిందించి, తాన్ శెన్ఱు = తాను బలాత్కారంగా

**(కన్ని)** - పన్నెండు ఏండ్లు కలసి ఆనందించిన సీతాదేవి శ్రీరాముని వెంట రావడం ఒక గొప్ప కాదు. నాయకునితో కలసి తెలియని కన్య అయిన ఈమె తండ్రిని సైతం ఎదిరించి నాయకుని వెంట వెళ్ళడమే అరుదైన కార్యం. **"సమా ద్వాదశ తత్రాహం రాఘవస్య నివేశనే, భుంజానా మానుషాన్ భోగాన్ సర్వకామసమృద్ధినీ"** (రామా-సుంద-33-17) (శ్రీరాముని ఇంటిలో పన్నెండు ఏండ్లు అప్రాకృతభోగాలను అనుభవిస్తూ అన్ని కోరికలను ఈడేర్చుకున్నదానను అయ్యాను) అని పల్కిన సీతాదేవివలె సంగమసుఖాన్ని పొందని కన్యగా ఉండే ఈమె.

**(తన్ ఇన్నుయిరామ్ కాతలనై క్కాణాతు)** - తనకు ప్రాణాలకంటే తీయనివాడై, ప్రేమే మూర్తీభవించినవాడైన అతనిని చూడలేని రీతిలో.

**(తన్నుడైయ మున్ తోన్ఱల్ కొణ్డేక)** - తనతో ఒకే కడుపున పుట్టిన అన్న ఈమె ప్రియునితో వెళ్ళడాన్ని సహించలేక, ప్రియునివద్దనుండి ఈమెను విడదీసి తీసికొని పోగా,

**(తాన్ శెన్ఱు)** - తానే అతనిని (సోదరుని) విడచిపెట్టి పోయి,

**(అఙ్గు అన్నవనై నోక్కాతు)** -"తాను వెళ్ళేటపుడు కనీసం నాతో చెప్పకుండా కూడా పోవడమా!" అని ఆమెను నివర్తింపజేయాలని ప్రయత్నించిన సహోదర పాశాన్ని కల్గిన అతనినికూడా చూడకుండా.

**(అழித్తు)** - కఠినోక్తులను పల్కి, అతని స్వరూపాన్ని నశింపజేసి.

**(ఉరప్పి)** - "నాప్రియుని వద్దనుండి నన్ను నీవు విడదీయడాన్ని చూస్తే, మనమిరువురం స్వయంవరం చేసికోవచ్చు- అని నీవు భావిస్తున్నట్లు తోస్తున్నది. తోడబుట్టిన నన్ను నీవే పెండ్లాడాలని అనుకుంటున్నావా! ఛండాలుడా!" అనే రీతిలో కఠినమైన మాటలను పల్కి.

కన్నవిల్‌తోళ్ కాళైయై క్కైప్పిడిత్తు మీణ్డుమ్ పోయ్* 54
పొన్నవిలు మాకమ్ పుణర్న్దిలళే* - పూజ్గజ్జై

బయలుదేరిపోయి, వాళ్ అమరుళ్ = గొప్ప యుద్ధరంగంలో, కల్ నవిల్ తోళ్ కాళైయై = పర్వతంవలె దృఢమైన బాహువులను కలవాడు, ఆబోతువలె పొగరును కలవాడు అయిన తన ప్రియుని, కై ప్పిడిత్తు = పాణిగ్రహణాన్ని చేసికొని, మీణ్డుమ్ పోయ్ = అక్కడనుండి తన నివాసానికి పోయి చేరి, పొన్ నవిలుమ్ ఆకమ్ = (ఆ ప్రేమికుని యొక్క) బంగారంవలె స్పృహణీయమైన వక్షఃస్థలంలో, పుణర్న్దిలళే=

**(వాళమరుళ్)** - ప్రియునకు, సోదరునకు మధ్య జరిగిన గొప్ప యుద్ధంలో.

**(కన్నవిల్ తోళ్ వళైయై క్కైప్పిడిత్తు)** - సోదరుని (అన్న) చేతిని విసరికొట్టి, ప్రియుని చేతిని గ్రహించింది వేగవతి.

**(కల్‌నవిల్ తోళ్)** - సోదరుడు మొదలైన దగ్గరి బంధువులను అందఱిని విడచి, ఆశ్రయించదగిన, శిలవలె దృఢమైన బాహువులను కలవాడు.

**(కాళై)** - బాహుబలం లేకపోయినా అతని యౌవనపరువమే చాలు- అభిలషించడానికి, ఈమె అతని వెంటవెళ్ళడానికి.

**(క్కైప్పిడిత్తు)** - తనకోసం యుద్ధంలో బాణాలను ప్రయోగించిన అతని చేతిని అందరు చూస్తూ ఉండగా పట్టుకొని.

**(మీణ్డుమ్ పోయ్)** - సోదరునివద్దనుండి తిరిగిపోయి -అని భావం. తిరిగి తన నివాసాన్ని చేరి- అని కూడా చెప్పవచ్చు.

**(పొన్నవిలుమ్ ఆకమ్ పుణర్న్దిలళే)** - **"భర్తారం పరిషస్వజే"** (రామా-ఆర-30-39) (భర్తను ఆలింగనం చేసికొన్నది) అని, సీతాదేవి ఖరవధ సందర్భంలో వేయి బాణప్రహారాలకు గురి అయిన స్వామి వక్షస్సును తన స్తనతటాలతో తడవి, గాయాలకు సపర్య చేసినట్లు, యుద్ధంలో తనకోసం బాణాల దెబ్బలను తిని, అందమైన బంగారంవలె ఎఱ్ఱగా ఉండే నాయకుని వక్షస్సును రథం పైకి ఎక్కి తడవి గాయాలకు వేగవతి చికిత్స చేసింది.

**(పూజ్కజ్జై మున్నమ్ ...... కేట్టఱివదిల్లైయే)** - నాగకన్యక అయిన ఉలూపి, తీర్థయాత్రను చేసే అర్జునుడు గంగానదిలో స్నానం చేసేటపుడు అతనిని చూచి



మున్నమ్ పునల్ పరక్కుమ్ నన్నాడన్* మిన్నాడుమ్ 55

సంశ్లేషించిందికదా (ఆలింగనం చేసికొన్నదికదా), పూ కజ్జై పునల్ మున్నమ్ పరక్కుమ్ నల్ నాడన్ = అందమైన గంగానదియొక్క తీర్థం ముందు విస్తరించిన గొప్ప దేశానికి ప్రభువు, మిన్ ఆడుమ్ = కాంతిని కల్గినది, కొల్ నవిలుమ్ నీళ్

మోహించి, అతనిని నిర్బంధించి తీసికొని పోయి తన ఆశనుగూర్చి ఏ సంకోచం లేకుండా అతనితో పల్కి, అతనిని అనుభవించింది- అని మహాభారతం- ఆదిపర్వం లోని 243వ అధ్యాయంలో తెలుపబడ్డ ఇతిహాసాన్ని ఇకపై అనుసంధిస్తున్నారు.

**(పూజ్కజ్జై)** -పూర్వం తెలుపబడ్డ వేగవతి ప్రియునివలె అప్రసిద్ధుడైన ఎవడో ఒకని కోసమా ఈ ఉలూపి మడల్ ఎక్కినది? సుప్రసిద్ధుడైన రాజపుత్రుడు అర్జునునికోసంకదా ఈమె మడల్‌ను ఎక్కింది.

**(పూజ్కజ్జై)** - తన రెండు తీరాలలో తోటలను కల్గినదై, ఆ తోటలలో అంతటా పూలు చిందే గంగానది. **'కాన్ తడమ్ పొ*ழி*ల్ శూ*ழ்* కజ్జై"** (పెరియా*ழ்*వ్వార్ తిరు- 4-7-10), **"కరై మరమ్ శాడిక్కడుత్తి*ழி* కజ్జై"** (4-7-9) అని ఆ*ழ்*వ్వార్లు అన్నారు కదా ! లేక, **"నలన్తిక*ழ்* శడైయాన్ ముడి క్కొన్టై మలరుమ్ నారణన్ పాదత్తు*ழ்*ాయుమ్ కలన్ది*ழி* పునలాల్ పుకర్‌పడు కజ్జై"** (పెరియా*ழ்*వ్వార్ తిరు- 4-7-2) అనే రీతిలో శంకరుని జటలలోని పూలను, చతుర్భుజుని శ్రీపాదపద్మాలను గంగానది స్పృశించి రావడాన్నిగూర్చి తెలుపుతున్నదనికూడా చెప్పవచ్చు. **"కఱ్పకమలరుమ్ కలన్ది*ழி* కజ్జై"** (పెరియా*ழ்*వ్వార్ తిరు-4-7-7) కనుక ఈవిధంగా చెప్పబడుతున్నదనికూడా చెప్పవచ్చు.

**(మున్నమ్ పునల్ పరక్కుమ్)** - హిమవత్పర్వతంలో ఏకొంచెం జలం ఉద్భవించినా, అది మొదట ప్రవహించడం ఇతని దేశంలోనే. **"తలై మడై"** - ప్రధానక్షేత్రంగా ఉన్నది. దీనివల్ల నీటిసమృద్ధి తెలుపబడింది.

**(నన్నాడన్)** - ఇది స్థలసమృద్ధిని తెలుపుతున్నది. ఇకపై నాయకుని సమృద్ధి తెలుపబడుతున్నది.

**(మిన్ ఆడుమ్ కొల్ నవిలుమ్ నీళ్ వేల్)** - మెఱుపువలె కాంతిని కల్గినదై, మిక్కిలి వేగంగా సంచరించేదై, శత్రువులు చూస్తున్నపుడే వారికి కడుపులో వేదనను కల్గించే రీతిలో తాను చేసే వధను సూచిస్తున్నదై, శత్రువులు ఎక్కడ ఉన్నా వారిని వధించేటట్లుండే ధైర్యాన్ని (పొడుగును) కల్గిన వేలాయుధం.

కొన్నవిలుమ్ నీళ్వేల్ కురుక్కళ్ కులమతలై*
తన్నికరొన్టిల్లాత వెన్టి త్తనఙ్జయనై* 56
పన్నాకరాయన్ మడప్పావై*- పావైతన్

వేల్ = వధించే కృత్యాన్ని అభ్యసించిన, దీర్ఘమైన (పొడుగైన) వేలాయుధాన్ని చేతిలో కలవాడు, కురుక్కళ్ కులమ్ మతలై = కురురాజవంశంలో ఉద్భవించినవాడు, తన్ నికర్ ఒన్టు ఇల్లాత వెన్టి = సాటి లేని జయాన్ని కల్గినవాడు అయిన, తనఙ్జయనై = అర్జునుని, పన్నాకరాయన్ మడమ్ పావై = గౌరవ్యుడనే సర్పరాజుయొక్క అందమైన కన్య అయిన ఉలూపి, పావైతన్ మన్నియ నాణ్

**(కురుక్కళ్ కులమతలై)** - కురురాజకులపుత్రుడు. లోకానికి అంతటికి గురువులై ఉండేవారు కురురాజులు. వారిలో ప్రధానుడు ఇతడు.

**(తన్నికర్ ఒన్టిల్లాత)** - వీర్యగుణంలో శ్రీకృష్ణుడుసైతం తనకు సాటి కాదు- అనే రీతిలో సాటి లేని.

**(వెన్టి త్తనఙ్జయనై)** - జయం తప్ప ఇంకొకటి తెలియని అర్జునుని

**(తనఙ్జయనై)** - అర్థ-కామాలను జయించినవానిని. తనను ఆశపడిన ఊర్వశిని సైతం తల్లిగా భావించాడుకదా !

**(పన్నాకరాయన్ మడప్పావై)**- "పన్నగమ్ -పదా న గచ్ఛతీతి పన్నగః" (కాళ్ళతో సంచరించనిది) అనే వ్యుత్పత్తిని కల సర్పం. "పన్నగరాయన్" అనే పదం "పన్నాకరాయన్" అనే రూపాన్ని పొందింది (ఛందస్సుకు అనుగుణంగా). సర్పాల ప్రభువుయొక్క స్త్రీత్వపూర్తిని కల పుత్రిక.

**(మడప్పావై)** -స్త్రీత్వంలో ఈమెకంటే గొప్పవారింకొకరు లేరు- అని భావం.

**(పావైతన్ మన్నియ నాణచ్చమ్ మడ మెన్టివై యకల)** - పుట్టిన తరువాత కల్గినవి కాకుండా, సహజంగానే ఉండే స్త్రీ సహజమైన లజ్జ, జంకు, వినయం అనే గుణాలు సముద్రంలో ఇంకిపోయేటట్లుగా, "నాణమ్" -స్త్రీకి తగని పనిలో మనస్సు వెనుకంజ వేయడం. "అచ్చమ్"- ఆ పనిని తలచినా మనస్సు జంకడం, "మడమ్"- అన్నీ తెలిసినా తెలియనట్లుండడం. "పయిర్ప్పు"- అన్యపురుషుల వస్త్రాలు మొదలైనవి తనపై పడినపుడు జుగుప్సను పొందడం. నాల్గవది అయిన "పయిర్ప్పు".



మన్నియ నాణచ్చమ్ మడమెన్టివై యకల* 57
తన్నుడైయ కొఙ్గైముకమ్ నెరియ* - తాన్ అవన్దన్
పొన్ వరైయాకమ్ తழీఇ క్కొణ్డుపోయ్* తనతు 58

అచ్చమ్ మడమ్ ఎన్టు ఇవై అకల = స్త్రీత్వానికి తగిన బిడియం, అణకువ, (భయం), అందం మొదలైన గుణాలు తొలగిపోగా, తన్నుడైయ కొఙ్గై ముకమ్ నెరియ = తన స్తనాల ముఖం ముడుచుకోగా, తాన్ = (సిగ్గును విడచి) తానే స్వయంగానే, అవన్తన్= ఆ అర్జునునియొక్క, పొన్ వరై ఆకమ్ = అందమైన పర్వతంవంటి వక్షస్సును, తழీఇ క్కొణ్డు పోయ్ = ఆలింగనం చేసికొని, తనతు = తన, నల్

ఇది పాతివ్రత్యాన్ని కల ఏ స్త్రీకి అయినా అవశ్యాపేక్షితం కనుక ప్రత్యేకంగా చెప్పబడ లేదు.

**(తన్నుడైయ కొఙ్గై ముకమ్ నెరియ)** - తన స్తనాలముఖం సమ్మర్దం చెందేటట్లు తాను ఏకపక్షమైన కామాన్ని (అనురాగాన్ని) కల్గినదై.

**(తాన్ అవన్ తన్ పొన్వరై యాకమ్ తழீఇ క్కొణ్డు పోయ్)** - అతని బంగారు పర్వతంవంటి వక్షస్సును అతడు అంగీకరించనపుడుకూడా తాను ఆలింగనం చేసికొంటూ పోయి.

**(పొన్వరై యాకమ్)** - లోకంలో ఉండేవారు ఊర్వశిని పొందడంకోసం నోము నోచగా, ఊర్వశి తాను ఇతని వక్షస్సును ఆలింగనం చేసికోవాలని ఆశపడింది కదా!

**(తనతు నన్నకరమ్)** - మడల్ ఎక్కడాన్ని అడ్డుకొంటూ ఊరిలో ఉండే మీవలె కాకుండా, మడల్ ఎక్కేవారిని ప్రశంసించే తనయొక్క గొప్ప నగరాన్ని.

**(పుక్కు)** - ప్రవేశించి.

**(నయన్దు)** - కీర్తించి, చిరకాలం కూడి ఆనందించి

**(ఇనితు వాழ్న్దతువుమ్)** - మీవలె అడ్డుకొనేవారు ఎవరూ లేకుండా సఖులు అంతా అతనిని పొందడానికి తగిన ఉపాయాన్నిగూర్చి చెప్పేవారు, పొగడేవారు కావడంవల్ల, భోగ్యత తప్ప వేఱు విషయాన్ని ఏదీ లేకుండా జీవించగల్గిన విషయాన్ని.

నన్నకరమ్బుక్కు నయన్దు ఇనితు వాళ్న్దతువుమ్*
మున్నురైయిల్ కేట్టఱివతిల్లైయే* - శూళ్కడలుళ్ 59

పొన్నకరుమ్ శెర్ఱ పురన్దరనోడేరొక్కుమ్*
మన్నవన్ వాణన్ అవుణర్క్కు వాళ్ వేన్దన్* 60

తన్నుడైయ పావై యులకత్తు త్తన్నొక్కుమ్*

---

నకరమ్ పోయ్ పుక్కు = అందమైన స్థానంలోకి (నాగలోకంలోకి) పోయి ప్రవేశించి, నయన్దు = పొగడి, ఇనితు వాళ్న్దతువుమ్ = ఆనందంగా జీవించింది- అనే విషయాన్ని, మున్ ఉరైయిల్ కేట్టు అఱివతు ఇల్లైయే = మహాభారతంలో మీరు విని తెలిసికోలేదా?, శూళ్ కడలుళ్ = విస్తృతమైన సముద్రంలో ఉండే, పొన్ నగరమ్ శెర్ఱ = హిరణ్యాసురునియొక్క నగరాలను పాడుచేసిన, పురన్దరనోడు ఏర్ ఒక్కుమ్ = దేవేంద్రునితో సమానమైన గొప్పతనాన్ని కలవాడు, మన్నవన్ = రాజాధిరాజు, అవుణర్క్కు వాళ్ వేన్దన్ = అసురులకు గొప్పతనాన్ని కల ప్రభువు అయిన, వాణన్ తన్నుడైయ పావై = బాణాసురుని కుమార్తె, ఉలకత్తుతన్ ఒక్కుమ్

---

**(మున్నురైయిల్ కేట్టఱివదిల్లైయే)** - మీరు కామశాస్త్రాన్ని అభ్యసించక పోయినా పోవచ్చు. పుణ్యంకోసంగా ఇతిహాసం అయిన మహాభారతంకూడా వినలేదా! దానిని వినినా (ఉలూపి) మడల్ ఎత్తడంలోని గొప్పతనాన్ని తెలియవచ్చు కదా!

**(శూళ్కడలుళ్ .... పేరిన్బమెయ్‌తినాళ్)** - బాణాసురుని పుత్రిక ఉషాదేవి, శ్రీకృష్ణుని మనుమడైన అనిరుద్ధుని అపహరించుకొని పోయి అనుభవించిన రీతిని ఇది తెలుపుతున్నది.

**(శూళ్కడలుళ్ పొన్నకరమ్ శెర్ఱ పురన్దరన్)** - సముద్రంలోపల హిరణ్యపురవాసులైన అసురులను వధించి పురందరుడనే పేరును పొందిన ఇంద్రుడు.

**(పురన్దరనోడు ఏర్ ఒక్కుమ్ మన్నవన్ వాణన్)** - ఇంద్రునితో సాటి వచ్చే గొప్పతనాన్ని కల ప్రభువులకు ప్రభువైన బాణాసురుడు.

**(అవుణర్క్కు వాళ్‌వేన్దన్)** - అసురకులప్రభువు.

**(తన్నుడైయ పావై)** - అతని పుత్రిక.



కన్నియరై యిల్లాత కాట్చియాళ్* - తన్నుడైయ 61
ఇన్నుయిర్ త్తోళియాల్ ఎమ్పెరుమానీన్ తుళాయ్*

---

కన్నియరై ఇల్లాత కాట్చియాళ్ = ఏలోకంలో అయినా తనతో సాటి వచ్చే స్త్రీలు లేరు అనే రీతిలో అందంలో గొప్పది అయిన ఉష అనే కన్య, తన్నుడైయ ఇన్ ఉయిర్ తోళియాల్ = తన ప్రాణసఖి అయిన చిత్రలేఖద్వారా, మన్ను మణి వరై తోళ్ మాయవన్ = భోగ్యమైన తులసీమాలను అలంకరించుకొన్న రత్నపర్వతాల

---

**(ఉలకత్తు త్తన్నొక్కుమ్ కన్నియరై యిల్లాత కాట్చియాళ్)** - లోకంలో తనవంటి పరువాన్ని కల కన్యలలో తనకు సాటి వచ్చేవారు ఎవరూ లేని అందాన్ని కల్గినది.

**(తన్నుడైయ ఇన్నుయిర్ తోళియాల్)** - తనకు కుడిచేయివంటిదై, ప్రాణం కంటే తీయనిది అయిన చిత్రలేఖ అనే సఖిద్వారా.

**(ఎమ్బెరుమాన్ ఈన్ తుళాయ్)** - **"నిర్గుణమ్ వస్తు- ఎన్టవర్కళుక్కు 'సగుణమ్' ఎన్టు శొల్లి విడుకైయన్టిక్కే, గుణజ్గళిలే కాల్ తాళ్క్కప్పార్క్కుమ్ భాష్యకారరైప్పోలే, పోనపడి శొల్ల ఎన్టు పుక్కు చ్చొల్లవుమ్ విడవుమ్ మాట్టామైయాలే అజ్గే ఆళ్జ్కాల్ పడుకిఱార్"** అని అళకియ మణవాళప్పెరుమాళ్ నాయనార్ వ్యాఖ్యాన శ్రీసూక్తి. పరబ్రహ్మ "నిర్గుణమైన వస్తువు'' అనే వారికి **"సగుణమ్"** అని పల్కి విడువడం కాకుండా, గుణాలలో అవగాహించాలని చూచే శ్రీభాష్యకారుల వలె అనుభవించిన రీతినిగూర్చి పలకాలి అని ప్రారంభించి చెప్పడానికి, విడువడానికి సాధ్యం కానందువల్ల అందులోనే పూర్తిగా నిమగ్నులవుతున్నారు-

**(ఎమ్బెరుమాన్)** - చేతిలో మడల్‌ను ధరించి బయలుదేరేటుట్లగా నాకు అభినివేశాన్ని కల్గించి, తన అధీనం చేసికొన్నవానియొక్క.

**(ఈన్‌తుళాయ్ మన్ను మణివరైత్తోళ్ మాయవన్)** - చాలా భోగ్యమైన తులసిని పొందికగా కల్గిన, నీలమణిపర్వతంవలె ఉండే బాహువులను కల ఆశ్చర్యభూతుడు.

**(మాయవన్)** - గర్హించినపుడుకూడా, ప్రాసంగికంగా స్మరించడం సంభవించ గానే ఆ స్మరణ అభినివేశాన్ని కల్గించడంవల్ల **"మాయవన్"** అని అంటున్నారు. "చేతిలో మడల్ ఎత్తిన సమయంలోకూడా అభినివేశాన్ని పొందించడమా! ఏమి ఈ మాయ!'' అని అంటున్నారు.

మన్ను మణివరైత్తోళ్ మాయవన్* - పావియేన్ 62

ఎన్నై ఇతు విళైత్త ఈరిరణ్డుమాల్వరైత్తోళ్*

వంటి బాహువులను కల ఆశ్చర్యభూతుడు, పావియేన్ ఎన్నై ఇతు విళైత్త ఈర్ ఇరణ్డు మాల్ వరై తోళ్ = పాపి అయిన నన్ను ఈ పాట్లను పెడుతున్న గొప్ప పర్వతాలవంటి నాల్గు బాహువులను కల, మన్నవన్ = రాజాధిరాజు అయిన, ఎమ్బెరుమాన్‌తన్ = శ్రీకృష్ణునియొక్క, కాతలనై = ప్రేమకు ఆస్పదుడైన

**(పావియేన్)** - తమను ఆలింగనం చేసికొన్న బాహువులను స్మరించి నిలువలేకపోవడంవల్ల, **"పావియేన్'** అని తనను తానే నిందించుకుంటున్నది (పరకాలనాయకి). లేక, "అభినివేశాన్ని పొందగానే ప్రియుని తీసికొని వచ్చిన ఉషాదేవి కదా భాగ్యవతి ! మడల్ ఎక్కినపుడుకూడా నిరోధించే సఖిని పొందడానికి నేను ఏమి పాపం చేశానో!"- అనికూడా చెప్పవచ్చు. "మడల్‌ను ఎత్తే విశాల మైన వీథిలో పోయేవారు అందఱు నన్ను అడ్డుకొంటున్నారే ! ఏమి పాపం చేశానో!" అని కూడా చెప్పవచ్చు. భగవత్కామం అనే లోతైన మడుగులో చిక్కుకొని, తీరాన్ని చేరి, మడల్‌ను ఎక్కలేక "పాపిష్ఠిదానను! ఏమి చేయను!"- అని అంటున్నదని కూడా చెప్పవచ్చు.

**(ఎన్నై ఇతు విళైత్త)** - ఈ విధంగా చేతిలో మడల్‌ను ధరించిన నేను బయలుదేరేటట్లుగా చేసిన.

**(ఈరిరణ్డు మాల్‌వరై త్తోళ్)** - నేను పడే పాట్లను చూడగా చూడగా అతని బాహువులు పెరిగి శాఖోపశాఖలుగా విస్తరిస్తున్నవి.

**(మన్నవన్)** - **"నాకణైమిశై నమ్బరర్ శెల్వర్ పెరియర్ శిఱుమానిడవర్ నామ్"** (నాచ్చి. తిరు-10-10) అన్నట్లు రాజాధిరాజు.

**(మన్నవన్ తన్ కాతలనై)** - పుత్రునిపట్లకంటే పౌత్రునికిపట్ల ప్రేమ రెండు రెట్లు ఎక్కువగా ఉంటుందికదా! భగవానుని ప్రేమ ఒక రూపాన్ని ధరించిందా అని తలచేటట్లుండే అనిరుద్ధాళ్వాన్‌ను.

**(మాయత్తాల్ కొణ్డుపోయ్)** -కలలో అనిరుద్ధుని ఉషాదేవి చూచింది. తన చెలికత్తెతో చెప్పింది. చెలికత్తె చిత్రలేఖ లోకంలో ఉండే రాజులను అందఱిని చిత్తరువులో వ్రాసి చూపించింది. 'ఇతడు కాడు, ఇతడు కాడు'' అని ఉషాదేవి



మన్నవన్‌తన్ కాతలనై మాయత్తాల్ కొణ్డుపోయ్* 63

కన్నితన్పాల్ వైక్క మఱ్ఱవనోడు ఎత్తనై యోర్*
మన్నియ పేరిన్బమెయ్‌తినాళ్* - మఱ్ఱివైతాన్ 64

ఎన్నాలే కేట్టీరే యేళైకాళ్! ఎన్నురైక్కేన్*

అనిరుద్ధుని, మాయత్తాల్ కొణ్డు పోయ్ కన్నితన్పాల్ వైక్క = మాయతో తీసికొని వచ్చి, తన దగ్గరకు చేర్చగా, మఱ్ఱు అవనోడు = తరువాత ఆ అనిరుద్ధునితో, ఎత్తనై ఓర్ = పలు విధాలైన సాటి లేని, మన్నియ పేర్ ఇన్బమ్ ఎయ్‌తినాళ్ = స్థిరంగా ఉండే గొప్ప ఆనందాన్ని అనుభవించింది, ఏళైకాళ్ = జ్ఞానహీనులారా!,

కాదన్నది. శ్రీకృష్ణుని వ్రాసి చిత్రలేఖ చూపించింది. "ఒక విధంగా ఇతనితో పోలి ఉన్నాడు. అయితే అతనిది లేతవయస్సు'' అని అన్నది ఉషాదేవి. అనిరుద్ధుని చిత్రం వ్రాసి చూపించగానే "ఇతడే'' అని అన్నది ఉషాదేవి. వెంటనే చిత్రలేఖ యోగబలంతో ద్వారకకు చేరి "కన్యలు వరచౌర్యాన్ని చేస్తారేమో ! అని కావలితో నిద్రించే అనిరుద్ధుని పడుకతో పాటుగా, అపుడే ఈనిన లేగదూడను తీసికొని వచ్చేటట్లు, అనాయాసంగా తీసికొనివచ్చింది.

**(కన్నితన్పాల్ వైక్క)** - స్వప్నంలో చూచినవానినే భావించే కన్యక దగ్గరకు, అతనికికూడా తెలియకుండా అతనిని తీసికొనిరాగా.

**(మఱ్ఱవనోడు)**- ఈమెకు కలలో అతనిని చూచినపుడు ప్రేమ కల్గింది. అతనికి సాక్షాత్తుగా ఈమెను చూచినపుడు ప్రేమ కల్గింది.

**(ఎత్తనైయోర్ మన్నియపేరిన్ప మెయ్‌తినాళ్)** - విషయాన్ని తెలిసిన బాణాసురుడు అనిరుద్ధుని చెఱలో పెట్టినపుడుకూడా ఉషాదేవితో కలిపి పెట్టినందువల్ల, అంతు లేని, సాటి లేని, సహజమైన, గొప్పదైన ఆనందాన్ని, అతనితో కలిసి అనుభవించింది.

**(మఱ్ఱివైతాన్ ఎన్నాలే కేట్టీరే)** - మడల్ ఎక్కాలని ప్రయత్నించి, దానికి కూడా శక్తి లేకుండా ఉండే నావల్లనా ఇటువంటి వేలాది కథలను వినాలని మీరు భావిస్తున్నారు!

**(ఏళైకాళ్)** - జ్ఞానహీనులారా ! ఈమెకు దీనిని పల్కి ముగించడం సాధ్యం కాదు అనే విషయాన్నికూడా తెలియలేదే మీరు !

మన్ను మలైయరైయన్ పొఱ్పావై* - వాణిలా 65
మిన్ను మణిముఱువల్ శెవ్వాయ్ ఉమై యెన్నుమ్*

మఱ్ఱిరు ఇవైతాన్ ఎన్నాలే కేట్టీరే = ఇంకా ఇటువంటి ఉదాహరణలను నా ద్వారానే వినాలని అనుకుంటున్నారా?, ఎన్ ఉరైక్కేన్ = మీకు ఎన్ని అని చెప్పను?, (ఇంకొక ఉదాహరణాన్ని తెలుపుతున్నాను, వినండి), మన్ను మలై అరైయన్ పొన్ పావై = కదపడానికి సాధ్యంకాకుండా, స్థిరంగా ఉండే పర్వతరాజు అయిన హిమవంతుని యొక్క గొప్ప కుమార్తె, వాళ్ నిలా మిన్ను మణి ముఱువల్ శెమ్ వాయ్= కాంతి

**(ఎన్నురైక్కేన్)** - మడల్ ఎక్కడానికి ఉదాహరణాలను నేను చెప్పి ముగించడం సాధ్యమా! ఎంతవరకు ఎన్ని చెప్పగలను? అయినా, చివరిగా విడువ లేని ఒక ఉదాహరణాన్ని చెబుతున్నాను. వినండి- అని అంటున్నది. (పరకాల నాయకి)

**(మన్ను మలైయరైయన్)** - బంగారం స్వచ్ఛతలోని శాతాన్ని తెలిసికోవడం కోసం మచ్చు బంగారాన్ని తీసి పక్కన పెట్టుకుంటారు. అదే రీతిలోని కన్యలకు అందటికి ఉదాహరణంగా ప్రకాశించే కన్యను పొందిన భాగ్యశాలి. మడల్ ఎత్తే కన్యలకు దృష్టాంతంగా ఉండే కన్యను పొందిన భాగ్యవంతుడు.

**(మన్ను మలైయరైయన్ పొఱ్పావై)** - ఊరు, పేరు, తల్లి, తండ్రి తెలియని యథాజాత అయిన కన్యయా మడల్ ఎక్కింది ? లోకం అంతా తెలిసినవాని కన్యకదా! (పార్వతి)

**(అరైయన్ పొఱ్పావై)** - రాజకులంలో జన్మించినదిసుమా !

**(పొఱ్పావై)** - చాలా గొప్పదై, స్త్రీత్వంలో పరిపూర్ణత కల్గినది.

**(వాణిలా మిన్ను మణిముఱువల్)** - జన్మతో, గుణాలతో వచ్చిన గొప్పతనం మాత్రమే కల్గిన, రూపసౌందర్యం లేని కన్యయా మడల్ ఎత్తింది ? కాంతిని పొందికగా కల్గిన వెన్నెలవలె ప్రకాశించే అందమైన చిఱునవ్వును కల్గినది. **"వాణిలా మిన్ను ముఱువల్"**- పలు వరుసలోని మిక్కిలి తెల్లని కాంతిని ఈ ప్రయోగం తెల్పుతున్నది. **'మణి ముఱువల్'**- మణివలె స్పృహణీయమైనది (ఆశపడతగినది), అందమైనది. **"నిలా"**- చంద్రుడు. **"నిలా"**- అంటే చంద్రుని కాంతి అయిన వెన్నెలను తెలుపుతున్నదని గ్రహించి, కాంతిని పొందికగా కల్గిన ఒక గొప్ప వెన్నెలను



అన్ననడైయ అణఙ్గునుడఙ్గిడై శేర్* 66
పొన్నుడమ్బు వాడ పులనైన్దుమ్ నొన్దకల*

నిండిన వెన్నెలవలె ప్రకాశిస్తున్న అందమైన చిఱునవ్వును కల ఎఱ్ఱని అధరాన్ని కల్గినది, ఉమై ఎన్నుమ్ = ఉమా అనే పేరును కల, అన్నమ్ నడైయ అణఙ్గు = హంసనడకవంటి నడకను కల (పార్వతి అనే) దైవకాంత, తన్నుడైయ కూఱై = తన కేశబంధాన్ని, శడా పారమ్ తాన్ తరిత్తు = తానే జటాజూటంగా పేని ధరించి, నుడఙ్గు ఇడై శేర్ పొన్ ఉడమ్బు వాడ = అటు ఇటు కదలాడే నడుములో చేరిన

ప్రసరింపజేసే చిఱునవ్వు- అని కూడా చెప్పవచ్చు. వెన్నెలవలె, మెఱుపువలె, మణివలె ఉండే దంతాల వరుస- అనికూడా చెప్పవచ్చు.

**(శెవ్వాయ్)**- పలువరుసయొక్క తెల్లదనానికి పరభాగశోభను (భిన్నవర్ణాల సమ్మేళనంవల్ల కలిగే ఆకర్షణీయమైన శోభను) కల్గించే ఎఱ్ఱని పెదవిని కల్గినది.

**(ఉమై యెన్నుమ్)** - "ఉమా" అనే ఈ పేరుతో లోకం అంతా ప్రసిద్ధిని పొంది ప్రకాశిస్తున్నది.

**(మలైయరైయన్ పొఱ్పావై ఉమై యెన్నుమ్) - "ఉమాం హైమవతీమ్"** (కేనోపనిషత్) (హిమవంతుని పుత్రిక అయిన ఉమను) అని ఉపనిషత్తులోకూడా పరబ్రహ్మసాక్షాత్కారాన్ని పొందిన విషయం చెప్పబడింది.

**(అన్ననడైయ అణఙ్గు)** - తాను ముందుగా నాల్గు అడుగులు వేస్తే నాయకుని తాపాలు అన్నీ తీరేటట్లుండే హంసగతిని కల్గినదికదా అతనికోసం ఈపాట్లు పడింది.

**(అణఙ్గు)** - దేవతాస్త్రీకదా ఈ పాట్లను పడింది.

**(నుడఙ్గిడై శేర్ ఉడమ్బు)** - అల్లల్లాడే నడుమును కల శరీరాన్ని కల్గినది. నాయకునకుకూడా "విఱిగి పడిపోతుందో ఏమో!" అనే భయాన్ని కల్గించే సన్నని నడుమును అందాన్ని కల్గినది.

**(పొన్నుడమ్బు వాడ)** - అతడు (శివుడు) కూడా, తన శరీరంలో సగం భాగాన్ని ఇచ్చే గొప్పతనాన్ని కల అందమైన శరీరం అతనిని పొందలేనందువల్ల వృక్షాన్ని వీడిన చిగురువలె వాడిపోగా.

తన్నుడైయ కూழை చ్చడాపారమ్ తాన్దరిత్తు* - ఆఙ్గు 67

అన్న అరున్దవత్తినూడు పోయ్* - ఆయిరన్దోళ్

---

అందమైన ఒడలు వాడేటట్లు, పులన్ ఐన్దుమ్ నొన్దు అకల = ఇంద్రియాలు అయిదు బాధపడి తొలగిపోగా, అన్న అరు తవత్తిన్ ఊడు పోయ్ = అటువంటి అరుదైన తపస్సును చేసి ముగించి, (ఏ ఫలం పొందింది ? అంటే), ఆయిరమ్

---

**(పులన్ ఐన్దుమ్ నొన్దకల)** - ఈమె ఇంద్రియాలు అయిదు "ఇంత కఠినతపస్సును చేసే ఈమె శరీరంలో ఉండి ఇక ఈ పాట్లు పడడం మనవల్ల కాదు" అని భావించి, ఈమె శరీరాన్ని విడచి వెడలగా- అని భావం. లోకంలో కఠినతపస్సును చేసేవారు. ఎండుటాకులు మొదలైనవానిని తిని శరీరేంద్రియాలను ధరిస్తారు. (నిలుపుకొంటారు) ఈమె అదికూడా చేయకుండా తపస్సును ఆచరించి "అపర్ణ" అనే పేరు పొందింది.

**(తన్నుడైయ కూழைచ్చడాపారమ్ తాన్ తరిత్తు)** - "కూழை-జట్టుముడిని" తానే జటలు పేని ధరించి- అని భావం. వనానికి పోయినపుడు శ్రీరాముడు జటలను ధరించినట్లుగా ధరించింది. **(అన్న అరున్తవమ్)** అటువంటి గొప్పతపస్సు అని చెప్పడంతప్ప వేఱొక విధంగా చెప్పడానికి సాధ్యం కాదు. ఆ విధంగా పల్కినా తృప్తి లేక **"అరున్తవమ్"** అని అంటున్నారు. ఈ తపస్సుయొక్క రీతిని చెప్పడం ఆరంభిస్తే నోరు నొప్పి పుడుతుంది. తలిస్తే మనస్సు మండుతుంది (బాధపడు తుంది)

**(తవత్తినూడు పోయ్)** - తపస్సు నడుమలో నాయకుని పొంది, తపస్సును చేయడం నిలిపినదా? లేదు. తపస్సును పూర్తిగా ఆచరించింది. ఈమె ఈ విధంగా పాట్లుపడగా, శివుడున్న స్థితి ఇక తెలుపబడుతున్నది.

**(ఆయిరమ్ తోళ్)** - ఈమె బాధపడే కొలది అతడు పెరిగి విస్తరించాడు. **"నైవ దంశాన్ న మశకాన్ న కీటాన్ న సరీసృపాన్, రాఘవోఽపనయేద్గాత్రాత్ తద్గతేనాంతరాత్మనా"** (రామా.సుంద-36-42) (సీతాదేవిపట్ల మనస్సు లగ్నమైనందువల్ల శ్రీరాముడు ఈగలను, దోమలను, కీటకాలను, సర్పాలనుకూడ తన తిరుమేనినుండి తొలగించుకోవడం లేదు) అని ఏవో కొన్ని దినాలు విశ్లేషిస్తే పడరాని పాట్లు పడే అతనివంటివాడు (శ్రీరామునివంటివాడు) కాడు (శివుడు).



మన్ను కరతలఙ్గళ్ మట్టిత్తు* మాతిరఙ్గళ్ 68

మిన్ని యెరి వీశ మేలెడుత్త శూழ் కழల్కాల్*

పొన్నులక మేழுమ్ కడన్దుమ్బర్ మేల్ శిలుమ్బ* 69

---

తోళ్ మన్ను కరతలఙ్గళ్ మట్టిత్తు = (శివుడు తన) వేయి భుజాలను కల్గి చేతులను దిశలలో వ్యాపింపజేసి, మా తిరఙ్గళ్ = దిక్కులు, మిన్ని ఎరి వీశ = మెఱసి నిప్పుకణాలు ఎగసిపడేటట్లుగా, మేల్ ఎడుత్త = ఊర్ధ్వదిశగా ఎత్తిన, కழల్ శూழ் కాల్ = వీరకడియాలను అలంకరించుకొన్న ఒక పాదం, పొన్ ఉలకమ్ ఏழுమ్ కడన్దు = అందమైన ఊర్ధ్వలోకాలను అన్నిటిని దాటి, ఉమ్బర్ మేల్ శిలుమ్బ = పైపైకి సాగిపోయేటట్లుగా (ఒక కాలిని ఎత్తి పట్టి), మన్ను కులమ్

---

**(మన్ను కరతలఙ్గళ్ మట్టిత్తు)** - ఇతడు (శివుడు) ఆడేటపుడు చేతులు వేయి దిక్కులలోకి పోయి మోదినవి.

**(మాతిరఙ్గళ్ మిన్ని ఎరివీశ)** - అందువల్ల దిక్కులలో అంతటా అగ్నికణాలు, పొగ ఎగసి, నిప్పును వెలువరించాయి.

**(మేలెడుత్త శూழ் కழల్కాల్)** - ఆడేటపుడు పైకి ఎత్తబడినది, వీరకడియాలతో చుట్టబడినది అయిన కాలు -అని భావం. నాయకి తనను కోరి బాధపడుతూ ఉండగా, తాను మాత్రం కాలినుండి తలవరకు ఆభరణాలను అలంకరించుకొని ఆనందనృత్యాన్ని చేసిన (శివుని) తీరు ఇది.

**(శూழ்కழఱ్కాల్)**- లోకం అంతా చుట్టి వచ్చే కాలు- అని కూడా చెప్పవచ్చు.

**(పొన్నులకమేழுమ్ కడన్దు)** - త్రివిక్రముడు కొలిచిన లోకాలను అన్నిటిని దాటి.

**(ఉమ్బర్మేల్ శిలుమ్బ)** - ఒక చోట నిలువకుండా దేవలోకాలలో ఇక్కడ అక్కడ ఆడి వచ్చింది. **"ఉమ్బర్"**- దేవలోకం. "పైన ఉండే దేవజాతి ఏమయి పోతుందో ఏమో!" అని భయపడ్డారు. **"మేలుళ్ళ దేవజాతి" ఎన్నాయ్ విళైకిఱతో! ఎన్ఱు అఞ్జుమ్బడి"** అని నాయనార్ వ్యాఖ్యానసూక్తి. **"ఉమ్బర్"**- (దేవతలు తాము ఉన్నచోట నిలువలేకుండా ఉండగా, కులపర్వతాలతోపాటు పదార్థాలు అన్నీ పొన్నచెట్టుపూలవలె పరిభ్రమించగా)- అని పెరియవాచ్చాన్ పిళ్ళైవ్యాఖ్య. "కిడన్ద

మన్ను కులవరైయుమ్ మారుతముమ్ తారకైయుమ్*
తన్నినుడనే శుழల చ్చుழన్ఱాడుమ్* 70
కొన్నవిలుమ్ మూవిలై వేల్ కూత్తన్ పొడియాడి*

---

వరైయుమ్ మారుతముమ్ తారకైయుమ్ తన్నినుడనే శుழల = స్థిరంగా ఉండే కులపర్వతాలు, వాయువు, నక్షత్రాలు, తనతోకూడ పరిభ్రమించగా, శుழన్ఱు ఆడుమ్ = తాను పరిభ్రమిస్తూ నాట్యం ఆడేవాడు, కొల్ నవిలుమ్ మూ ఇలై వేల్ = విధించే కార్యాన్ని చేసే మూడు రేకులను కల్గిన శూలాన్ని కలవాడు, కూత్తన్ = "కూత్తాడి" అనే ప్రసిద్ధిని కలవాడు, పొడి యాడి = భస్మధారి అని ప్రసిద్ధుడు

---

విడత్తిల్ కిడవాతొழிకై. కులవరై యుళ్ళిట్ట పదార్థఙ్గళ్ ఎల్లామ్ పుఙ్షై పూప్పోలే శుழన్ఱువర" అన్నది అచటి సూక్తి.

**(మన్ను కులవరైయుమ్)** - భూమికి మేకు దిగగొట్టినట్లుగా స్థిరంగా ఉండే కులపర్వతాలు.

**(మారుతముమ్)** - సుడిగాలి.

**(తారకైయుమ్)** - లెక్కలేనన్ని నక్షత్రాలు

**(తన్నినుడనే శుழల చ్చుழన్ఱాడుమ్)** - తాను ఆడేటపుడు పైన ధరించిన పొన్నపూల మాల పరిభ్రమించేటట్లుగా, కులపర్వతాలు, సుడిగాలి, నక్షత్రాలు మొదలైనవి తాను ఆడే వేగంవల్ల తనతో పరిభ్రమించేటట్లుగా (శివుడు) నాట్యం చేశాడు.

**(కొల్ నవిలుమ్)** - సంహారాన్ని తెలిపే - అని భావం. సంహారకర్త అయిన అతనికికూడా సంహారకార్యాన్ని సర్వకాలం ఉపదేశించే ఆయుధం. **"అరుళార్ తిరుచ్చక్కరమ్"** (తిరువిరు-33), **"అఆ ముయలాழி"** (తిరువాయ్-2-10-5) అని అనబడే ఆయుధం కాదు. **"కరుప్పూరమ్ నాఱుమో! కమలప్పూ నాఱుమో?"** అని ప్రశ్నించే రీతిలో పాంచజన్యంవలె ఉండేది కాదు. ఆశపడినవారుకూడా దీనిని చూడగానే భయంతో కడుపు పట్టుకొనవలసివచ్చేటట్లున్నది.

**(మూవిలై వేల్)** - విరూపాక్షుడైన అతనికి కన్నులు మూడు అయినట్లుగా ఇదికూడా విరూపంగానే ఉన్నది. (మూడు ఆకులను కల్గి ఉన్నది.)



అన్నవన్తన్ పొన్నకలమ్ శెన్ఱాఙ్గణైన్దిలళే* 71
పన్ని యురైక్కుఙ్గాల్ పారతమామ్* - పావియేఱ్కు

---

అయిన, అన్నవన్తన్ = అటువంటి శివునియొక్క, పొన్ అకలమ్ ఆఙ్గు శెన్ఱు అణైన్దిలళే = అందైన వక్షఃస్థలాన్ని చేరి ఆలింగనం చేసికొనలేదా !, పావియేఱ్కు= పాపిని అయిన నేను, పన్ని ఉరైక్కుఙ్కాల్ = (ఇటువంటి ఉదాహరణలను ఇంకా) విరివిగా చెప్పినట్లయితే, పారతమ్ ఆమ్ = ఒక మహాభారతంగా పర్యవసిస్తుంది,

---

**(కూత్తన్)** - **"తూయ నడమ్ పయిలుమ్ శున్దర్"** (పెరియాழ்వార్ తిరు- 1-6-6) అనబడే సుందరమైన నాట్యమా! ఇది పిశాచి నాట్యం చేసిట్లుగా భయంకరంగా ఉన్నది.

**(పొడి యాడి)** - అతనిని పొంది ఈమె (పార్వతి) పొందబోయే భోగాన్ని చూడండి. భస్మం చందనంగా పూసికొంటుంది. దీనిని పొందడం కోసంకదా ఈ పాట్లు పడింది !

**(అన్నవన్)** - ఇంకా ఈ రీతిలోనే "ఉమ్మెత్తకాయ, జిల్లేడు, ఎముకలు, పులితోలు'' అనే రీతిలో ఇతడు అలంకరించుకొనేవానిని తన నోటితో పలుకలేక, కంటితో చూడలేక, ముఖాన్ని తిప్పుకొని-"అటువంటివాడు'' అని పరకాల నాయకి అంటున్నది.

**(తన్పొన్నకలమ్)** - వీటిని కల్గిన అతని వక్షస్సునే పరమభోగ్యంగా తలచింది- సతి (పతివ్రత) కనుక. **"పొన్అకలమ్"** అని అనడం పార్వతి అభిప్రాయానుసారం.

**(శెన్ఱాఙ్గు అణైన్దిలళే)** - ఇంతటి తపస్సు చేసినా, పోనీ అతడు వచ్చాడా ! అని అంటే, ఏకత్ర అనురాగమై (**"ఒరుతలై క్కామమ్"**) - ఆ స్థితిలోను తానే పోయి అతనిని కౌగలించుకొన్నది కదా! ఒక అంజలిని చేయగానే నీటిబుడగవలె కఱిగి కరుణించే అకారవాచ్యుడు (శ్రీమన్నారాయణుడు) కాదుకదా అతడు. ఇటువంటి అతనిని పొందాలనికదా ఆమె ఆ పాట్లను పడింది. ఇక, ఇతనిని (స్వామిని) పొందాలని నేను మడల్ను అనుష్ఠించడం వింతయా!

**(పన్ని యురైక్కుఙ్కాల్ పారతమామ్)** - ఈ విషయాన్ని విరివిగా పల్కి ముగించడం నావల్ల కాదు. వేదవ్యాసుడు మొదలైనవారే పలకాలి. వారు పల్కినా భారతంవలె విస్తరిస్తుందే తప్ప సంగ్రహంగా పల్కడం వారికికూడా సాధ్యం కాదు.

ఎన్నుఱు నోయ్ యానురైప్ప క్కేణ్మిన్* ఇరుమ్బొழிల్ శూழ் 72

ఎన్ ఉరు నోయ్ = నాకు సంభవించిన బాధ, యాన్ ఉరైప్ప కేణ్మిన్ = నేనే చెప్పగా వినండి, (అది ఏది? అంటే), ఇరు పొழிల్ శూழ் = విశాలమైన తోటలచే

**(పావియేఱ్కు)** - వ్యాసుడు మొదలైనవారివలె విరివిగా పల్కడంలో సామర్థ్యం లేని మహాపాపి అయిన నాకు. **"పన్ని యురైక్కుఙ్కాల్ పావియేఱ్కు పారతమామ్"** అని అన్వయం.

**(ఎన్నుఱు నోయ్ యానురైప్ప క్కేణ్మిన్)** - చెప్పి ముగించడం సాధ్యం కాదనే సంగతిని అటు ఉండనివ్వండి. వారు పడిన పాట్లను విరివిగా చెప్పవలసిన ఆవశ్యకత నాకు లేదు. నేను పడిన పాట్లను నేను చెప్పగా వింటే అంతటిని చెప్పినట్లు విన్నట్లు అవుతుంది. వినండి. పరోక్షంగా తెలిసినదానిని చెప్పగా వినడం అటు ఉండనివ్వండి. ప్రత్యక్షంగా నేను పడే బాధను వినండి.

**(ఎన్ ఉఱు నోయ్)** - నాకు బాగా బలంగా, దృఢంగా కల్గిన బాధ (వ్యాధి). నన్ను లోపల క్లేశపెట్టే బాధ. **"తెయ్వ వన్నోయ్"** (తిరువిరు-53) అనే రీతిలో తిరునఱైయూర్‌లో వేంచేసి ఉండే నమ్బిని (అర్చామూర్తిని) విశ్లేషించి నేను పడే బాధ. నాకు **"ఉఱు తుణై"** (నమ్మకమైన సహచరుడు మిత్రం) గా, ఉద్దేశ్యంగా ఉండే బాధ. శ్రీరాముని సౌందర్యంలో అభినివేశాన్ని కల శ్రీభరతాழ்వాన్ బాధ వంటిది ఇది.

**(యానురైప్ప కేణ్మిన్)** -బాధను పొందిన నేను చెప్పగా వినండి. వేఱొకరిచేత పల్కించడానికి వీలు కానిది కనుక దీనినిగూర్చి నేనే చెప్పాలి.

**(కేణ్మిన్)** - దయచేసి వినండి. నా ప్రాణాలు నిలవాలి అని అంటే వినండి. **"పూరోత్పీడే తటాకస్య పరీవాహః ప్రతిక్రియా, శోకక్షోభే చ హృదయం ప్రలాపై రేవ ధార్యతే"** (ఉత్తర రామచరితమ్) - (తటాకంలో కట్టలు తెగేటట్లు నీరు నిండిపోతే, నీటిప్రవాహానికి కాలువలను తీయడమే కట్టతెగిపోకుండా ఉండడానికి పరిష్కారం. అదేరీతిలో దుఃఖంవల్ల అంతు లేని కలత కల్గినపుడు నోరు తెఱచి రోదించడంద్వారా మనస్సు తట్టుకొంటుంది) అనే రీతిలో నేను బ్రతికి బయట పడడానికి అయినా వినండి.



మన్ను మఱైయోర్ తిరునఱైయూర్ మామలైపోల్*
పొన్నియలు మాడ క్కవాడమ్ కడన్దు పుక్కు* 73

చుట్టబడి ఉండే, మఱైయోర్ మన్నుమ్ = వైదికులు నిత్యవాసం చేసే, తిరు నఱైయూర్ = తిరు నఱైయూర్‌లో, మా మలై పోల్ పొన్ ఇయలుమ్ మాడమ్ కవాడమ్ కడన్దు పుక్కు = గొప్ప పర్వతంవంటి, బంగారం వలె స్పృహ ణీయమైన

**(కేణ్మిన్)** - చెవులున్న దానికి ప్రయోజనం పొందడంకోసం వినండి- అని కూడా చెప్పవచ్చు.

**(ఇరుమ్ పొழிల్ శూழ்)** - విస్తృతిని కల్గిన గొప్ప ఉద్యానవనాలచే పరివేష్ఠింపబడిన తిరునఱైయూర్. నావలె విశ్లేషించి బాధపడేవారికి మడల్ ఎత్తేటట్లుగా తాటిచెట్లు అధికంగా ఉండే తోటలచే చుట్టబడి ఉన్నది.

**(మఱైయోర్ మన్నుమ్ తిరునఱైయూర్)** - మడల్‌ను ఎక్కడమే సకల వేదతాత్పర్యం అని నిరూపించేవారు స్థిరంగా మన్నికగా ఉండే ఊరు. మడల్‌ను ఎక్కడం వేదతాత్పర్యం అనడం ఏవిధంగా ? అని అంటే, **"ప్రజ్ఞాం కుర్వీత", "ధ్యేయః", "సోఽన్వేష్టవ్యః", "ధ్యాయీత", "నిదిధ్యాసితవ్యః"** అని స్వరూప విరుద్ధమైన స్వప్రవృత్తిని చేసి అయినా పరమపురుషుని పొందాలి - అని వేదంలో అంతటా ఘోషింపబడుతున్నది కదా! మడల్ ఎక్కడంకూడా అదేకదా! (స్వప్రవృత్తియే కదా) **"వ్యవసాయాదృతే బ్రహ్మన్! నాసాదయతి తత్పరమ్'** (ఓ బ్రాహ్మణా! తన ప్రయత్నం లేకుండా పరవస్తువును పొందడానికి సాధ్యం కాదు) అనే వేదనిర్ణయాన్ని దర్శించిన మునులుకూడా అన్నారుకదా.

**(మామలైపోల్ మాడమ్)** - గొప్ప పర్వతాలవలె ఉన్నతంగా ఉండే మేడలు. **"సుభగ శ్చిత్రకూటోఽసౌ గిరిరాజోపమో గిరిః, యస్మిన్ వసతి కాకుత్స్థః కుబేర ఇవ నందనే"** (రామా- అయో- 98-12) (తిరుమాలిరుమ్‌శోలై పర్వతంతో సాటి వచ్చే ఈ చిత్రకూటపర్వతం మంగళప్రదమైనది. ఎందుకు ? అని అంటే, కుబేరుడు నందనవనంలో ఉండేటట్లు, ఇందులో శ్రీరాముడు నివసిస్తున్నాడు) అనే రీతిలో పరమపురుషుడు నివసించడంవల్ల గిరిరాజు అనబడే తిరుమాలిరుమ్ శోలై మలైవలె **"మామలై"** అని అనబడుతున్నది. తిరునఱైయూర్ కోవెల చిన్న రాతిపై నిర్మింపబడి ఉన్నా, వీరి భక్తియొక్క ఔన్నత్యంచేత వీరికి ఉన్నతమై, గొప్ప పర్వతంగా భాసిస్తున్నది.

ఎన్నుడైయ కణ్ కళిప్ప నోక్కినేన్* - నోక్కుతలుమ్

అయిన సన్నిధియొక్క తలుపులు ఏదో ఒక విధంగా దాటి పోయి, ఎన్నుడైయ కణ్ కళిప్ప నోక్కినేన్ = నా కన్నులు చల్లబడేటట్లు దర్శించాను, నోక్కుతలుమ్=

**(పొన్నియలుమ్ మాడమ్)** - బంగారంవలె గొప్పదై, స్పృహణీయమై, అందఱు ఆశ పడే స్వభావాన్ని కల్గిన కోవెల.

**(కవాడమ్ కడన్దు పుక్కు)** - తలుపును ఒకసారి దాటి లోపలకు ప్రవేశించి- అని అర్థం. **"కడన్దు"**- శ్రమపడి దాటి. తలుపుయొక్క అందం దారిదోపిడీ చేసేవారివలె, చూపరుల కన్నులను కొల్లగొడుతుంది. కనుక, దానిని దాటివెళ్ళడం చాలా శ్రమతో కూడినదని భావం.

**(కడన్దు పుక్కు నోక్కినేన్)** - అతనిని దర్శిస్తే, తరువాత **"కాలాழுమ్ నెఞ్జழிయుమ్ కణ్శுழలుమ్"** (పెరియ తిరువన్దాది- 34) అనే రీతిలో బలహాని కల్గుతుంది. ముంచి వేసే సుడిగుండంవంటి దానినుండి (కవాటంనుండి) తప్పుకొని దాటినందువల్ల **"పొన్నియలు మాడ క్కవాడమ్"**- దాటి ప్రవేశించడం'' సాధ్యమైనది. అతనిని దర్శించడం అనే బలహానికి ముందే ప్రవేశించవచ్చునే తప్ప, దర్శించిన తరువాత దానిని దాటి పోవడం సాధ్యం కాదు- అని భావం.

**(ఎన్నుడైయ కణ్ కళిప్ప నోక్కినేన్)** - అతనిని పొందలేకపోవడంవల్ల **"ఉఱావి"** (ఆర్తిని పొంది) సముద్రపు నీరునుకూడా ఆవిరి చేసే బడబాగ్నివలె నా కన్నీటిని సైతం ఆవిరి చేసేటట్లు మండే నా కళ్ళు చల్లబడేటట్లుగా

**(కళిప్ప)** - **"కణ్గళారళవుమ్ నిన్ఱు కణ్ణమఙ్గైయుళ్ కణ్డుకొణ్డేనే"** (పెరియ తిరు- 7-10-9) అని వీరే (తిరుమఙ్గైయాழ்వార్లే) అనుగ్రహించిన రీతిలో చిరకాలం ఉపవాసం చేసిన కన్నుల కడుపు నిండేటట్లు చూచాను.

**(నోక్కినేన్)** - **"నణుకినమ్ నామే"** (తిరువాయ్-1-1-3) అనే రీతిలో చాలా నీచుడనైన నేను చాలా గొప్ప వస్తువును దర్శించాను ఆహా ! **"మన్యే ప్రాప్తా స్మ తం దేశం భరద్వాజో౽ యమబ్రవీత్"** (భరద్వాజుడు పల్కిన చోటును చేరాము అని భావిస్తున్నాను) (రామ-అయో-69-9) అనే రీతిలో ఆచార్యోపదిష్టమైన నా లక్ష్యసిద్ధిని పొందాను.



మన్నన్ తిరుమార్పుమ్ వాయుమ్ అడియిణైయుమ్* 74

చూచినంతనే, మన్నన్ = నంబియొక్క, తిరుమార్పుమ్ = లక్ష్మీదేవి నివసించే వక్షఃస్థలం, వాయుమ్ = (చిఱునవ్వుతో నిండిన) అధరం, అడి ఇణైయుమ్ =

**(కళిప్ప నోక్కినేన్)** - **"దృష్ట ఏవ హి నః శోక మపనేష్యతి రాఘవః"** (రామా-అయో-8-4) (చూడగానే మన దుఃఖాలను తీర్చేవాడు రాఘవుడు) అని చెప్పబడిందికదా.

**(నోక్కుతలుమ్ మన్నన్)** - నేను దర్శించగానే నాకు ప్రభువు అయ్యాడు. నన్ను శేషత్వంతో తన వశం చేసికొన్నాడు. కత్తిని, డాలును గ్రహించి ఇతరులను కొల్లగొట్టే తిరుమఙ్గైమన్నన్‌గా ఉండే స్థితి తొలగి, చూడగానే మడల్ ఎక్కే పరకాల నాయకిగా చేసినవాడు.

**(నోక్కుతలుమ్ మన్నన్)** - **"రాజాధిరాజః సర్వేషామ్"** (భార-ఆశ్వ) (అందఱి రాజులకు రాజు) అనేటట్లు చూడగానే ఇతడే సర్వలోకచక్రవర్తి అనే రీతిలో ఉన్నాడు.

**(మన్నన్ తిరుమార్పుమ్)** - పురుషకారభూత అయిన పిరాట్టి ఉండే చోటు కనుక వీరికి అవలంబమై ఉన్నది కనుక, మొదట ముఖాన్ని చూడకుండా వక్షస్సును దర్శించారు. విరహతాపాన్ని తీర్చి, ఉపశాంతిని కల్గిస్తుంది కనుక ముందుగా వక్షః స్థలాన్ని దర్శించారనికూడా చెప్పవచ్చు. బిడియంవల్ల ముఖాన్ని చూడకుండా వక్షఃస్థలాన్ని చూచారు- అని కూడా చెప్పవచ్చు.

**(మన్నన్ తిరుమార్పుమ్)** - **"తిరువిరున్ద పక్కమ్ తిఱ విదు"**, **"అపాంగా భూయాంసో యదుపరి పరం బ్రహ్మ తదభూత్"** (పిరాట్టియొక్క కటాక్షాలు అధికంగా ఎవరిపై పడ్డాయో అతడు పరబ్రహ్మ అయినాడు) అనే రీతిలో ఈమె సంబంధంతో అతడు ప్రభువు అయ్యాడు.

**(వాయుమ్)** - వక్షఃస్థలంగూర్చి పల్కిన తర్వాత, ముఖాన్నిగూర్చి పల్కడం ఎందుకు ? అని అంటే, వక్షఃస్థలంలో ఉండే పిరాట్టిపట్ల గల ప్రేమవల్ల ఆమెను చూచి స్వామి మందహాసం చేస్తాడు. ఆ క్రమంలో వక్షఃస్థలం వక్షస్థలంలోనుండి అధరాన్ని దర్శిస్తున్నారు. **"వాయ్"** అనే పదం వీరికి అభినివేశాన్ని కల్గించే మందహాసాన్ని తెల్పుతుంది. ఆమెను ముందుంచుకొని ఆశ్రయించినవారిని **"మా శుచః"** అని ఆశ్వాసాన్ని పల్కుతాడు కనుక, అధరాన్ని గూర్చి పల్కుతున్నారనికూడా చెప్పవచ్చు.

పన్ను కరతలముమ్ కణ్గళుమ్* పఙ్గయత్తిన్
పొన్నియల్ కాడు ఓర్మణివరై మేల్ పూత్తతుపోల్* 75

శ్రీచరణద్వయి, పన్ను కరతలముమ్ = కీర్తించదగిన శ్రీకరాలు, కణ్కళుమ్ = తిరునేత్రాలు, ఓర్ మణి వరై మేల్ పొన్ ఇయల్ పఙ్గయత్తిన్ కాడు పూత్తతు పోల్= ఒరు నీలమణి పర్వతంపై బంగారుమయం అయిన తామరవనం

**(అడి యిణైయుమ్)** - వక్షఃస్థలానికి, మందహాసానికి, మాటకు జితులైవాలే శ్రీచరణాలనుగూర్చి పల్కుతున్నారు.

**(పన్ను కరతలముమ్)** - శ్రీచరణాలలో పడినవారిని చేతులతో ఎత్తి ఆలింగనం చేసికొంటే "ఇదికూడా ఒక శ్రీహస్తస్పర్శమా !'' అని నిరంతరం నోరు నొప్పి పుట్టేటట్లు పలవరింపజేసే శ్రీహస్తం. **"పన్ను కరతలమ్"**- భక్తుని లేవనెత్తి ఆలింగనం చేసికొన్నందువల్ల **"తోళ్కళ్ ఆయిరమ్"** అనే రీతిలో ఒకటికి పదిరెట్లు వందరెట్లు వేయిరెట్లుగా విస్తరించే బాహువులు- అని కూడాచెప్పవచ్చు. **"సోఽప్యేనం ధ్వజవజ్రాబ్జకృతచిహ్నేబ్జపాణినా, సంస్పృశ్యాకృష్య చ ప్రీత్యా సుగాఢం పరిషస్వజే"** అనికూడా చెప్పవచ్చు.

**(కణ్గళుమ్)** - శ్రీకరస్పర్శకు అభినివేశాన్ని పొందినవారిని చల్లగా చూచే తిరునేత్రాలు. **"ఉయిర్క్కెల్లామ్ తాయా యళిక్కిన్ఱ తణ్డామరైక్కణ్"** (పెరియ తిరు- 7-1-9) అని చెప్పబడిందికదా ! శ్రీహస్తం దీర్ఘంగా సాగి స్పృశిస్తుండగా, నేత్రాలు ఉన్నచోటనే ఉంటూ స్పృశిస్తున్నవి. ఒకసారి కటాక్షిస్తే వడగళ్ళవర్షం మీదపడినట్లున్నది.

**(పఙ్గయత్తిన్ పొన్నియల్ కాడు ఓర్ మణివరైమేల్ పూత్తతు పోల్)** - బంగారు తామరల వనం నీలపర్వతంపై అంతటా పూచినట్లు తిరుమేనిలో ఉండే వక్షఃస్థలం, ముఖం, శ్రీచరణాలు, శ్రీహస్తాలు, తిరునేత్రాలు ఉన్నాయి- అని పూర్వంతో అన్వయించాలి. లేక, తిరుమేని, ఇకపై చెప్పబోయే ఆభరణశోభ రెండు పొందికగా కలసి ఉండే పరభాగశోభ అందాన్ని తెలుపుతున్నవనికూడా చెప్పవచ్చు.

**(మిన్ని యొళి పడైప్ప)** - **"మిన్ శెయ్ పూణ్ మార్బినన్"** (తిరువాయ్-4-2-10) అనే రీతిలో మెఱుపువంటి కాంతిని కల తిరువాభరణాలా! అనే రీతిలో తళతళమనే కాంతిని వెలువరించే.



మిన్ని యొళి పడైప్ప వీణాణుమ్ తోళ్వళైయుమ్*
మన్నియ కుణ్డలము మారముమ్ నీణ్ముడియుమ్* 76
తున్ను వెయిల్ విరిత్త శూళామణి యిమైప్ప*

వికసించినట్లు (వెలుగగా), మిన్ని ఒళి పడైప్ప = మెఱుపువలె కాంతిని వెదజల్లే, వీఴ్ నాణుమ్ = ఆశపడదగిన ఉదరబంధం, తోళ్ వళైయుమ్ = బాహువలయాలు, మన్నియ కుణ్డలముమ్ = యుక్తంగా ఉండే మకరకుండలాలు, ఆరముమ్ = వక్షఃస్థలంలో హారం, నీళ్ ముడియుమ్ = దీర్ఘమైన గొప్ప కిరీటం, తున్ను వెయిల్ విరిత్త శుళా మణి ఇమైప్ప = గొప్ప తేజస్సును వెలువరించే కిరీటంలో పొదిగిన

**(వీణాణుమ్)- "హిరణ్యప్రాకారామ్"** అనబడే పిరాట్టికి హిరణ్యప్రాకారం వలె ఉండే మొలనూలు. **"వీణాణ్- వీఴ్నాణ్"** భగవానుని సౌందర్యసముద్రంలో అలలు ఎగసిపడుతున్నట్లున్నది.

**(తోళ్వళైయుమ్)** - శ్రీచరణాలకు వీరకడియాలవలె, ముల్లోకాలు ఒదిగి ఉండేటట్లు నీడను ఇచ్చే బాహువులకు బాహువలయాలు ఉన్నవి. బాహు సౌందర్యాన్ని చూచి దృష్టిదోషం తగులకుండా ఉండేటట్లు ఇవి దానిని చుట్టి మఱుగు పఱుస్తున్నవి.

**(మన్నియ కుణ్డలముమ్)** - చెవులలో సహజంగానే పూచినట్లు పొందికగా ఉండే మెఱిసే మణిమయాలైన గొప్ప కుండలాలు.

**(ఆరముమ్)** - వక్షఃస్థలంలో సహజంగా మొగ్గ తొడిగినట్లుండే హారాలు. **"పెరియ తిరుమార్బిల్ పేరారమ్ పూణ్డు"** అన్నట్లు వక్షస్సులో రెండు ముళ్ళు వేసి కట్టవలసినట్లుండే గొప్ప హారాలు - అని నాయనార్ వ్యాఖ్య.

**(నీణ్ ముడియుమ్)** - తిఱునఱైయూర్ దివ్యదేశానికి ప్రభువుగా అలంకరించిన కిరీటం, ఉభయవిభూతికి అంతటికి అలంకరించిన కిరీటమైనది. **"విణ్ముదల్ నాయకన్ నీణ్ ముడి"** (తిరువిరు-50) అని కదా నమ్మాళ్వార్ల సూక్తి.

**(తున్ను వెయిల్ విరిత్త శులామణి యిమైప్ప)** - చూడామణియొక్క కాంతి అన్ని కాంతులను మించి ఉండగా- అని భావం. తున్నుకై- మించి ఉండడం-అని భావం. అందం అతిశయిస్తే దృష్టిదోషం పడుతుంది- అని మఱుగుపఱచేవారివలె.

మన్ను మరకతక్కున్ఱిన్ మరుజ్గే * - ఓర్ 77
ఇన్నిళవజ్జిక్కొడి యొన్ఱు నిన్ఱతుతాన్*

చూడామణిరత్నం ప్రకాశించగా, మన్ను మరకత క్కున్ఱిన్ మరుజ్గే = అందరికీ ఆశ్రయభూమి అయిన మరకతపర్వతం- అనే రీతిలోని భగవానుని సమీపంలో, ఓర్ ఇన్ ఇళ వజ్జి క్కొడి ఒన్ఱు నిన్ఱతు = విలక్షణమై, భోగ్యమై, లేతదిగా ఉండే

చూడా మణికాంతి మిగిలినవాని కాంతికంటే మించి, లేతఎండవలె ఒక తెర వేసినట్లున్నది.

**(మన్ను మరకతక్కున్ఱిన్)** - తనను ఆశ్రయించి లోకం అంతా స్థిరంగా ఉండే, నీలపర్వతంవంటి భగవానునియొక్క- అని భావం.

**(మరుజ్గే)** - సమీపంలోనే -అని భావం. గొప్ప మడుగు కనుక లోపలకు దిగడం సాధ్యం కాదు. సమీపంలో ఉండి సేవించవచ్చు; అంతే. ప్రేయసి ప్రియుని నేరుగా వీక్షించలేదు కనుక; చూడకపోతే నిలువలేదు కనుక, లక్ష్మీదేవి కడగంటి చూపులతో చూచేటట్లుగా దగ్గరలో నిలుచున్నది- అనికూడా చెప్పవచ్చు.

**(మరుజ్గే)** - గొప్ప ప్రవాహాన్ని దగ్గరలో చూస్తే, దానిలోనికి దిగడానికి వీలు కాదు. భోగ్యత అతిశయించి ఉన్నందువల్ల తొలగడమూ సాధ్యం కాదు. అందువల్ల దానికి సమీపంలోనే ఉండాలి. అదే రీతిలో లక్ష్మీదేవికూడా. **"అకలకిల్లేన్ ఇఱైయుమ్"** అని దగ్గరలోనే ఉంటున్నది. **"కిణ్ణకప్పెరుక్కై ఎదిర్ శెఱికక వొణ్ణాతాప్పోలే ఎదిర్నిఱ్క వొణ్ణామే కరైయరుకే పఱ్ఱియాయిఱ్ఱిరుప్పతు"** అని నాయనార్ వ్యాఖ్య.

**(ఓర్ ఇన్నిళ వజ్జిక్కొడి యొన్ఱు నిన్ఱతుతాన్)** - సాటి లేనిదై, భోగ్యమైనదై లేతగా ఉండే ఒక ప్రబ్బలి తీగవలె ఉన్నది. తీగ అని ఈమెను పల్కడం ఏవిధంగా ? అంటే, అని మిగిలిన కన్యలంతా మగవేషాన్ని ఆరోపించుకొన్నారు - అనేటట్లుగా ఈమె స్త్రీత్వంయొక్క పరమావధిని కల్గి ఉన్నది- అనే అభిప్రాయంతో. **"సాక్షాన్మన్మథ మన్మథః"** (భాగవతమ్-10-32-2) అని కీర్తింపబడే అతని (భగవానుని) వలె **'నారీణా ముత్తమ"** (స్త్రీలలో శ్రేష్ఠురాలు) అనే రీతిలో చెప్పదగినవారు వేఱొకరు లేనందువల్ల, రూపకాలంకారాన్ని ప్రయోగించి **"వజ్జిక్కొడి"** అని అంటూ ఈమెను తీగగానే పల్కుతున్నారు. ఉపమేయాన్ని కప్పి పుచ్చి, ఉపమానవస్తువుగానే



అన్నమాయ్ మానాయ్ అణిమయిలాయ్ అజ్గిడైయే* 78
మిన్నాయ్ ఇళవే యిరణ్డాయ్ ఇణైచ్చెప్పాయ్*

ఒక ప్రబ్బలి తీగ అనే రీతిలో పిరాట్టి నిలచి ఉన్నది, అన్నమ్ ఆయ్ = నడకలో హంసగా, మాన్ ఆయ్ = చూపులో లేడిగా, అణి మయిల్ ఆయ్ = కురులలో అందమైన నెమలిగాను, ఇడై మిన్ ఆయ్ = నడుము అందంలో మెఱుపుగా, ఇళ ఇరణ్డు వేయ్ ఆయ్ = (బాహువులలో) లేతవి అయిన రెండు వెదుళ్ళుగాను, ఇణై శెప్పు ఆయ్ = (స్తనాలలో) రెండు కలశాలుగాను, మున్ ఆయ తొణ్డై ఆయ్ =

ఈమెను నిర్దేశించేటట్లున్నది. (సంస్కృతంలో దీనికి రూపకాతిశయోక్తి అని పేరు) **"ఇన్నిళ వజ్జిక్కొడి"** అని సముదాయశోభను పల్కి, ఇక, అవయవశోభను పూర్ణోపమద్వారా పల్కుతున్నారు.

**(అన్నమాయ్)** - దీనిచే నడకహొయలు చెప్పబడింది.

**(మానాయ్)** - దీనిచే చూపుల అందం చెప్పబడింది.

**(అణిమయిలాయ్)** - దీనిచే కేశాల అందం చెప్పబడింది.

**(ఇడైయే మిన్నాయ్)** - మేఘంమధ్యలో మెఱుపువలె, కేశపాశం మధ్యలో నడుము అందం ఉన్నది.

**(అజ్గు)** - పైన, కింద అవయవాలు ఉన్నందున, మధ్యలో నడుము ఒకటి ఉన్నది -అని అనుమానప్రమాణంద్వారా తెలియాలి తప్ప ప్రత్యక్షంగా చూడలేని సందేహస్థానం నడుము.

**(ఇళవే యిరణ్డాయ్)** - లేత వెదుళ్ళు రెండై- అని భావం. గుండ్రంగా, పొడుగుగా ఉండి, పచ్చని, నేరుగా ఉండే బాహువుల అందం ఈ ఉపమానంచే చెప్పబడింది.

**(ఇణై చ్చెప్పాయ్)** - ఒకదానికి ఇంకొకటి మాత్రమే సాటియై, బంగారు కలశాలవలె ఉండే స్తనాల అందం. ఇవి నాయకరత్నాన్ని కాపాడే భరిణవలె ఉన్నవి. **"మలరాళ్ తనత్తుళ్ళాన్"** (మున్ఱామ్‌తిరు-3), **"శజ్గు తజ్గు మున్నై నజ్గై కొజ్గై తజ్గలుఱ్ఱవన్"** (తిరుచ్చంద-57), **"శ్రీస్తనాభరణమ్"** (శ్రీరంగపూర్వ-) అని చెప్పబడుతున్నదికదా!

మున్నాయ తొణ్డైయాయ్ క్కెణ్డైక్కుల మిరణ్డాయ్* 79
అన్న తిరువురువమ్ నిన్దతు అఱియాతే*
ఎన్నుడైయ నెఞ్జు మఱివు మినవళైయుమ్* 80

(అందంలో) ముందుగా నిలచి ఉండే (అధరంలో) బింబఫలంగాను, కులమ్ కెణ్డై ఇరణ్డాయ్ = (కన్నులలో) గొప్పవి అయిన రెండు బేడిసచేపలై, అన్న = అటువంటి, తిరు ఉరువమ్ = శ్రీదేవియొక్క రూపం, నిన్దతు అఱియాతే = (పక్కన) ఉన్న రీతిని తెలియకుండా, ఎన్నుడైయ నెఞ్జమ్ = నా మనస్సు, అఱివుమ్ = (ఆ మనస్సులో ఉండే) జ్ఞానం, ఇనమ్ వళైయుమ్ = గొప్ప చేతిగాజులు, పొన్

**(మున్నాయ తొణ్డైయాయ్)** - అవయవాల సౌందర్యస్పర్ధలో అగ్రగామి అయిన ఎఱ్ఱని పెదవుల అందం. **"మున్నోడి వరుకిఱ తిరువదరత్తిన్ పుక రాయిఱ్ఱు. 'వాలియతోర్ కనికొల్' ఇత్యాది"** అని నాయనార్ వ్యాఖ్య.

**(కెణ్డైక్కుల మిరణ్డాయ్)** - అందంలోను, తిమ్మిరిలోను, పొడుగులోను, రూపంలోను రెండు బేడిస చేపలవలె ఉండే నేత్రాల అందం.

**(అన్న తిరువురువమ్)** - అటువంటి లక్ష్మీదేవియొక్క తిరుమేని. అటువంటిది **("అన్న")** అని అనాలి తప్ప ఈ అందాన్ని వర్ణించే వాక్కులు లేవు. కొన్నిటిని చెప్పడం తప్ప మొత్తం పల్కి ముగించడం సాధ్యం కాదు.

**(తిరువురువమ్ నిన్దతఱియాతే)** - పరిచ్ఛేదించలేని ఆ రూపం దగ్గర ఉండడం తెలియక -అని భావం. **"ఇన్నిళవఞ్జిక్కొడి"** అని పల్కినపుడు **"అఱియాతే"** అని అనడం తగునా? అని అంటే, గొప్ప గొప్ప ఉపమానాలను ఏవో కొన్నిటిని పల్కి, మొత్తం పల్కడానికి సాధ్యం కానందువల్ల ఈ విధంగా అంటున్నారు. ఇద్దఱిని విడదీసి ప్రత్యేక ప్రత్యేకంగా పల్కితే ఒకవిధంగా పలుకవచ్చు. కాని, కలసి ఉన్నపుడు వర్ణించడం సాధ్యమే కాదు. నేత్రాలకు, మనస్సుకు కొలువడానికి సాధ్యం కాని విషయం అయినందువల్ల, చూచినవారిని **"కాలాఴుమ్ నెఞ్జఴియుమ్ కణ్శుఴలుమ్"** (పెరియ తిరువన్దాది- 34) అనే రీతిలో ఆనందసముద్రంలో ముంచి వేసే, జ్ఞానాన్ని అంతటిని పోగొట్టే విషయం అయినందువల్ల, **"అఱియాతే"** అని అంటున్నారనికూడా చెప్పవచ్చు. భగవానుని అన్వేషించి వచ్చేటపుడు, ఈ లక్ష్మీదేవికూడా దగ్గరలో ఉంటుంది అనేదానిని తెలియక వచ్చాను. తెలిసి ఉంటే ఈ సౌందర్యసముద్రంలో చిక్కుకోకుండా దూరంగా తొలగి ఉండి తప్పుకొని ఉండవచ్చు- అనే భావంకూడా కావచ్చు.



పొన్నియలుమ్ మేకలైయుమ్ ఆఙ్గొఴియపోన్దేఱ్కు*
మన్ను మఱికడలు మార్క్కుమ్* - మతి యుకుత్త 81

ఇయలుమ్ మేకలైయుమ్ = బంగారుమయం అయిన ఒడ్డాణం, ఆఙ్గు ఒఴియ పోన్దేఱ్కు=అక్కడే అన్నీ విడచిపోయిన నాకు, (దీనికి మించి దుఃఖం కలిగేటట్లుగా), మన్ను మఱి కడలుమ్ ఆర్క్కుమ్ = ఏమాత్రం చలించని కడలి ఘోష చేస్తున్నది, మతి ఉకుత్త ఇన్ నిలా ఇన్ కతిరుమ్ = చంద్రుడు వ్యక్తం చేస్తున్న భోగ్యమైన

**(ఎన్నుడైయ నెఞ్జుమ్)** - దేనికీ నశించని నా మనస్సుకూడా నశించింది.

**(నెఞ్జుమ్ అఱివుమ్)** - జ్ఞానాన్ని భద్రపఱచే భరిణవంటిది మనస్సు. భరిణతో పాటుగా ధనాన్నికూడా కోల్పోయాను.

**(ఇన వళైయుమ్)** - ఆభరణం అయిన గాజులను.

**(పొన్నియలుమ్ మేకలైయుమ్)** - గొప్ప ఒడ్డాణం.

**(ఆఙ్గొఴియ పోన్దేఱ్కు)** - ఏమీ లేనిదానను అయ్యాను.

**(నెఞ్జుమ్ అఱివుమ్ ఒఴియ)** - నేత్రాలను కోల్పోయాను,

**(ఇన వళైయుమ్ మేకలైయుమ్ ఒఴియ)** - ధనాన్ని కోల్పోయాను. "ఇక్కడ జీవించవచ్చు" అని పోయిన చోటులో అంతకుముందు ఉన్న సొత్తును కూడా కోల్పోయినవారివలె, అంతటినీ కోల్పోయి, సముద్రంలోని గడ్డిపఱకవలె స్వామి అందం అనే అలలచేత అటు ఇటు కొట్టబడి, మడల్‌ను ఎక్కాలని బయలు దేరి.

**(మన్నుమ్ మఱి కడలుమ్ ఆర్క్కుమ్)** - ఇంతకుముందు అంతా ఏమాత్రం చలించకుండా ఉండే సముద్రం ఇపుడు హోరుహోరుమని శబ్దిస్తున్నది.

**(ఆఙ్గొఴియ పోన్దేఱ్కు మన్నుమ్ మఱికడలుమ్ ఆర్క్కుమ్)** - బాధపడే వారిని చూస్తే "అయ్యో!" అని అనవలసి ఉండగా, ఆ విధంగా చేయకుండా, సర్వేశ్వరుడు ఈ లోకానికి కావలిగా సృష్టించిన సముద్రం రాజద్రోహులను చూచినట్లుగా పెద్ద శబ్దం చేస్తూ పిలుస్తున్నది.

**(మది యుకుత్త ఇన్నిలా ఇన్ కతిరుమ్ ఎన్దనక్కే వెయ్‌తాకుమ్)** - చంద్రుడు వెలువరించిన భోగ్యమైన వెన్నెలయొక్క లేతవెలుగుకూడా నాకు వేడిగా ఉన్నది.

ఇన్నిలా ఇన్‌కతిరుమ్ ఎన్తనక్కే వెయ్‌తాకుమ్*
తన్నుడైయ తన్మై తవిరత్తానెన్‌కొలో* 82
తెన్నన్ పొదియిల్ శెఴుఙ్జన్దిన్ తాతళైన్దు*

---

వెన్నెలయొక్క మధురమైన కాంతి, ఎన్ తనక్కే = నాకుమాత్రం, వెయ్‌తు ఆకుమ్= బాగా వేడిమిని కల్గినది అవుతున్నది. తన్నుడైయ తన్మై తవిర తాన్ ఎన్గొలో = వెన్నెలయొక్క స్వభావం అయిన చల్లదనం పోయి ఈ విధంగా వేడిగా ఉండేటట్లు ఎవరైనా ఏమైనా అయినా చేశారా?, తెన్నన్ పొదియిల్ = దక్షిణ దిక్కుకు అధిపతి అయిన పాండ్యరాజుకు చెందిన మలయపర్వతంపై ఉండే, శెఴు శన్దిన్ తాతు

---

**(ఇన్నిలా ఇన్ కదిరుమ్ ఎన్తనక్కే వెయ్‌తాకుమ్)** - లోకంలోనివారికి అందటికి భోగ్యమై ఉన్నది నాకు మాత్రం చాలా వేడిగా ఉన్నది. **"మది"** అనే పదం చంద్రుని, **"నిలా"** అనే పదం కిరణాలను చెప్పేటపుడు, **"కదిర్"** అనే పదం దేనిని తెల్పుతుంది? అని అంటే **'నిలా"** అనే కిరణం తేజోద్రవ్యం కనుక. దానిగుణం అయిన కాంతిని తెల్పుతుంది. **"ఇన్నిలా"** అనే పాఠాన్ని గ్రహించి **"ఇన్ద నిలా వెన్దు ప్రత్యక్షమాకవుమామ్"** అని వ్యాఖ్యానించారు నాయనార్ (ఈ పాఠాంతరం ద్రావిడ వర్ణమాలలో ఉండే రెండు విధాలైన నకారాలనుబట్టి ఏర్పడింది).

**(తన్నుడైయ తన్మై తవిరత్తాన్ ఎన్‌కొలో !)** - **"శీతో భవ హనూమతః"** (రామా.సుంద-53-29) (ఓ అగ్నీ! నీవు హనుమానునకు చల్లగా కావాలి) అని అంటూ పిరాట్టి వేడిగా ఉండే అగ్నిని చల్లగా ఉండేటట్లు సంకల్పించినట్లే, చల్లని చంద్రుడు నాకు వేడిగా ఉండేటట్లు సంకల్పించినవారెవరైనా ఉన్నారా! చంద్రుని మాత్రమే ఈ పదం తెలుపుతున్నదని కాకుండా, పూర్వం చెప్పబడ్డ సముద్రాన్ని, తరువాత చెప్పబోయే మలయమారుతం మొదలైనవానిని తెలుపుతున్నదని గ్రహించి, "ఆ యా పదార్థాల స్వభావాలు మాఱేటట్లుగా సంకల్పించినవారున్నారా! ఏమి!" అనికూడా చెప్పవచ్చు.

**(తెన్నన్ పొదియిల్ శెఴుమ్ శన్దిన్ తాతళైన్దు మన్నివ్వులకై మనజ్కళిప్ప వన్దియజ్గుమ్ ఇన్నిళమమ్ పూన్దెన్దలుమ్ వీశు మెరి యెనక్కే)** - పాండ్యప్రభువుకు చెందిన మలయపర్వతంలో పెరిగే అందమైన చందనవృక్షాల ధాతువులను కలుపుకొని ప్రవహించి వచ్చి, ప్రవాహరూపంతో నిత్యమైన ఈలోకంయొక్క మనస్సు ఆనందించేటట్లు వీచే భోగ్యమైన, లేత, సుగంధపూరితమైన మలయ మారుతంకూడా నాకు ఒక్కదానికే నిప్పువలె (అగ్నిగా) వీస్తున్నది)



మన్నివ్వులగై మనజ్గళిప్ప వన్దియజ్గుమ్* 83
ఇన్నిళమ్ పూన్దెన్దలుమ్ వీశు మెరి యెనక్కే*
మున్నియ పెణ్ణైమేల్ ముళ్ ముళరి క్కూట్టకత్తు* 84
పిన్ను మవ్వన్రిల్ పెడైవాయ్ చ్చిఱుకురలుమ్*

---

అళైన్దు = అందమైన చందన వృక్షాల పూలలోని పుప్పొడిని పూసికొని, మన్ ఇ ఉలకై మనమ్ కళిప్ప వన్దు ఇయజ్గుమ్ = నిత్యమైన ఈలోకంలో ఉండేవారి మనస్సు ఆనందించేటట్లు వచ్చి విహరించే, ఇన్ ఇళ పూ తెన్దలుమ్ = భోగ్యమైన, లేతదైన, పరిమళం మెండుగా కల మలయమారుతం, ఎనక్కే ఎరి వీశుమ్ = నాకు మాత్రం నిప్పును వీస్తున్నది, మున్నియ పొణ్ణై మేల్ = ముందు కన్పించే తాటి చెట్టుపై గల, ముళ్ ముళరి కూడు అకత్తు = ముళ్ళను కల తామరతూడులచే చేయబడ్డ గూడులో, పిన్నుమ్ అ అన్రిల్ పెడై వాయ్ శిఱు కురలుమ్ =గొంతుస్వరం

---

**(మన్నివ్వులకమ్)** - ప్రవాహరూపేణ నిత్యంగా ఉండే ఈలోకం. **"ప్రవాహ రూపేణ నిత్యమాన ఇన్ద లోకమానతు"** అని నాయనార్ వ్యాఖ్య. **"మన్ని యివ్వులకమ్"** అనే రూపం మధ్యలోని ఇకారం లోపించిందని భావించి, **"లోకత్తై వాఴ్విక్కై నిత్యమానాప్పోలే ఎనక్కొరుత్తిక్కు చ్చుడుమై నిత్యమాయిఱ్ఱు"** అని పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానించారు. **"మన్ని ఇయజ్గుమ్"** అని అన్వయం.

**(వీశుమ్ ఎరి)** - నా విరహాగ్ని తనపై పడకుండా ఉండేటట్లు దూరంగా నిలచి నాపై నిప్పును వీస్తున్నది.

**(ఎనక్కే)** - నాకు ఒక్కతెకే ఈవిధంగా అవుతున్నది.

**(మున్నియ పెణ్ణైమేల్)** - ముందు ఉండే తాటిచెట్టుపై.

**(ముళ్ ముళరిక్కూట్టకత్తు)** - ముళ్ళను కల్గిన తామరతూడులతో చేయబడ్డ గూడులో- అని భావం. ముళ్ళగూడులో ఉన్నందువల్ల ఇతరులను బాధించే ఆ కంటకాల స్వభావం వీటికికూడా వచ్చినది కాబోలు ! అని భావం.

**(పిన్నుమ్)** - ఇంతవరకు చెప్పిన దానికంటే -అని భావం. మగక్రౌంచపక్షి, పెంటిపక్షి ఒకదానితో ఇంకొకటి గొంతు కలిపి ఒకటిగా కూయడాన్ని తెలుపుతున్నదని కూడా చెప్పవచ్చు. వాటి సంగమసుఖం ఈమె విరహబాధను వృద్ధి చేస్తున్నది.

ఎన్నుడైయ నెఞ్జుక్కు ఓరీర్వాళామ్ ఎన్ శెయ్‌కేన్* 85

కన్నవిల్‌తోళ్ కామన్ కరుప్పు చ్చిలై వళైయ*
క్కొన్నవిలుమ్ పూఙ్గణైకళ్ కోత్తు ప్పొద వణైన్దు* 86

కలిపి కూస్తున్న ఆ క్రౌంచపక్షుల నోటినుండి వెలువడే చిఱు సవ్వడి, ఎన్నుడైయ నెఞ్జుక్కు ఓర్ ఈర్ వాళ్ ఆమ్ = నా మనస్సును చీలుస్తున్న సాటి లేని ఖడ్గంగా ఉన్నది, ఎన్ శెయ్‌కేన్ = (దీనికి తప్పి బతకడానికి) ఏమి ఉపాయాన్ని చేయను ? కల్ నవిల్ తోళ్ కామన్ = పర్వతంవలె (దృఢమైన)బాహువులను కలవాడైన మన్మథుడు, కరుప్పు చ్చిలై వళైయ = తన చెఱకు వింటిని వంచి, కొల్ నవిలుమ్ పూ కణైకళ్ కోత్తు = (ఆవింటిలో) వధించగల పుష్పబాణాలను సంధించి, పొద

**(అవ్వన్దిల్ పెడైవాయ్ చ్చిఱుకురలుమ్)** - సంగమసుఖంవల్ల ఆనందం వృద్ధి కాగా, వెలువడే చిఱుకంఠధ్వని.

**(ఎన్నుడైయ)** - ఇప్పటికే మృతప్రాయ అయిన నాయొక్క.

**(నెఞ్జుక్కు ఓర్-ఈర్ వాళామ్)** - పూర్వం చెప్పినవి అన్నీ నా శరీరాని వాడ్చి వధించాయి. ఇది అంతటితో ఆగకుండా మనస్సునే ఱంపంతో కోస్తున్నట్లు కోస్తున్నది. **“పేచ్చుక్కు మున్నే ఎన్నుడైయ నెఞ్జుక్కు ఓర్ ఈర్వాళ్ ఆకానిన్దతు”** అని నాయనార్ వ్యాఖ్య.

**(ఎన్ శెయ్‌కేన్)** - అబల అయిన నేను ఏమి చేయను? నేను బ్రతికి బట్టకట్టే దారి లేదు. **“ఓర్ అబలై ఇతుక్కు పరిహారమ్ పణ్ణిక్కొళ్ళవో!”** అని నాయనార్ వ్యాఖ్య.

**(కల్ నవిల్ తోళ్ కామన్)** - స్త్రీలను బాధించగా బాధించగా రాయివలె కాఠిన్యాన్ని పొందిన బాహువులను కల మన్మథునియొక్క. రాయివలె కఠినమైనవి అని చెప్పబడుతున్న బాహువులను మన్మథునియొక్క,

**(కరుప్పు చ్చిలై వళైయ)** - చెఱకుతో చేయబడినా, క్రూరతలో లోటు లేదు. కంటికి ఆశ్చర్యమై ఉన్నా బాధకత్వంలో దార్ఢ్యాన్ని కల్గి ఉన్నది.

**(కొల్ నవిలుమ్ పూఙ్కణైకళ్ కోత్తు)** - పూలబాణాలు అయినా వధించడంలో తప్పవు. వీటికి గురి అయినవారు ముగిసిపోయారు అని అనబడే పూలబాణాలను సంధించి.



తన్నుడైయ తోళ్ కళ్షియ వాఙ్గి* - తమియేన్ మేల్
ఎన్నుడైయ నెఞ్జే యిలక్కాక ఎయ్‌కిన్డాన్* 87

పిన్నితనై క్కాప్పీర్ తాన్ ఇల్లైయే* - పేదైయేన్

అణైన్దు = బాణాలు చొచ్చుకొని పోయేటట్లుగా దగ్గరలో నిలచి, తన్నుడైయ తోళ్ కళ్షియ వాఙ్గి = తన బాహువుల చివరి వరకు లాగి, ఎన్నుడైయ నెఞ్జే ఇలక్కు ఆక తమియేన్ మేల్ ఎయ్‌కిన్డాన్ = నా మనస్సునే గుఱిగా చేసికొని నిస్సహాయను అయిన నాపై ఆ బాణాలను ప్రయోగిస్తున్నాడు, పిన్ ఇతనై కాప్పీర్‌తాన్ ఇల్లైయే= ఇపుడీ ఆపదలో నిలచి నిన్ను తప్పించి రక్షించగల సమర్థులు లేరా!, పేదైయేన్ =

**(పొద అణైన్దు)**- ఒకవైపు బాణం వేస్తే గుఱి తప్పకుండా తొలుస్తూ మఱి ఒకవైపు బయటకు వచ్చేటట్లు దగ్గరలోనే నిలచి.

**(తన్నుడైయ తోళ్ కళ్షియ వాఙ్గి)** - బాణాలను ప్రయోగించేటపుడు వక్షస్థలం బాగా విస్తరించినందువల్ల ఇతని బాహువులు బాగా చాచబడుతున్నవి. లేక, అల్లెతాడును బాహువులవరకు లాగడం ఈ ప్రయోగంద్వారా తెలుప బడుతున్నది.

**(తమియేన్‌మేల్)** - ఒంటరిగా ఉన్న నాపై- అని భావం. ఇతని బాణాలకు లక్ష్యం అయిన మూలబలబలం ఉన్న తీరును చూడండి. ఒక అబలను బాధించే వీరుడు సుమండీ ఇతడు !

**(ఎన్నుడైయ నెఞ్జే యిలక్కాక)** - అద్వితీయవీరుడైన రామునికూడ ఇతడు మించి ఉన్నాడుసుమా! అతడు రూపాలను కల్గినవానినే గుఱి తప్పకుండా కొట్టాడు. ఇతడు రూపరహితమైన నా మనస్సునుసైతం గురి తప్పకుండా కొట్టాడు.

**(ఎయ్‌కిన్డాన్)**- ఈ వర్తమానకాలికప్రయోగంవల్ల ఇంకా ఇప్పటికీ మన్మథుడు బాణాలను ప్రయోగిస్తూనే ఉన్నాడు- అని స్ఫురిస్తుంది. **“శరవర్షం వవర్ష”** (రామా-యుద్ధ- 94-18) (శరవర్షాన్ని కురిసాడు) అనే రీతిలో శ్రీరాముడు మూలబలాన్ని చూడగానే తన వీర్యాన్ని ప్రదర్శించినట్లే,ఇతడు ఒంటరిని అయిన నా మనస్సు అనే మూలబలాన్ని పొందగానే వీర్యాన్ని ప్రదర్శించాడు- అని భావం.

**(ఎన్నుడైయ నెఞ్జే)** - తనయొక్క మనస్సులోకూడా ఈ బాణాలలో ఒకటి తగిలి ఉంటే ఈ బాధ తెలుస్తుంది- ఆ మహాపాపిష్ఠివానికి. అది జరుగనందువల్ల ఈ క్రూరకృత్యానికి ఒడిగడుతున్నాడు.

కన్నవిలుమ్ కాట్టకత్తోర్ వల్లిక్కడిమలరిన్* 88

నన్నఱువాశ మత్తారాను మెయ్‌తామే*

---

చపలను, కల్ నవిలుమ్ కాడు అకత్తు = రాళ్ళతో నిండిన అరణ్యం లోపల, ఓర్ వల్లి = ఒక తీగలో పూచిన, కడి మలరిన్ = తేనె నిండిన పూలయొక్క, నల్

---

**(పిన్నితనై క్కాప్పీర్‌తాన్ ఇల్లైయే) - "జగత్ సశైలం పరివర్తయామ్యహమ్"** (రామా-ఆర-64-78) (పర్వతాలతో కూడిన లోకాన్ని నశింపజేస్తాను) **"లక్ష్మణస్య చ ధీమతః"** (రామా-సుంద-16-4) (బుద్ధిమంతుడై లక్ష్మణునియొక్క) అనే రీతిలో ధీమంతుడైన లక్ష్మణుడు సద్వార్తను పల్కి వింటిని తీసికొన్నట్లు, ఈ మన్మథుని చేతినుండి వింటిని తీసికొనేవారెవరూ లేరే! అని ఆక్రోశిస్తున్నది (పరకాలనాయకి). పురుషకారకృత్యాన్ని చేసి కాపాడేవారెవరూ లేరే- అని అంటున్నది. **"నాట్టుక్కు త్తణ్ణళిప్పణ్ణి నోక్కవల్లైయో ఉజ్గళ్ తమప్పనార్ ఉమ్మై ప్పెఱ్ఱతు! నీర్ నాట్టై యళిక్కక్కడవీరో! ఎన్ను ఇళైయప్పెరుమాళ్ కాలై క్కట్టినాప్పోలే, ఇవళుమ్, 'ఇక్కామనై క్కాలైక్కట్టి నోక్కవల్లారిల్లైయో! ఎన్గిఱాళ్"**- అని రస్యమైన నాయనార్‌వ్యాఖ్య.

**(పేదైయేన్)** - ఈ ఆపదను పొందడం కోసమే పుట్టిన అబలను. చనిపోయి బయటపడలేక, "చూడవచ్చునేమో!" అనే చాపల్యాన్ని కల నేను.

**(కల్ నవిలుమ్ కాట్టకత్తు)** - రాళ్ళు దట్టంగా నిండిన అరణ్యంలోపల -అని భావం. స్వాపదేశంలో - **"పెరుమ్ తూఱాయ్"** (తిరువాయ్-10-10-8) (పెద్ద ముళ్ళపొద) అని చెప్పబడే సంసారమనే దుఃఖం నిండిన అరణ్యంలో- అని అర్థం.

**(ఓర్ వల్లి)** - ఆ అరణ్యంలో సాటి లేని ఒక తీగ. స్వాపదేశంలో - జీవుడని అర్థం.

**(కడిమలరిన్)** - ఆ తీగలో ఒక తేనె నిండుగా ఉండే పూవు. స్వాపదేశంలో- జీవుని భోగ్యమైన జ్ఞానం - అని అర్థం.

**(నన్నఱు వాశమ్)** - ఆ పూవులో చాలా గొప్ప పరిమళం. స్వాపదేశంలో- ఆ జ్ఞానంవల్ల కలిగే భక్తి మొదలైనవి - అని అర్థం.

**(మఱ్ఱారానుమ్ ఎయ్‌తామే)** - తనకోసం కాకుండా ఇతరులకోసమే



మన్నుమ్ వఱునిలత్తు వాళాజ్గు కుత్తతుపోల్* 89

ఎన్నుడైయ పెణ్మైయు మెన్నలను మెన్ ములైయుమ్*

మన్ను మలర్‌మజ్గైమైన్దన్* - కణపురత్తు 90

---

నఱు వాశమ్ = మంచి పరిమళం, మఱ్ఱు ఆరానుమ్ ఎయ్‌తామే = ఎవరికీ ఉపయోగపడకుండా, మన్నుమ్ వఱు నిలత్తు ఆజ్గు వాళా ఉకుత్తతు పోల్ = ఆ రిక్తభూతలంపైననే వ్యర్థంగా గడపేటట్లు, పేతైయేన్ ఎన్నుడైయ పెణ్మై = జ్ఞానశూన్యమైన నా స్త్రీత్వం, ఎన్ నలనుమ్ = నా గుణాలు, ఎన్ ములైయుమ్ = నా స్తనాలు, మలర్ మజ్గై మన్నుమ్ మైన్దన్ = పూవులో నివసించే లక్ష్మీదేవిని స్థిరంగా చేరిన పరమపురుషుడు, కణ పురత్తు పొన్ మలైపోల్ నిన్దవన్‌తన్ =

---

ఏర్పడిన ఈ సువాసనను దానికి తగినవారు పొందకుండా. భక్తి మొదలైనవానికి సర్వేశ్వరుని విషయంగా (లక్ష్యంగా) పొందకుండా - అని స్వాపదేశార్థం.

**(వఱు నిలత్తు వాళాజ్గుకుత్తతుపోల్)** - వట్టి నేలపై వ్యర్థంగా పడి ఉండేటట్లు, పరమపురుషునకు గుతికాతగిన భక్తిని మొదలైనవానిని క్షుద్రులకు గుతి చేసి వ్యర్థం చేసేటట్లే -అని స్వాపదేశార్థం.

**(ఎనుడైయ పెణ్మైయుమ్ ఎన్ నలనుమ్ ఎన్ ములైయుమ్)** - స్వాపదేశంలో పెణ్మై- జీవస్వరూపమైన భగవానునిపట్ల పారతంత్ర్యం, నలమ్-విశేషణమైన ఆత్మగుణాలు, ములై- భోగ్యమైన భక్తి.

**(మన్నుమ్ మలర్‌మజ్గై మైన్దన్) - "మలర్‌మజ్గై మన్నుమ్ మైన్దన్"** -అని అన్వయం. తామరపూవులో వేంచేసి ఉండే లక్ష్మీదేవి నిత్యవాసం చేసే నిత్య యువకుడు.

**(మైన్దన్) - "యువాఽ కుమారః"** (ఋగ్వేదం -విష్ణుసూక్తం) (నిత్యయౌవనాన్ని కలవాడుగా, కొంచెం కౌమారావస్థను కలవాడుగా ఉండేవాడు), **'యువా సువాసాః"** (యజుర్వేదమ్) అనే రీతిలో లక్ష్మీదేవి నిత్యవాసం చేస్తున్నందువల్ల ఎల్లప్పుడు యువకుడై ఉండేవాడు.

**(కణపురత్తు ప్పొన్‌మలైపోల్ నిన్దవన్)** - తిరుక్కణ్ణపురంలో గొప్ప పర్వతం వలె శ్లాఘ్యమైన రూపంతో స్థిరంగా ఉండేవాడు.

ప్పొన్మలైపోల్ నిన్ఱవన్ఱన్ పొన్నకలమ్ తోయావేల్*
ఎన్నివైతాన్ వాళా ఎనక్కే పొఱైయాకి* 91

---

తిరుక్కణ్ణపురంలో బంగారుపర్వతంవలె నిలచి ఉన్నవాడైన భగవానునియొక్క పొన్ అకలమ్ తోయా ఏల్ = అందమైన వక్షఃస్థలంలో చేరలేదా!, వాళా ఇవైతాన్

---

**(కణపురత్తు)** - మేరుపర్వతంవలె ఎవరికైనా దరి చేరడానికి సాధ్యం కాని పర్వతం కాదు ఇతడు. అందఱి కళ్ళకు లక్ష్యమై నిలిచి ఉండే పర్వతం.

**(పొన్ అకలమ్)** - జలమాధుర్యంచేత, తాగిన కొద్దీ ఇంకా ఇంకా "తణ్ణీర్! తణ్ణీర్" అని అనేటట్లే, వక్షఃస్థలంలో నిత్యవాసం చేసే లక్ష్మీదేవి దీనినే నిత్యం భావించే రీతిలోని గొప్పతనాన్ని కల వక్షస్సును.

**(తోయావేల్)** - చేరలేదే! "ఏల్" అనే పదం వక్షస్సును ఆలింగనం చేసికోలేనందువల్ల ఏర్పడిన బాధను తెల్పుతుంది. లేక, "చేరకపోతే నాకేమి ఫలం?" అని తరువాత భాగంతో అన్వయించి అర్థం చెప్పవచ్చు.

**(తోయావేల్)** - **"మరతకమణిత్తడమ్", "వాశత్తడమ్", "శీతమివ హ్రదమ్"** అని భగవానుడు గొప్ప సరస్సుగా చెప్పబడేవాడు కనుక, విరహతాపం తీరేటట్లుగా, అతని వక్షఃస్థలం అనే చల్లని మడుగులో అవగాహించలేదే- అని పరకాలనాయకి అంటున్నది. **"మెల్లియల్ తోళ్ తోయ్న్దాయ్"** (తిరునెడు-13) అనే రీతిలో అతడు కూడా విరహం అతిశయించినపుడు ఈమె బాహువులనబడే తటాకంలోకదా అవగాహిస్తాడు. **"పొన్నకల మాకైయాలే ఇవళ్విరహాగ్ని పట్టు నీరాయురుకుమ్. అప్పోతు తోయలామ్ - ఎన్ఱిరుక్కిఱాళ్. ఇవళుమ్ హిరణ్యవర్ణైయిఱే"** అని నాయనార్ వ్యాఖ్య. **"హిరణ్యవర్ణామ్"** అని శ్రీసూక్తసూక్తిని, **"స్త్రీనామ్నీ లక్ష్మీః"** అని విష్ణుపురాణశ్లోకాన్ని అనుసరించి పరకాలనాయకిని పిరాట్టిగానే తలచి పల్కిన సూక్తి ఇది.

**(ఎన్నివైతాన్ వాళా)**- సీతాదేవిని విశ్లేషించగానే శ్రీరాముడు **"పశ్య లక్ష్మణ ! పుష్పాణి నిష్ఫలాని భవంతి మే"** (రామా.కి-1-44) (లక్ష్మణా ! పూవులన్నీ నాకు నిష్ప్రయోజనం అవతున్నవి. చూచావా !) అని అతడు అనుభవించని పూవులు తనకు నిష్ఫలాలు అని పల్కిన రీతిలో, అతడు అనుభవించని నా స్త్రీత్వంతో నా గుణాలతో, నా స్తనాలతో నాకేమి ప్రయోజనం? అని పరకాల నాయకి అంటున్నది.



మున్నిరున్దు మూక్కిన్ఱు మూవామై క్కాప్పతోర్*

---

ఎన్=వ్యర్థంగా ఈ వస్తువులన్నీ ఎందుకు? ఇవై =ఈ స్తనాలు, ఎనక్కే పొఱైయాకి= నా ఒక్కతెకే వ్యర్థభారమై, మున్ ఇరున్దు = కట్టెదుటనే ఉంటూ, మూక్కిన్ఱు = ఇంకా ఇంకా ముసలితనాన్ని పొందుతున్నవి, మూవామై కాప్పతు ఓర్=ఆ విధంగా

---

**(ఎనక్కే పొఱైయాకి)** - అతడు ధరించి ఆనందించడంకోసం నేను భరించవలసిన ఈ స్తనాలు. అతడు మోయనపుడు నా ఒక్కతెచేత మాత్రమే భరించడం సాధ్యమా! అని భావం. **"కొళ్ళుమ్ పయన్ ఒన్ఱిల్లాత కొఙ్గైతన్నై క్కిళ్జ్గోడుమ్ అళ్ళి పఱిత్తిట్టు అవన్ మార్బిల్ ఎఱిన్దు ఎన్ అళ్లలై తీర్వేనే"** (నాచ్చి.తిరు.13-8) అని అన్నదికదా గోదాదేవికూడా

**(మున్నిరున్దు మూక్కిన్ఱు)** - నాకళ్ళముందే ముసలితనం వస్తున్నది. ఆనందించదగిన పరువంలో ఆనందించకుండా కాలాన్ని గడపిన తరువాతనా ఆనందించడం !

**(మున్నిరున్దు)** - కళ్ళు చూడలేని వెనుకవైపు ఉండి ముసలితనాన్ని పొందినా సహించవచ్చు. కన్నులు సాక్షాత్తు చూచే వక్షస్సులోనే ఉండి చూడగా చూడగా కాంతి కోల్పోతున్నవి.

**(మూక్కిన్ఱు)** - వయస్సు చెల్లిపోతున్నది. **"న మే దుఃఖం ప్రియా దూరే న మే దుఃఖం హృతేతి వా, ఏతదేవానుశోచామి వయోఽస్యాహ్యతివర్తతే"** (రామా.యుద్ధ-5-5) (నాకు మిక్కిలి ప్రియమైన సీతాదేవి నాకు దూరంలో ఉన్నదనిగాని, అపహరింపబడిందని గాని, నేను చింతించడం లేదు. ఈమె వయస్సు అతిక్రమించిపోతున్నదే- అనే నేను చింతిస్తున్నాను) అని శ్రీరాముడు పల్కినట్లే అంటున్నది. **"మూక్కిన్ఱు"** అనే దానికి వృద్ధి చెందుతున్నది- అని కూడా అర్థం చెప్పవచ్చు- **"ఉన్నిత్తెళున్ద ఎన్ తడములైకళ్"** (నాచ్చి.తిరు-1-5) అని పల్కిన గోదాదేవి సూక్తివంటిది ఇది.

**(మున్నిరున్దు మూక్కిన్ఱు)** - నా కళ్ళు చూస్తూ ఉండగానే కాంతి తరిగి పోవాలా? ప్రక్కకు పోయి నిలచి కాంతి పోయినా సహించవచ్చునే!

**(మూవామై... అఱివీరిల్లైయే)** - అతనిని తీసికొనివచ్చి ఇవ్వడంద్వారా వీటిని ముసలితనం పొందకుండా కాపాడేవారెవరు లేరా!

మన్ను మరున్దు అఱివీరిల్లైయే - మాల్‌విడైయిన్ 92

తున్ను పిడరెరుత్తు త్తూక్కుణ్డు* వన్ తొడరాల్

---

వార్ధక్యాన్ని పొందకుండా అడ్డుకోగల ఒక, మన్ను మరున్దు అఱివీర్ ఇల్లైయే = గొప్ప మందును కనుగొన్నవారెవ్వరూ లేరే !, మాల్ విడైయిన్ = (ఆవులపై) మోహాన్ని పొందిన ఎద్దుయొక్క, తున్ను పిడర్ ఎరుత్తు = యుక్తమైన (బలిసిన) మెడభాగంలో ఉండే మూపురంలో, తూక్కుణ్డు = వేలాడదీయబడి, కన్నియర్

---

**(మన్ను మరున్దఱివీరిల్లైయే)** - **“భేషజమ్”** అని పేరు పొందిన అమోఘమైన మందును తెలిసినవారెవరు లేరా ? **“సముద్రం రాఘవో రాజా శరణం గంతు మర్హతి”** (ప్రభువైన శ్రీరాముడు సముద్రుని శరణాగతిని చేయాలి) (రామా.యుద్ధ-19-31) అని ఉపదేశించిన విభీషణునివలె **“మడల్‌ను శరణు వేడు”** అని పలికే వారెవరు లేరా?- అనికూడా భావం. “లోకంలో ఆంతరాళికులు (ఘటకులు) లేరా? అని భట్టర్ వివరించగా నేను విన్నాను’’ అని నంబిళ్ళై పలికారని నాయనార్ వ్యాఖ్యానంలో తెలుపబడింది. ఆంతరాళికుడంటే ఘటకుడు. నాయకీ -నాయకుల మధ్య ప్రణయకలహాన్ని తీర్చే ఘటకుడు. **“అఙ్గుఱ్ఱే నల్లేన్ ఇఙ్గుఱ్ఱే నల్లేన్”** (తిరువాయ్-5-8-2) అనే రీతిలో పరమపదాన్ని పొందకుండా, ఈ లోకంలో ఉండలేకుండా మధ్యలో ఉండే ముముక్షువులు ఎవరూ లేరా - అనే అర్థాన్ని కూడా చెప్పవచ్చు. **“మన్ను మరున్దఱివీరిల్లైయే!”** అని ఆక్రోశించిన తరువాత, ఇంకా ప్రణయబాధను పెంచే వృత్తాంతాలు సంభవించడాన్నిగూర్చి ఇకపై పల్కుతున్నది. (పరకాల నాయకి)

**(మాల్‌విడైయిన్)** -ఆవుపై ప్రేమతో వ్యామోహాన్ని పొందిన ఎద్దుయొక్క

**(తున్ను పిడర్ ఎరుత్తు త్తూక్కుణ్డు)** - నిబిడమైన (బాగా బలిసిన) కంఠంలో ఉండే మూపురంలో వేలాడదీయబడినదై.

**(వన్ తొడరాల్ కట్టుణ్డు)** ఈ (గంట) ధ్వనిని విని నేను పడే బాధను చూచిన కొందు ధర్మాత్ములు ఈ గొలుసును విప్పాలని చూచినా, విప్పడానికి సాధ్యం కాని రీతిలోని బలమైన గొలుసుతో కట్టుబడి.



కన్నియర్‌కణ్ మిళిర క్కట్టుణ్డు* - మాలైవాయ్ 93

తన్నుడైయ నావొழியాతు ఆడుమ్ తనిమణిన్*

---

కణ్ మిళిర = చిన్ని కన్నియలు కళ్ళు తెఱచేటట్లు, వన్ తొడరాల్ కట్టుణ్డు = బలమైన దారంతో కట్టబడి, మాలై వాయ్ = సాయంసంధ్యాకాలంలో, తన్నుడైయ నా ఒழియాతు ఆడుమ్ తని మణియిన్ = తన (గంటలోని) నాలుక నిరంతరం కదలుతూ ఉండే సాటి లేని గంటయొక్క, ఇన్ ఇశై ఓశైయుమ్ వన్దు = భోగ్యమైన

---

**(కన్నియర్‌తమ్ కణ్ మిళిర క్కట్టుణ్డు)** - ప్రేమ అంటే ఏమి? అనే విషయాన్ని పూర్తిగా ఏమీ తెలియని కన్యలు సైతం ఈ ధ్వనిని విని భయపడి నిద్రనుండి లేచే రీతిలో కట్టబడినదై.

**(మాలై వాయ్)** - ఆవుకు, ఎద్దుకు మధ్య ఏర్పడిన కలహం తీరి కలయిక జరిగే కాలమైన సాయంకాలంలో. తనతో (నాయకితో) నాయకుడు కలువలేదే అనే బాధను కల్గించే కాలం ఇది. **“యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ- ఎన్గిఱపడియే కణ్ణుఱక్కమ్ తేట్టమాన రాత్రియిలే”** అని నాయనార్ వ్యాఖ్య.

**(తన్నుడైయ నావొழியాతు ఆడుమ్)** - ఆవుకూడా కలయికకు అంగీకరించకుండా పరుగెత్తుతున్నది. దానిపట్ల ఆశతో ఎద్దు దానిని వెంబండించి పరుగెడుతున్నది. అందువల్ల ఎద్దుకంఠంలో కట్టబడిన గంట నిరంతరంగా ధ్వనిస్తున్నది. ఇది నాయకికి నాయకుని సంగమసుఖాన్ని స్మరింపజేస్తూ బాధిస్తున్నది.

**(నా వొழியాతు ఆడుమ్)** - కొంచెంసేపు గంట ధ్వనించకుండా ఉన్నా ఈ స్మరణ లేకుండా ఉండవచ్చు. ఎడతెరపి లేకుండా ధ్వనిస్తూ బాధిస్తున్నదే !

**(తనిమణియిన్)** - బాధించడంలో తనకు సాటి తానే అనే రీతిలోని గంటయొక్క.

**(ఇన్నిశై యోశై)** - భోగ్యమైన ధ్వనిని వినేవారు ద్రవించేటట్లుగా నన్ను ద్రవింపజేసిన ధ్వని. అన్యులకు తీయగా ఉండే ధ్వని -అనికూడా అర్థం. **“ఇనియ పాట్టు క్కేట్టాల్ పడుమోపాతి పడుత్తవఱ్ఱాయిరుక్కై”** అని పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్య.

**ఇన్నిశై యోశైయుమ్ వన్దెన్ శెవితనక్కే* 94**

**కొన్నవిలు మెంఃకిల్ కొడితాయ్ నెడితాకుమ్***

**ఎన్నితనై క్కాక్కుమా? శొల్లీర్* - ఇతు విళైత్త 95**

---

సంగీతంవంటి ధ్వనికూడా వచ్చి, ఎన్ శెవితనక్కే = నా చెవికి మాత్రం, కొల్ నవిలుమ్ ఎంఃిల్ కొడితు ఆయ్ నెడితు ఆకుమ్ = వధను చేయగల పనికంటే క్రూరమైనది, దీర్ఘమైనది అవుతున్నది. ఇతనై కాక్కుమ్ ఆ ఎన్ = ఈ ఆపదకు తప్పి బతికిబయటపడే దారి ఏది? శొల్లీర్ = (ఏదయినా అటువంటి ఉపాయం

---

**(వన్దెన్ శెవితనక్కే)** - మిగిలినవారికి తీయని ధ్వనిగా ఉన్నది. నాకు ఒక్కతెకే కఠినంగా, అసహ్యంగా ఉన్నది. **"నాట్టార్క్కు ఇదినుడైయ ధ్వని శెవిపట్టానిఱ్కచ్చెయ్-తేయుమ్ జీవియానిఱ్పర్కళితే. ఇవ్విరహమ్ వేఱొరువర్క్కిల్లైయే. ఆకైయాలే బాధకత్వమ్ ఇవళుక్కేయితే యుళ్ళతు"** అని నాయనార్వ్యాఖ్య.

**(శెవి తనక్కే)** - మనస్సులో ప్రవేశించడానికి ముందు చెవిని కాలుస్తూ లోపలకు ప్రవేశిస్తున్నది.

**(కొన్నవిలుమ్ ఎంఃకిల్ కొడితాయ్)** - చూచేటపుడే వధిస్తుందని సూచించే ఈటెకంటే క్రూరమైనదై.

**(నెడితాకుమ్)** - ఈటె ఒక దెబ్బతో వధించి వేస్తుంది. అంతటితో బాధ తీరిపోతుంది. ఇది చాలాకాలం చిత్రవధ చేస్తుంది. **"వేలిలుఞ్కాట్టిల్ మికవుమ్ కొడితాకానిన్ఱతు. అతుపోలే కడుక ముడిత్తు విడుకైయన్ఱిక్కే, ఇతు ఉరువ నలియానిన్ఱతు"** అని నాయనార్వ్యాఖ్య.

**(ఎన్నితనై క్కాక్కుమా)** - ఏ దారిలో నా స్త్రీత్వాన్ని రక్షించుకోగలను ?

**(శొల్లీర్)** - మీరే చెప్పండి. స్త్రీత్వాన్ని రక్షించుకోవాలని చూస్తే చిత్రవధ కల్గుతుంది. దానిని తప్పించుకోవాలని చూస్తే స్త్రీత్వాన్ని పోగొట్టుకొని మడల్ ఎక్కితీరవలసి ఉన్నది.

**(ఎన్నితనై క్కాక్కు మా)** -అబల అయిన నేను దేనివల్ల ఏవిధంగా తప్పుకోగలను?

**(శొల్లీర్)** -ఈ ధ్వనిని వినికూడా మార్పు చెందకుండా ఉండే మీరే చెప్పండి. **"ఒరబలైయాలే ఇత్తై ప్పరిహరిత్తు క్కొళ్ళలామో ! ఇద్ధ్వని శెవిపడచ్చెయ్తేయుమ్**



**మన్నన్ నఱున్దుళాయ్ వాళ్ మార్బన్ * మామతికోళ్**

---

ఉంటే) చెప్పండి, ఇతు విళైత్త = (మలయమారుతం మొదలైనవి బాధకాలు అయేటట్లు) ఇటువంటి స్థితిని కల్పించిన, మన్నన్ = మహానుభావుడై, నఱు తుళాయ్ వాళ్ మార్బన్ = సువాసన నిండిన తులసీమాల ప్రకాశించే వక్షః

---

**ధరిత్తిరుక్కవల్ల ఉజ్గళుక్కు ప్పరిహారమ్ తెఱియావ్వై యిల్లైయితే. ఇత్తై ప్పరిహరిక్కుమ్ పడి శొల్లవల్లీర్కళో! ఇతుక్కొరు పరిహారమిల్లై యెన్డు నాన్ మీళువేనో!"** అని నాయనార్ వ్యాఖ్య. మడల్‌ను ఎక్కి అతనిని నిందించి, పడరాని పాట్లను పెట్టి అయినా అతనిని పొందాలి తప్ప, సహించి ఉండలేను- అని అంటున్నది ఇకపై పరకాలనాయకి.

**(ఇతు విళైత్త మన్నన్)** - మలయమారుతం, క్రౌంచపక్షి, వేణుధ్వని, నిరంతరంగా ధ్వనించే ఎద్దు మెడలోని గంట, వెన్నెల, చందనం మొదలైనవి సహజంగానే అబల అయిన ఆమెపై దండెత్తి వచ్చేటట్లు చేసిన అద్వితీయవీరుడు. నేను ఈ విధంగా చేతిలో మడల్‌ను ధరించేటట్లు చేసిన గొప్పవీరుడు- అని కూడా అర్థం. ఈ విధంగా నేను కావడానికి కారణమైన ప్రేమను కల్గించి నన్ను వశీకరించుకొన్నవాడు- అని కూడా అర్థం.

**(మన్నన్)** - **"కణ్డవర్కళై మడలెడుప్పిక్కైక్కు ముడి శూట్టినవన్"** అని నాయనార్వ్యాఖ్య. తనను చూచేవారిని మడల్ ఎత్తేటట్లు చేయడంలో పట్టాభిషేకం చేసికొన్నవాడు.

**(మన్నన్)** - నాయకిని బాధించగా బాధించగా తాను ఇంకా ఇంకా ఎక్కువగా వెలిగిపోతున్నాడు.

**(నఱున్దుళాయ్)** - నన్ను ఈపాట్లను పెట్టడంకోసం తాను ధరించిన బ్రహ్మాస్త్రం ఈ పరిమళించే తులసీమాల. వక్షఃస్థంలో దీనిని ధరించగానే దీని సువాసన ఇనుమడిస్తున్నది. భగవానుని వక్షఃస్థలం సర్వగంధాన్ని కల్గినదికదా!

**(వాళ్ మార్బన్)** - తులసిమాత్రమే ఉజ్జీవించాలా? నేను ఉజ్జీవించ కూడదా?

**(వాళ్ మార్బన్)** -స్వామి బాహువులు, వాటిలో అలంకరింపబడిన తులసీ మాలను చూస్తే మడల్ ఎక్కకుండా ఏవిధంగా ఉండడం?

మున్నమ్ విడుత్త ముకిల్ వణ్ణన్* - కాయావిన్ 96

స్థలాన్ని కలవాడై, మున్నమ్ మా మతి కోళ్ విడుత్త ముకిల్ వణ్ణన్ = పూర్వం ఒకానొక సమయంలో చంద్రుని దుఃఖాన్ని పోగొట్టిన కాలమేఘవర్ణుడై, కాయావిన్

**(నఱున్తుழாయ్ వాழ்మార్పన్)** - పరకాలనాయకిని మడల్ ఎక్కేటట్లు చేసిన విజయాన్ని సూచించే మాలికను ధరించినవాడు. ఈమె తన చేతిలో మడల్ ధరించినట్లే, అతడు కిరీటం, తులసీమాలలను ధరించాడు.

**(మామతి....) "ఇతు విళైత్త"** అనే చోట మాకు మాకు విరోధులను కల్గించిన అనే అర్థం చెప్పబడిందికదా! దానికి ఒక ఉదాహరణాన్ని ఇక తెల్పుతున్నది పరకాలనాయకి.

**(మామతి)** -అబలలను బాధించడంలో చాలా గొప్పవాడు. **"అబలైకళై నలియు మిడత్తిల్ సంహారకనై వేణ్డాతపడి యిరుక్కిఱవన్"** అని నాయనార్ వ్యాఖ్య. నీవు అతనికి తగిన బాధను కల్గించకపోయినా అతడు మిమ్ములను బాధించగల్గినవాడు. అటువంటివానికి దుఃఖంకూడా తీరిపోతే ఇక అతనినిగూర్చి చెప్పాలా ?

**(మామతికోళ్ మున్నమ్ విడుత్త ముకిల్వణ్ణన్)** - చంద్రునకు రాహువువల్ల దుఃఖం (బాధ) కల్గడానికి ముందు దానిని తీర్చిన పరమోదారుడు.

**(మున్నమ్)** -పూర్వం ఒకానొక కాలంలో తీర్చినవాడు- అనికూడా అర్థం. పూర్వం ఒకప్పుడు రక్షకుడై ఉన్నవాడు ఇపుడు బాధకుడయ్యాడుసుమా !

**(ముకిల్వణ్ణన్)** - మేఘస్వభావుడు. నీటిలో వర్షించి, తీరాన్ని ఎండిపోయే టట్లుగా చేసే మేఘంవలె, ప్రయోజనాంతరపరులను రక్షించి, అనన్య ప్రయోజను లను బాధించేవాడు. "స్థలంలో వర్షిస్తే ప్రయోజనం ఉన్నది. జలంలో వర్షిస్తే ప్రయోజనం ఏమీ ఉండదు'' అనే వివేకం లేకుండా వర్షించే మేఘం వంటివాడు. ముందు చంద్రుని ప్రత్యుపకారం ఆశించకుండా రక్షించిన మేఘంవంటి స్వభావుడేసుమా! నన్ను ఇపుడు బాధిస్తున్నాడు- అనికూడా భావం.

**(కాయావిన్ శిన్న నఱుమ్ పూన్తికழ் వణ్ణన్)** - అగిసెచెట్టుయొక్క చిన్నదైన, సువాసన నిండుగా ఉండే పూవువలె ప్రకాశించే వర్ణాన్ని కలవాడు. **"కాయావిను**



శిన్ననఱుమ్ పూన్దికழ்వణ్ణన్ * వణ్ణమ్పోల్
అన్నకడలై మలైయిట్టణై కట్టి* 97

శిన్న నఱు పూ తికழ் వణ్ణన్ = "అగిసె'' అనే వృక్షంనుండి పుట్టిన, గొప్ప సువాసనను కల పూవువలె వెలుగుతున్న వర్ణాన్ని కలవాడై, వణ్ణమ్ పోల్ = తనవర్ణంవంటి, అన్న కడలై =వర్ణాన్ని కల సముద్రంలో, మలై ఇట్టు = పర్వతాలను

**డైయ శుణ్ణత్తైయుమ్, శెవ్వియైయుముడైత్తాన పూపోలే తికழூనిన్ఱుళ్ళ తిరునిఱత్తైయుడైయవన్. శిన్న నఱుమ్బు- శిఱత్తు, నఱునాఱ్ఱ్ఱై యుడైయ పూవెన్ఱుమాయ్. పూవళవల్లవే మణమ్. శిన్నమ్-శిఱుమై. మణముమ్ గుణియు మ్బోలే ఇవనభిమానత్తిలే ఇతు విళఙ్గుకిఱతు"**- అని నాయనార్వ్యాఖ్య. ఊరిలోని వారంతా శత్రువులైనా (ఇతనిని ప్రేమించకువద్దని అన్నా). వదలలేని రూప సౌందర్యాన్ని కలవాడు.

**(శిన్నమ్ పూ)** - చిన్నపూవు. ఇతడు చాలా పెద్దవాడైనా, ఎవరైనా దరిచేర డానికి వీలు అయేటట్లున్న సౌలభ్యాన్ని కల చిన్నవాడు శిన్నమ్- చూర్ణం, పుప్పొడి. మకరందాన్ని కల్గిన పూవు- అనికూడా చెప్పవచ్చు.

**(శిన్న నఱుమ్ పూ)** - రూపంలో చిన్నది అయినా సువాసనలో గొప్పదైన పూవు. పూవుపరిమితిలో మాత్రమే ఉండేది కాదుకదా పూవుయొక్క పరిమళం. అదే రీతిలో ఇతని పరిమితిలో ఉండేది కాదు ఇతని కీర్తి.

**(వణ్ణమ్ పోల్ అన్నకడలై)** - శత్రువు అయిన రావణునే వధించాడు. గాంభీర్యంలో, అన్ని వస్తువులకు నివాసభూమి కావడంలో, గొప్పతనంలో (విస్తృతి వల్ల), వర్ణంలో తనతో సాటి వచ్చే సముద్రాన్ని సైతం కలత పొందించాలా?

**(మలై యిట్టు అణై కట్టి)** - కనబడిన రాళ్ళను తీసికొని వచ్చి, వానరులు కూడా దానిపై నడచి వెళ్ళేటట్లుగా వారధిని కట్టి, సముద్రంయొక్క లోతును పాడుచేసినవాడు. నన్నుకూడా అదే రీతిలో నా గాంభీర్యాన్ని పాడుచేసి మడల్ను ఎత్తేటట్లు చేశాడని హార్దభావం.

**(మన్నన్ ఇరావణనై)** - "రాక్షసప్రభువును నేను'' అనే అభిమానాన్ని కల్గిన రావణుని.

మన్ననిరావణనై మామణ్డు వెజ్ఞమత్తు*
పొన్ ముడికళ్ పత్తుమ్ పురళ చ్చరన్దురన్దు* 98

పెట్టి, అణై కట్టి = సేతువును కట్టి, (లంకకు వేంచేసి), మా మణ్డు వెమ్ శమత్తు= చతురంగబలం నిండిన క్రూరమైన యుద్ధరంగంలో, మన్నన్ ఇరావణనై = రాక్షస రాజైన రావణునియొక్క, పొన్ ముడికళ్ పత్తుమ్ పురళ = అందమైన పది శిరస్సులు, (భూమిపైపడి) దొర్లేటట్లు, శరమ్ తురన్దు = బాణాలను వర్షించి, తెన్ ఉలకమ్ ఏత్తువిత్త శేవకనై = (ఆరావణుని) యమలోకాన్ని పొందించిన మహావీరుడు,

**(మామణ్డు వెజ్ఞమత్తు)** - 'మా' అనే పదం నాల్గు కాళ్ళను కల్గిన ప్రాణులైన గుఱ్ఱాలను, ఏనుగులను లక్షిస్తుంది. రథగజతురగ పదాతులనే చతురంగబలాన్ని తద్వారా లక్షిస్తుంది. చతురంగబలం నిబిడంగా ఉండే భయంకరమైన యుద్ధంలో.

**(వెజ్ఞమత్తు)** - తెఱచి ఉంచిన వాకిలిలో కుక్క ప్రవేశించినట్లుగా ప్రవేశించి, తన రాకను తెలియకుండా ఉండే రావణుని సంహరించ లేదు. తనకు తానే సాటి అనదగిన యుద్ధంలో అతనిని ఎదురొడ్డి నిలచి సంహరించాడు. **“నాన్ రాక్షసరాజన్ ఎన్ఱు అభిమానిత్తిరుక్కిఱ రావణనైయుమ్ అవనుడైయ రథగజ తురగపదాతికళాన చతురంగబలత్తైయుడైత్తాయ్ మికైన్డు వరుకిఱ యుద్ధత్తిలే”** అని నాయనార్ వ్యాఖ్య.

**(పొన్ ముడికళ్)** - “ఇతడు కేవలం మానవమాత్రుడే కదా !” అని శ్రీరాముని లెక్కించకుండా, కిరీటాన్ని అలంకరించుకొని యుద్ధరంగాన్ని ప్రవేశించిన రావణుని శిరస్సులు.

**(పత్తుమ్ పురళ)** - పది తలలతోపాటు ప్రాణాలుకూడా అతని శరీరాన్ని విడచిపెట్టి పోయాయి. ఇక్కడి **“ఉమ్”** (చకారం) అనుక్తమైన ప్రాణాలను లక్షిస్తుంది. ప్రాణాలుకూడా తప్పుకోవడానికి వీలులేనట్లు శ్రీరాముడు బాణాలను ప్రయోగించిన వేగాన్ని తెలుపుతంది. పది శిరస్సులలో ఒక్కటినికూడా విడువకుండా అన్నీ మట్టి కఱిచేటట్లు చేశాడని భావం.

**(శరమ్ తురన్దు)** - ఖండించిన శిరస్సులు వరబలంతో మొలవగా మొలవగా, వాటిని మాటిమాటికి ఖండించేటట్లుగా వర్షాన్ని కురిసినట్లు బాణవర్షాన్ని కురిపించడం తెలుపబడుతున్నది.



తెన్నులక మేత్ఱువిత్త శేవకనై* - ఆయిరక్కణ్
మన్నవన్ వానముమ్ వానవర్తమ్ పొన్నులకుమ్* 99
తన్నుడైయ తోళ్వలియాల్ కైక్కొణ్డ తానవనై*

ఆయిరమ్ కణ్ మన్నవన్ వానముమ్ = వేయి నేత్రాలను కల ఇంద్రుని స్వర్గలోకాన్ని, వానవర్తమ్ పొన్ ఉలకుమ్ = (ఇంకా ఉండే) దేవతల దివ్యలోకాలు, తన్నుడైయ తోళ్ వలియాల్ కై క్కొణ్డ తానవనై = తన భుజబలంతో తన వశం చేసికొన్న

**(తెన్నులకమ్ ఏత్ఱువిత్త శేవకనై)** - యమలోకం పాడయేటట్లుగా అక్కడ ఉన్నవారు అందఱు ఇక్కడకు (లంకకు) వచ్చి రావణునకు సేవ చేసిన స్థితి తొలగి, రావణుడు రాక్షసులతో అక్కడకు చేరి యమునకు సేవ చేసే స్థితిని కల్గించి, యమలోకాన్ని నిండించిన వీర్యాన్ని కలవాడు. పాడయిపోయిన నరకలోకం ఇతనివల్లనే నిండిన లోకంగా అయినది.

**(శేవకనై)** - అటువంటి వీరుడు నా చేతిలో పడబోయే పాట్లను మీరు చూడబోతారు- అని భావం.

**(ఆయిరక్కణ్.... వీరనై)** - హిరణ్యుని సంహరించి అతడు పొందిన కీర్తిని నశింపజేస్తాను- అని అంటున్నది. (పరకాలనాయకి)

**(ఆయిరక్కణ్)** - దీర్ఘమైన స్వర్గం కనుక, దానిని రక్షించడానికి ఆవశ్యకమైన వేయి కళ్ళను కల్గినవాడు.

**(ఆయిరక్కణ్ మన్నవన్ వానముమ్)** - వేయి కన్నులను కల్గిన ఇంద్రుడు ఆ వేయి కన్నులతో గ్రహించ రక్షించే లోకాలు మూడు. **“వానమ్”**- స్వర్గం, చకారం అనుక్తసముచ్చాయకమై, భూమి, అంతరిక్షం -అనే మిగిలిన రెండు లోకాలను లక్షిస్తుంది.

**(వానవర్తమ్ పొన్నులకమ్)** - మిగిలిన యముడు, సూర్యుడు మొదలైన దేవతల అందమైన లోకాలను.

**(తన్నుడైయ తోళ్వలియాల్)** - ఒకడు దానంగా ఇచ్చి గాని, ఓ దేవత వరంగా ఇచ్చి గాని, తపస్సుతో జయించి గాని పొందినది కాదు. భుజబలంతో సంపాదించినది. **‘ఎన్నుడైయ భూమి’** (నాదేశం) అని ఇతడు గీత గీస్తే ఆయా దేవతలు తమకు తామే ఆ యా దేశాలను విడిచి వెళ్ళిపోయారు.

పిన్నోరరియురువమాకి యెరి విழிత్తు* 100

కొన్నవిలుమ్ వెஞ్ఞమత్తు క్కొల్లాతే * - వల్లాళన్

హిరణ్యకశిపుని, పిన్ = కొంతకాలం గడచిన సహించి, ఓర్ అరి ఉరువమ్ ఆకి = సాటి లేని నరసింహమూర్తియై అవతరించి, ఎరి విழிత్తు = నిప్పుకణాలు వ్యాపించేటట్లు చూచి, కొల్ నవిలుమ్ వెమ్ శమత్తు కొల్లాతే = హింస జరిగే యుద్ధరంగంలో చటుక్కున వధించికుండా, వల్లాళన్ = మహాబలిశాలి ఆ అసురునియొక్క, మన్ను

**(కైక్కొణ్డ తానవనై)** - ఇతరుల వస్తువులను అపహరించే ఆసురస్వభావాన్ని కలవాడు.

**(పిన్)** - కొంతకాలం గడచిన తరువాత. కరుణాసముద్రుడు కనుక, ఇతడు మాఱకపోతాడా ? అని పేరాశతో కొన్నాళ్ళు ఓర్చుకొన్నాడు.

**(ఓరరియురువమాకి)** - భాగవతాపచారంయొక్క ఎల్లను దాటగానే సాటి లేని సింహమైనాడు. లోకంలో చూడడానికి సాధ్యం కాని రీతిలో సింహరూపం, మానవరూపం కల్గిన నృసింహుడైనాడు.

**(ఓరరి)** - సాటి లేని సింహం. సత్యసంకల్పుడైన తాను తలచినా మళ్ళీ ఇటువంటి ఇంకొక రూపాన్ని గ్రహించడానికి సాధ్యం కానిది.

**(ఆకి)**- "మానవునివల్ల మరణం లేదు; మృగంవల్ల చావు లేదు'' ఇత్యాది వరాల బలంవల్ల గర్వాన్ని పొందిన హిరణ్యకశిపుని నశింపజేయడంకోసం కలయికకు అవకాశం ఏమాత్రం లేని నరత్వసింహత్వాలను మేళవించాడు.

**(ఎరి విழிత్తు)** - సహజంగానే లోకానికి అందఱికి తల్లివలె కాపాడే చల్లని తామరపూలవంటి స్వామి కన్నులు "ఆశ్రితవిరోధి ఇతడు''. అనగానే కోపానికి వశమై నిప్పులు కురిసాయి.

**(కొల్ నవిలుమ్ వెஞ్ఞమత్తు క్కొల్లాతే)** - ఇతనిని చటుక్కున వధించేటట్లు యుద్ధంలో ఒక బాణాన్ని ప్రయోగించి, తలను తుంచితే అది ఈ మహాపాపికి కిరీటం పెట్టినట్లు ఉంటుంది- ఆ విధంగా చేయకుండా చిత్రవధను చేశాడు.

**(వల్లాళన్)** - కడుపున పుట్టినవాని గొప్పతనాన్నికూడా సహించలేని మనః కాఠిన్యాన్ని, నృసింహుడుసైతం వెనుకంజ వేయవలసివచ్చే దేహబలాన్ని కలవాడు.



మన్ను మణిక్కుஞ్జి పఱ్ఱి వరవీర్త్తు* 101

తన్నుడైయ తాళ్మేల్ కిడాత్తి* - అవనుడైయ

పొన్నకలమ్ వళ్ళుకిరాల్ పోழ்న్దు పుకழ் పడైత్త* 102

మణి కుஞ్జి పఱ్ఱి వర ఈర్త్తు = స్థిరమైన, మణిమయం అయిన కిరీటం పొందికగా ఉండే శిరోజాలను పట్టి దగ్గరకు ఈడ్చి, తన్నుడైయ తాళ్ మేల్ కిడాత్తి= అతనిని తన ఒడిలో పరుండబెట్టుకొని, అవనుడైయ = అతని, పొన్ అకలమ్ = అందమైన వక్షఃస్థలాన్ని, వళ్ ఉకిరాల్ పోழ்న్దు = నిశితమైన నఖాలతో చీల్చి,

**(మన్ను మణిక్కుஞ్జి పఱ్ఱి)** - అందఱు "హిరణ్యాయ నమః" అని పలికే రీతిలో ఏకచ్ఛత్రాధిపత్యాన్ని నడిపే అతని మణికిరీటాన్ని మొదట (స్వామి) పట్టుకొన్నాడు.

**(మన్ను మణిక్కుஞ్జి పఱ్ఱి వరవీర్త్తు)** - హిరణ్యుడు ఇంతవరకు ఎవరివద్ద అవమానపడినవాడు కానందువల్ల కిరీటాన్ని పట్టుకోగానే ఆ అవమానంతో అతని ప్రాణాలు పోయాయి. తరువాత శవాన్ని లాగినట్లుగా హిరణ్యుని లాగివేశాడు, అంతే.

**(తన్నుడైయ తాళ్మేల్ కిడాత్తి)** - "లక్ష్మీదేవి శయనించదగిన ఒడిలో నన్ను శయనించనీయకుండా, మొఱటువాడైన పాపిష్ఠివానిని పరుండబెట్టుకొన్నాడే! అని అంటున్నది (పరకాలనాయకి). నావంటి వారినికదా ఒడిలో పెట్టుకోవాలి. ఆశ్రితులకు పరమప్రాప్యమైన శ్రీచరణాలలో ఆసురప్రకృతిని కలవారిని ఎత్తి పెట్టుకోవడమా!- అని అంటున్నది- అని భట్టర్ అనగా నేను విన్నాను'' అని నమ్బిళ్ళై అనుగ్రహించినట్లు నాయనార్ తమ వ్యాఖ్యలో తెలిపారు.

**(అవనుడైయ పొన్నకలమ్)** - హిరణ్యుడనే పేరును కలవాడుకదా! అటువంటి అతని వక్షఃస్థలాన్ని- అని భావం. లేక, నృసింహమూర్తి నఖాలకు ఎర సరిపోయే రీతిలో పెంచబడిన అందమైన వక్షఃస్థలం- అనికూడా భావం.

**(వళ్ళుకిరాల్ పోழ்న్దు)** - బంగారు (హిరణ్యుని) వక్షఃస్థలం అయినందువల్ల మండే చూపును చూడగానే కఱగిపోయింది. తరువాత అందమైన నఖాలతో అరటినారను చీల్చినట్లుగా చీల్చివేశాడు.

మిన్నిలఙ్గు మాళ్ళిప్పడై త్తడక్కై వీరనై*
మన్నివ్వకలిడత్తై మాముతునీర్ తానిన్ విళ్ళుఙ్గ* 103

పుకళ్ పడైత్త = దాసుడైన ప్రహ్లాదుని రక్షించాడనే కీర్తిని పొందినవాడై, మిన్ ఇలఙ్గు ఆళ్ళి పడై తడ క్కై వీరనై = మెఱపువలె ప్రకాశిస్తున్న చక్రాయుధాన్ని శ్రీహస్తంలో కల మహావీరుడై, మన్ను ఇ అకల్ ఇడత్తై = అందఱు పొందికగా ఉండే ఈ విశాలమైన భూమిని, మా ముతు నీర్ తాన్ విళ్ళుఙ్గ = మహాప్రళయజలం

**(పుకళ్ పడైత్త)** - తండ్రికూడా శత్రువైనపుడు రక్షించిన నిరుపాధిక పిత అనే, భక్తులకోసం తనను మార్చుకొని రక్షించే ఉదారుడనే కీర్తిని పొందాడు.

**(మిన్నిలఙ్గు మాళ్ళి)** - హిరణ్యకశిపుని బలిసిన శరీరం నఖాలకు కొంచెంగా ఎరగా సరిపోయింది. ఎర తనకు మిగలనందువల్ల శ్రీసుదర్శనం మెఱసి గర్జించి నాలుకలను చాచింది. **"కిళరొళియాల్ కుఱై యిల్లా అరియురువాయ్ క్కిళర్న్దెళ్ళున్దు కిళరొళియ ఇరణియనతు అకల్మార్వమ్ కిళ్ళిత్తుకన్ద వళరొళియ కనలాళ్ళి వలమ్బురియన్"** (తిరువాయ్- 4-8-7) అని అన్నారుకదా నమ్మాళ్వార్లు.

**(వీరనై)** - **"ఉగ్రమ్ వీరమ్'** అని నృసింహతాపనీయోపనిషత్‌లో ప్రసిద్ధమైన నృసింహానుష్టుప్ మంత్రం క్రమంలో అనుసంధిస్తున్నారు.

**(మన్నివ్వకలిడత్తై.... కూత్తనై)** - జ్ఞానాన్ని, అధ్యవసాయాన్ని కల్గిన ప్రహ్లాదుని రక్షించడమే కాక, దుఃఖపడ్డాము అనే స్మరణకూడా లేనివారిని, సంబంధాన్ని గమనించి ప్రళయంలో రక్షించిన అతని కీర్తి నశిస్తుంది- అని అంటున్నది.

**(మన్నివ్వకలిడత్తై)** - చిరకాలంగా అతనికి చెందినదిగా (స్వామి) పాదముద్రలను కల్గిన ఈ వామనుని భూమిని- అని భావం. **"మన్ను"** -నిలకడగా ఉండే - అని అర్థం. అందఱు పొందికగా ఉండే భూమి- అని కూడా భావం.

**(మాముతు నీర్ తాన్ విళ్ళుఙ్గ)** - **"అద్భ్యః పృథివీ"** (తైత్తి-ఆనంద) (నీటినుండి భూమి పుట్టింది) అనే రీతిలో సృష్టింపబడ్డ జలమే భూమిని గ్రసించగా. కావలిగా పెట్టినవారే దొంగతనాన్ని చేసినట్లుగా, భూమికి రక్షకంగా పెట్టిన సముద్రమే భూమిని గ్రసించగా.

**(పిన్నుమ్)** - స్వామి చేసే రక్షణకు ఒక అంతం లేదు. **"పిన్నుమ్, పిన్నుమ్"** (ఇంకా, ఇంకా) అని అనడం తప్ప వాటికి అంతం లేదు.



పిన్ను మోరేనమాయ్ ప్పుక్కు వళైమరుప్పిల్*
కొన్నవిలుమ్ కూర్నుతిమేల్ వైత్తెడుత్త కూత్తనై* 104
మన్నుమ్ వడమలైయై మత్తాక మాశుణత్తాల్*

తాను మింగగా, పిన్నుమ్ = దానికి పిమ్మట, ఓర్ ఏనమ్ ఆయ్ పుక్కు = ఒక దివ్యవరాహమై (సముద్రంలోపలకు) ప్రవేశించి, వళై మరుప్పిన్ =వంచిన దంతం యొక్క, కొల్ నవిలుమ్ కూర్ నుతిమేల్ = శత్రువులను వధించగల నిశితమైన అగ్రభాగంపై, వైత్తు ఎడుత్త కూత్తనై = (ఆ భూమిని) ఎత్తి బయటకు తీసికొనివచ్చిన అందమైన లీలను కలవాడై, మన్నుమ్ వడ మలైయై = బాగా లోపలకు గాఢంగా నాటబడ్డ మందరపర్వతాన్ని, మత్తు ఆక = కవ్వంగా చేసి, మా శుణత్తాల్ =

**(ఓరేనమ్)**-సాటి లేని వరాహం. తన పరత్వాన్ని తగ్గించుకోవడంకోసం స్వీకరించిన రూపంయొక్క అందాన్ని చూస్తే దృష్టిదోషం తగులకుండా హారతి ఇవ్వవలసినట్లున్నది.

**(ఏనమ్)** - నీటిలో, బురదలో సంచరించగల్గిన మానం (సంకోచం, పరిమితి) లేని వరాహానికి.

**(కొన్నవిలుమ్ కూర్ నుతిమేల్)** - "ఇతడు రక్షకుడు'' అని అనుకూలురై ఉంటే బ్రతుకవచ్చు తప్ప, ఎదిరిస్తే వధించగల్గిన పదును కల్గిన కుంతంయొక్క అగ్రభాగంపై.

**(వైత్తు ఎడుత్త)** - అగ్రభాగంలో పెట్టి పైకి ఎత్తిన.

**(కూత్తనై)** - ఈ నృత్యాన్ని దర్శించగల్గితే, ఎప్పుడూ ప్రళయం సంభవించినా బాధపడనక్కఱలేదు- అని భావం.

**(మన్నుమ్ వడమలైయై.... వళ్ళలై)**- అద్వేషం (అడ్డుపెట్టకపోవడం) అనే గొప్ప సంపదను కల్గిన భూమిలోనివారిని ప్రళయంనుండి రక్షించడమే కాకుండా, **"ఈశ్వరోఽహమ్"** అనే అహంకారాన్ని కల్గిన దురభిమానులైన దేవతలకోసం తన శరీరాన్ని శ్రమపెట్టి వారి కార్యాన్ని చేసిన గొప్పతనాన్ని సైతం పాడుచేస్తాను- అని అంటున్నది.

**(మన్నుమ్ వడమలైయై)** - భూమికి మేకు దిగగొట్టినట్లుగా నిలకడగా ఉండే మందరపర్వతాన్ని, చక్కగా ధరించేటట్లు నాటిన రీతిని తెలుపుతున్నట్లు చెప్పవచ్చు. చిలికినపుడు స్థిరంగా ఉండే మందరపర్వతమనికూడా చెప్పవచ్చు.

మిన్ను మిరు శుడరుమ్ విణ్ణుమ్ పిఱఙ్గొళియుమ్* 105

తన్నినుడనే శుழల మలై తిరిత్తు * ఆఙ్గు

ఇన్నముతమ్ వానవరై యూట్టి* అవరుడైయ 106

మన్నుమ్ తుయర్ కడిన్ద వళ్ళలై* - మఱ్ఱన్ఱియుమ్

(వాసుకి అనే) సర్పంతో (చుట్టి), మిన్నుమ్ ఇరు శుడరుమ్ విణ్ణుమ్ పిఱఙ్గు ఒళియుమ్ తన్నినుడనే శుழల మలై తిరిత్తు = ప్రకాశిస్తున్న చంద్ర-సూర్యులు, ఆకాశం, ప్రకాశించే (ఇంకా పలు) తేజఃపదార్థాలు తనతో పరిభ్రమించేట్లుగా ఆ మందర పర్వతాన్ని తిప్పి (సముద్రాన్ని చిలికి), వానవరై ఇన్ అముతమ్ ఊట్టి = దేవతలకు భోగ్యమైన అమృతాన్ని అనుగ్రహించి (తాగించి), అవరుడైయ =వారి, మన్నుమ్ తుయర్ కడిన్ద = చిరకాలంగా ఉండే (మరణ) దుఃఖాన్ని పోగొట్టిన,

**(మత్తాక మాశుణత్తాల్)** - పర్వతాన్ని కవ్వంగా చేసికొని, వాసుకిని దారంగా చేసికొని.

**(మిన్ను మిరు శుడరుమ్ విణ్ణుమ్)** - ప్రకాశించే చంద్రసూర్యులనే రెండు తేజస్సులు, వారికి నివాసమైన ఆకాశం.

**(పిఱఙ్గొళియుమ్)** - ఇంకా ప్రవేశించే నక్షత్రాలు మొదలైన జ్యోతిస్సులు.

**(తన్నినుడనే శుழల)** - చిలికేటపుడు వేగంవల్ల తనతోపాటు గిరగిర తిరిగేటట్లుగా చిలికి.

**(మలై తిరిత్తు ఆఙ్గు ఇన్నముతమ్ వానవరై యూట్టి అవరుడైయ మన్నుమ్ తుయర్ కడిన్ద వళ్ళలై)** - చాలాసేపు చిలికి దేవతలు అలసిపోయారు. అపుడు తానే వేయి బాహువులతో సవ్యసాచియై క్షీరాబ్ధిని చిలికి, వారికి శత్రువులైన అసురులను వధించి, దేవతలకు అరుదైన మందు అయిన అమృతాన్ని అనుగ్రహించి, వారి గొప్ప దుఃఖాన్ని తీర్చిన పరమోదారుని.

**(మన్నుమ్ తుయర్ కడిన్ద)** - ఈ సంసారమండలంలో ఉండేంతవరకు స్థిరంగా సంభవించే మరణమనే కష్టం తీరేటట్లు అమృతాన్ని అనుగ్రహించాడని భావం. దుర్వాసముని శాపంవల్ల స్థిరంగా కల్గిన దుఃఖాన్ని తీర్చాడు- అని కూడా భావం.



తన్నురువమ్ ఆరు మఱియామల్ తానఙ్గోర్* 107

మన్నుమ్ కుఱళురువిన్ మాణియాయ్* - మావలితన్

వళ్ళలై = పరమోదారుడై, మఱ్ఱు అన్ఱియుమ్ =మఱి ఇంకా, తన్ ఉరువమ్ ఆరుమ్ అఱియామల్ = తన స్వరూపాన్ని ఎవరు తెలిసికోలేని రీతిలో, తాన్ అఙ్గు ఓర్ మన్నుమ్ కుఱళ్ ఉరువిన్ మాణి ఆయ్ = పరమపురుషుడైన తాను

**(వళ్ళలై)** - కల్పవృక్షం దగ్గరకు పోయి కౌపీనాన్ని యాచించినట్లుగా తననే అనుగ్రహించే కల్పకమైన ఇతనివద్ద అన్యఫలాలను కోరేవారికి వాటిని అనుగ్రహించే పరమోదారుడు. అనుగ్రహించిన తరువాతకూడా తనకు రక్షకత్వాన్ని కల్గించిన (తను రక్షకునిగా అంగీకరించిన)వారిని తనను అనుగ్రహించినవారినిగాను, తాను వారిచే అనుగ్రహింపబడ్డవానినిగాను భావించి, వారిని **"ఉదారాః"** (గీత- 7-18) అనే ఉదారుడు. **"ఉళ్ళ నోయ్‌కళ్ తీర్ మరున్దు వానవర్క్కళిత్త ఎమ్ వళ్ళలార్'** (తిరుచ్చంద-88) అని అన్నారుకదా తిరుమழிశై యాழ்వార్లు కూడా.

**(మఱ్ఱన్ఱియుమ్ ... తాళానై)** - అమృతమథనకాలంలో దురభిమానులైన దేవతలకు సహాయపడేటపుడుకూడా, తన పరత్వానికి కొఱతలేకుండాకదా సహాయపడ్డాడు. ఆవిధంగా కాకుండా వారికోసం తన గొప్పతనాన్ని సైతం విడచి పెట్టి, తనను తక్కువగా చేసికొని వామనుడై యాచించిన సౌశీల్యమనే మహాగుణాన్ని సైతం పాడుచేస్తాను- అని అంటున్నది.

**(మఱ్ఱన్ఱియుమ్)** - ఇంకా అంతకు మించి ... అని భావం. పూర్వం తెల్పిన పరత్వానికి వ్యతిరేకం అయిన సౌలభ్యాన్ని ఇది తెల్పుతున్నది.

**(తన్నురుమ్ ఆరుమ్ అఱియామల్)** - చూచినవారు అంతా ఇతడు ఎల్లప్పుడూ ముందు జన్మలలో సైతం ఈ విధంగానే యాచకుడై ఉండి ఉంటాడు- అని తలచేటట్లుగా ఉంటాడు. నాల్గు పురుషార్థాలను ఇచ్చే **"అలమ్ పురిన్ద నెడున్తడక్కై"** అని, **"గోసహస్రప్రదాతారమ్"** అని కీర్తింపబడే విశాలమైన, ఉదారమైన శ్రీహస్తాలను కలవాడనే విషయం ఎవరూ తెలియని రీతిలో- అనికూడా భావం.

**(ఆరుమ్ అఱియామల్)** - లక్ష్మీదేవి, నిత్యసూరులుకూడా తెలియలేని రీతిలో- అని భావం.

పొన్నియలుమ్ వేళ్వియ్కణ్ పుక్కిరున్దు* పోర్ వేన్దర్ 108

అక్కడ ఒక దివ్యమైన వామనరూపాన్ని దాల్చిన బ్రహ్మచారియై, మావలితన్ = మహాబలికి చెందిన, పొన్ ఇయలుమ్ వేళ్వియ్కణ్ పుక్కిరున్దు = స్వర్ణదానాన్ని చేసే యాగభూమిలో ప్రవేశించి, పోర్ వేన్దర్ మన్నై = యుద్ధాన్ని చేయగల్గిన

**(తానజ్ఞు పుక్కు)** - అందఱిచే పొందదగిన తాను మహాబలి యజ్ఞవాటికకు పోయి.

**(ఒర్ మన్నుమ్ కుఱళురువిల్)** -**"కణ్డ కణ్కళ్ మఱ్ఱొన్ఱినై క్కాణాద"** (తనను దర్శించిన కన్నులు ఇంకొక వస్తువును దేనినీ చూడని) రీతిలో వెలిగే సాటి లేని అందాన్ని కల వామనవేషాన్ని కల్గినవాడు -అని భావం.

**(మాణియాయ్)** - "ఉన్నది" అని దానం ఇచ్చినపుడు, "లేదు" అని తలుపులు మూసినపుడు ఏ తేడా లేకుండా ముఖం వికసించి ఉండడం. యాచకవృత్తిలో ఆరితేరిన రూపాన్ని కల బ్రహ్మచారియై -అని భావం.

**(మావలితన్ పొన్ ఇయలుమ్ వేళ్వియ్కణ్)** - మహాబలియొక్క అందమైన యాగంలో -అని భావం. మడల్‌ను ఎక్కి ప్రాప్యాన్ని పొందాలని తలచే నా ప్రయత్నం వలె కాకుండా, నేనుకూడా అతనివలె యాగం చేస్తే స్వామి తానే వస్తాడు -అని భావం. లేక, బంగారాన్ని ఇచ్చే యాగం -అని భావం. అడిగినవారు అడిగినదానిని అంతటిని ఇచ్చే యాగం.

**(పుక్కు)** - తాను పాదాలు పెట్టిన చోట అంతా భూమి పులకరించేటట్లు శ్రీచరణాలను పెట్టి.

**(ఇరున్దు)** - **"కొళ్వన్ నాన్ మావలి! మూవడి తా"** (తిరువాయ్-3-8-9) అనే రీతిలో, "ఇవ్వను" అని అన్నా, "దానాన్ని గ్రహిస్తాను" అని దానాన్ని గ్రహిస్తే తప్ప పోను - అని స్థావరప్రతిష్ఠగా ఉండి - అని భావం.

**(పోర్ వేన్దర్మన్నై)** - యుద్ధవీరులైన రాక్షసులకు అందఱికి ముఖ్యుడైన మహారాజును.

**(మనజ్గొళ్ళ వఞ్జిత్తు)** - శుక్రాచార్యుడు మొదలైనవారు- "ఇతడు సామాన్యుడైన బ్రహ్మచారికాదు సుమా! మాయావి అయిన విష్ణువే" అని మహాబలి యొక్క



మన్నై మనజ్గొళ్ళ వఞ్జిత్తు నెఞ్జురుక్కి*
ఎన్నుడైయ పాదత్తాల్ యానళప్ప మూవడిమణ్* 109

మన్నా! తరుకెన్ఱు వాయ్ తిఱప్ప - మఱ్ఱివనుమ్

బలాన్ని కల ప్రభువులకు ప్రభువైన ఆ మహాబలిని, మనమ్ కొళ్ళ వఞ్జిత్తు= (ఈ బ్రహ్మచారి యాచించడం కోసమే వచ్చాడు- అని) నమ్మేటట్లుగా వ్యామోహపఱచి, నెఞ్జు ఉరుక్కి = (నడకల హొయలు, మాటల సొబగు మొదలైనవానితో) అతని మనస్సును కఱగించి, మన్నా = "ఓ రాజా!, ఎన్నుడైయ పాతత్తాల్ యాన్ అళప్ప= నా కాలి పాదాలతో నేను కొలిచేటట్లుగా, మూ అడి మణ్ తరుక ఎన్ఱు =

మనస్సును మఱలించాలని చూచినా, తన అందంతో అతనిని వంచించి. "ఇతడు యాచించడానికి వచ్చాడే తప్ప వచించడానికి రాలేదు'' అని అతడు మనః పూర్వకంగా నమ్మేటట్లుగా వంచించి- అని భావం.

**(నెఞ్జురుక్కి)- "పులన్ కొళ్ మాణాయ్"** (తిరువాయ్- 1-8-6) అనే రీతిలో అతనికి దానం ఇస్తే తప్ప నిలువ లేని రీతిలో, శుక్రునిచే కలత పొందింపబడ్డ అతని మనస్సును ఆకర్షించి, తన మాటలతో మనస్సును కఱగించిన తీరును వివరిస్తున్నారు.

**(ఎన్నుడైయ పాదత్తాల్ యాన్ అళప్ప)**

**(మన్నా)** - రాజా! అని అన్నాడు వామనుడు. ఇతనిని తల పైకెత్తి చూచాడు బలి.

**(మూవడి)** - "మూడడుగులు ఇవ్వాలి'' అని వామనుడన్నాడు. "ఏమి ఇవ్వాలి?'' అని అన్నాడు బలి.

**(మణ్)**- "మూడడుగుల నేలను ఇవ్వాలి'' అని అన్నాడు వామనుడు. "ఎవరి కాలితో ?'' అని అడిగాడు బలి.

**(ఎన్నుడైయ పాతత్తాల్)** - "నా కాలితో'' అని అన్నాడు వామనుడు. "నా పాదంవంటి పెద్ద పాదంతో గ్రహించకూడదా ?'' అని అన్నాడు మహాబలి.

**(యానళప్ప)** - "నా మనోరథానికి తగినట్లు చేయడమేకదా నీ కర్తవ్యం'' అని అన్నాడు వామనుడు. ఇతని మాటలను ఇంకా ఇంకా వినాలి - అనే ఆశతో మహాబలి మాటలాడకుండా ఉన్నాడు.

ఎన్నాల్ తరప్పట్టతు ఎన్టలుమే* అత్తుణైక్కణ్ 110

మిన్నార్ మణిముడి పోయ్ విణ్ తడవ* - మేలెడుత్త

మూడడుగుల నేలను ఇయ్యి'' అని, వాయ్ తిఱప్ప = నోరు తెఱచి అడుగగా, అవనుమ్ = దానిని విన్న ఆ మహాబలికూడా, ఎన్నాల్ తరప్పట్టతు ఎన్టలుమ్ = "నాచే మూడడుగుల నేల ఇవ్వబడింది'' అని చెప్పగా, అత్తుణైక్కణ్ = ఆ క్షణంలోనే, మిన్ ఆర్ మణి ముడి పోయ్ విణ్ తడవ = ప్రకాశించే మణిమకుటం ఆకాశంవరకు పోయి స్పృశించగా, మేల్ ఎడుత్త = పైకి ఎత్తిన, పొన్ ఆర్ కనై కழల్ కాల్ =

(తరుక) -"ఇపుడే ఇవ్వాలి'' అని అమృతం ఒలికేటట్లు వామనుడు అన్నాడు.

(తరుక ఎన్టు వాయ్ తిఱప్ప) - అతడు ప్రకాశించే నోటిని తెఱచిన అందంలో ఎవరు ద్రవించరు?

(మற்றవనుమ్) - ప్రకాశించే నోటిని తెఱచిన అందంలోను, మాటల తీయదనంలోను అభినివేశాన్ని పొందిన మహాబలి మూసలో పోసి కఱగించి మార్చిన బంగారంవలె వేఱొక వ్యక్తిగా మాఱిపోయాడు- అని భావం.

(ఎన్నాల్ తరప్పట్టతు ఎన్టలుమే) - "దత్త మస్యాభయం మయా" (రామా-యుద్ధ-18-34) (నాచే ఈ విభీషణునకు అభయం ఇవ్వబడింది) "అభయం సర్వభూతేభ్యో దదామి" (రామా-యుద్ధ- 18-33) (అని ప్రాణులవల్ల అభయాన్ని ఇస్తున్నాను) అని పల్కిన శ్రీరామునివలె "ముందుగానే ఇచ్చాను'' అని అన్నాడు బలి.

(అత్తుణై క్కణ్) - అసురుడు కావడంవల్ల మనస్సు మాఱిపోవచ్చు- అని ఆ క్షణంలోనే పెరుగుతూ కొలవడానికి ఆరంభించాడు. (స్వామి)

(మిన్నార్ మణిముడి పోయ్ విణ్ తడవ) - వామనబ్రహ్మచారియొక్క రూపం, కిరీటాన్ని ధరించిన, త్రివిక్రముడై ఒక్కక్షణంలో మాఱి, మెఱసింది. వెలుగుతున్న ఆ మణికిరీటం పైన లోకాలన్నీ వ్యాపించింది.

(విణ్ తడవ) - రక్షకుని ఆశ రక్ష్యకోటి పరిమితిని మించినది కావడంవల్ల పరమపదాన్నికూడా వ్యాపించింది- అని చెప్పవచ్చు. "భూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠద్దశాంగులమ్" (పురుషసూ) (భూమిని అంతటిని వ్యాపించి, పైన అనంత యోజనాలు కొలిచాడు.)అని కదా చెప్పబడింది.



పొన్నార్ కనైకழల్కాల్ ఏழులకుమ్పోయ్ క్కడన్దు* అఙ్గు 111

ఒన్నా అశురర్ తుళఙ్గ చ్చెలనీట్టి*

మన్నివ్వకలిడత్తై మావలియై వఞ్జిత్తు* 112

ఆశపడదగిన, అందమైన, శబ్దిస్తున్న వీరకడియాలను అలంకరించుకొన్న శ్రీచరణాలు, ఏழు ఉలకమ్ పోయ్ కడన్దు = పైలోకాలను అన్నిటిని దాటి, అఙ్గు ఒన్నా అశురర్ తుళఙ్గ = ఆ ఏడు లోకాలలో ఉండే (నముచిమొదలైన) శత్రువులైన అసురులు బాధపడేటట్లుగా, శెల నీట్టి =(పైకి) వెళ్ళేటట్లు చాచి, మన్ను ఇ అకల్ ఇడత్తై =నిత్యమై, విశాలమైన ఈ భూమండలాన్ని, మా వలియై వఞ్జిత్తు =

(మేలెడుత్త..... ఏழులకుమ్ పోయ్) - "ముడి పాద మెழ" (తిరువాయ్-7-4-1) అనే రీతిలో పైకి ఎత్తిన శ్రీచరణం కిరీటంతో పోటీ పడుతూ పెరిగింది.

(పొన్నార్ కనైకழల్కాల్) - బంగారంవలె అందఱు ఆశపడతగిన, "భక్తులను రక్షించడంలో నాకు ఎదురు లేదు'' అని పలికే రీతిలో గర్జించే వీరకడియాలను కల శ్రీచరణాలు.

(ఏழులకుమ్ పోయ్ క్కడన్దు) - శ్రీచరణం అండభిత్తినికూడా దాటి పోయాయి.

(అఙ్గు ఒన్నా అశురర్ తుళఙ్గ చ్చెల నీట్టి) - ఏడు లోకాలలో ఉండే నముచి మొదలైన అసురులు "ఏమి ఈ మాయ!'' (ఎన్నితు మాయమ్) (పెరియాழ్. తిరు.-1-88) అనే రీతిలో ఎదిరించి రాగా, వారు "మన్ను నముశియై వానిఱ్చుழற்றియ" (పెరియాళ్.తిరు-1-8-8), "ద్రవంతి దైత్యాః" (విష్ణుధర్మం 43-28) (అసురులు పరుగుతీశారు) అనే రీతిలో భయపడి పరుగు తీసే రీతిలో శ్రీచరణాన్ని చాచి.

(మన్నివ్వకలిడత్తై) - చిరకాలం మహాబలికి చెందిన ఈ లోకాన్ని

(మావలియై వఞ్జిత్తు) - చిన్నపాదాన్ని చాచి యాచించి, పెద్ద పాదంతో కొలువడమనే వంచనను చేసి.

(తన్నులక మాక్కువిత్త) -వామనుడు తనకు, తన భక్తులకు మధ్య భేదం చూడనివాడు కనుక, "వామనన్ ఉలకమ్" అని అంటే ఇంద్రుడు కాదని వాదం

**తన్నులక మాక్కువిత్త తాళానై* - తామరైమేల్**
**మిన్నిడైయాళ్ నాయకనై విణ్ణకరుళ్ పొన్ మలైయై*** **113**

(ఈరీతిలో) మహాబలిని వంచించి, తన్ ఉలకమ్ ఆక్కువిత్త తాళానై = తన లోకంగానే చేసిన శ్రీచరణాలను కలవాడు, తామరైమేల్ మిన్ ఇడైయాళ్ నాయకనై = తామరపూవులో జన్మించినది, మెఱుపువంటి నడుమును కల్గినది అయిన లక్ష్మికి నాయకుడై, విణ్ణకరుళ్ పొన్ మలైయై = తిరువిణ్ణగర్‌లో బంగారుపర్వతంపై

చేసేవాడు కాదు కనుక, **"ఇన్దిరన్ ఉలకమ్"** అని అనకుండా **"తన్నులకమ్"** అని అనబడింది. వాస్తవానికి ఈ లోకం ఇంద్రుని భూమిగాని, మహాబలి భూమిగాని కాదుకదా! **"వామనన్ మణ్"** (తిరువాయ్-4-4-1) కదా ! దానివల్లకూడా **"తన్నులకమ్"** అని పరకాలనాయకి అంటున్నది.

**(తాళానై)** - ఇది అంతా శ్రీచరణం గొప్పతనం. అతనిది కాదు. ఆ శ్రీచరణమహిమను సైతం మడల్‌ను ఎక్కి పాడుచేస్తాను- అని భావం.

"విభవావతారలీలల గొప్పతనాన్ని పాడుచేస్తాను'' అని ఇంతవరకు పల్కిన పరకాలనాయకి, "సౌలభ్యసౌశీల్యాది గుణాలయొక్క పరమావధిలో నిలచి ఉండేవాడు- అనే ప్రసిద్ధిని పొందిన అర్చావతారస్థలాలవద్దకు పోయి, "ఇతడు ఆ కల్యాణగుణాలను కల్గినవాడుగా భావించడం అంతా వట్టి భ్రమ. నిజానికి అతని వద్ద అవి ఏవీ లేవు'' -అని చాటింపు వేస్తాను'' అని అంటున్నది పరకాలనాయకి ఇకపై.

**(తామరైమేల్ మిన్నిడైయాళ్ నాయకనై)** - ఇటువంటి అవతారాలను ఎత్తడానికి కారణం ఆమె (లక్ష్మి) సంబంధం. ఆమె సంబంధంకూడా నిష్ఫలమైపోయింది- అని అంటాను- అనికూడా భావం. ఆమె పట్ల అభినివేశాన్ని పొంది, ఆమె కీర్తిని ప్రశంసించేవాడు- అనికూడా భావం. "ప్రణయిని పక్కలిలే **ముకమ్ పెఱ్ఱు మదిప్పనానవనై"** అని నాయనార్‌వ్యాఖ్య.

**(విణ్ణకరుళ్ పొన్‌మలైయై)** - తిరువిణ్ణకర్ దివ్యదేశంలో ఆమెతో కూడి ఉండడంవల్ల హిరణ్యవర్ణ అయిన ఆమె వర్ణం తనపై ప్రతిఫలించి నీలపర్వతం అయిన తాను బంగారం కొండగా వెలుగుతున్నాడు. **"నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్కరా"** (తైత్తి.నారా) అని అన్నదికదా వేదంకూడా.



**పొన్ని మణి కొழிక్కుమ్ పూఙ్గుడన్దై పోర్ విడైయై***
**తెన్నన్ కుఱుఙ్గుడియుళ్ శెమ్బవళ క్కున్ఱినై*** **114**
**మన్నియ తణ్ శేఱై వళ్ళలై* - మామలర్ మేల్**

వెలిగేవాడై, పొన్ని మణి కొழிక్కుమ్ పూ కుడన్దై పోర్ విడైయై = కావేరీనది రత్నాలను తీసికొని కొట్టుకొని వచ్చే చోటు అయిన తిరుక్కుడన్దైలో, యుద్ధం చేసి అలసిన ఆబోతువలె శయనించి ఉన్నవాడు, తెన్ నన్ కుఱుఙ్గుడియుళ్ శెమ్ పవళ క్కున్ఱినై = దక్షిణదిక్కులో ఉండే విలక్షణమైన తిరుక్కుఱుఙ్గుడిలో ఎఱ్ఱని పగడపు పర్వతంవలె వెలిగేవాడై, తణ్ శేఱై మన్నియ వళ్ళలై = చల్లని తిరుచ్చేఱైలో పొందికగా

**(పొన్ని మణి కొழிక్కుమ్ పూక్కుడన్దై పోర్ విడైయై)** - **"తిశైవిల్ వీశుమ్ శెழுమామణికళ్ శేరుమ్ తిరుక్కుడన్దై"** (తిరువాయ్-5-8-9) అనే రీతిలో కావేరీనది రత్నాలను కొట్టుకొని వచ్చి చేర్చే అందమైన తిరుక్కుడన్దైలో, అవతారాలను ఎత్తి శత్రువులతో పోరాడిన శ్రమ తీరడంకోసం శయనించినవానిని.

**(పోర్ విడైయై)** - ప్రతిపక్షనిరసనాన్ని చేసిన గొప్పతనం స్ఫురించేటట్లుగా శయనించినవాని గౌరవాన్ని పాడుచేస్తాను.

**(తెన్నన్ కుఱుఙ్గుడి)** - దక్షిణదిక్కులో ఉండే, చూచిన చూపును తిప్పుకోలేని రీతిలో గొప్ప అందాన్ని కల తిరుక్కుఱుఙ్గుడి- అని భావం. **"తెన్నన్"** అనేదానిని ఒకే పదంగా గ్రహించి, పాండ్యదేశప్రభువుయొక్క పాలనలోని **"కుఱుఙ్గుడి"** అనికూడా చెప్పవచ్చు.

**(శెమ్బవళక్కున్ఱినై)** - మడల్‌ను ఎక్కి అయినా పొందవలసిన అందాన్ని కలవానిని.

**(తణ్ శేఱై మన్నియ వళ్ళలై)** - మేఘవర్ణునియొక్క సన్నిధానంవల్ల చల్లగా ఉండే తిరుచ్చేఱై దివ్యదేశంలో, ప్రతికూలురైన సంసారుల మధ్యలో భక్తులకోసం తనను వారికి వశం చేసికోవడంద్వారా సత్తను పొందే ఔదార్యాన్ని మెండుగా కల్గినవానిని- అని భావం. **"ప్రతికూలర్‌నడువే ఆశ్రితర్క్కు త్తన్నై క్కొడుత్తు క్కొణ్డిరుక్కిఱ ఔదార్యమ్"** అని పెరియవాచ్చాన్‌పిళ్ళైవ్యాఖ్య. తననే భక్తులకు అనుగ్రహించడం ద్వారా తాను ప్రాణధారణను చేసే పరమోదారుని ఆ ఔదార్యం ఏవిధంగా నిలుస్తుందో చూస్తాను- అంటున్నది పరకాలనాయకి.

అన్నమ్ తుయిలు మణినీర్ వయలాలి* 115

ఎన్నుడైయ ఇన్నముతై వెవ్వుళ్ పెరుమలైయై*
కన్నిమతిళ్ శూழ் కణమజై క్కల్పకత్తై* 116

వేంచేసి ఉండే పరమోదారుడు, మా మలర్ మేల్ అన్నమ్ తుయిలుమ్ అణి నీర్ వయల్ ఆలి ఎన్నుడైయ ఇన్ అముతై = గొప్ప తామరపూవులపై హంసపక్షులు నిద్రించే, అందమైన జలం నిండిన సస్యక్షేత్రాలను కల్గిన తిరువాలి దివ్యక్షేత్రంలో నాకు పరమభోగ్యుడై దర్శనాన్ని అనుగ్రహించేవాడు, ఎవ్వుళ్ పెరు మలైయై = తిరువెవ్వుళ్ అనే దివ్యదేశంలో గొప్పదైన పర్వతం శయనించి ఉన్నట్లు పరుండి ఉన్నవాడు, కన్ని మతిళ్ శూழ் కణ మజై కల్పకత్తై = నూతనమైన కోటలచే

**(మా మలర్మేల్ అన్నమ్ తుయిలుమ్)** - రాజహంసలు, వాటి పెంటిపక్షులు ఒకదానితో ఇంకొకటి ప్రణయకలహం ఆడి, మహాభారతంవలె ప్రణయకలహం జరగాలి- అని భావించి, తామరపూవులోకి ప్రవేశించాయి. అది ప్రణయకలహం మొదలైనవానికి అనువైన విశాలమైన గొప్ప తామరపూవు. కాని, అవి ఆ పూవులోకి ప్రవేశించగానే, మెత్తని పడుక అయిన దాని మార్దవస్వభావంచేత ప్రణయ కలహాదులు వాటి దరికి చేరనందువల్ల, ఆ హంసజంటలు సుఖంగా నిద్రిస్తున్నవి.

**(అణినీర్ వయలాలి)** - అందమైన జలసమృద్ధిని కల తిరువయాలాలి దివ్యక్షేత్రం.

**(ఎన్నుడైయ యిన్నముదై)** - ఈమె (పరకాలనాయకి) జన్మస్థలమై, దివ్యదేశం కనుక, ఈమె మెట్టిన చోటు అయినందువల్ల. యజమానికి చెందే ఫలభాగం సగం, దున్నేవానికి చెందే ఫలభాగం సగం- రెండూ తనకే చెందినవి అయ్యాయి.

**(ఎవ్వుళ్ పెరుమలైయై)** - తిరువెవ్వుళ్ అనే దివ్యదేశంలో తన భోగ్యతను అందఱు అనుభవించినా ముగించడానికి సాధ్యం కాని గొప్ప పర్వతంవలె శయనించి ఉన్నవానిని.

**(కన్ని మతిళ్ శూழ் కణమజై క్కల్పకత్తై)** -నిత్యనూతనమైన కోటలచే చుట్టబడి ఉండే తిరుక్కణ్ణమజై దివ్యదేశంలో. **"ఎనక్కే తన్నై త్తన్ద కల్పకమ్"**



మిన్నై యిరుశుడరై వెళ్ళఱైయుళ్ కల్లఱై మేల్
పొన్నై* మరతకత్తై ప్పుట్కుழியెమ్బోరేఱ్ఱై* 117

చుట్టబడి ఉండే తిరుక్కణ్ణ మజైలో కల్పవృక్షంవలె వేంచేసి ఉన్నవాడు, మిన్నై=మెఱుపువలె వెలుగుతున్న లక్ష్మీదేవిని కలవాడు, ఇరు శుడరై = సూర్యచంద్రులా? -అనే రీతిలో ఉండే శ్రీసుదర్శన-పాంచజన్యాలను కలవాడు, వెళ్ళఱైయుళ్ = తిరువెళ్ళఱై అనే దివ్యదేశంలో, కల్ అఱై మేల్ = రాతితో నిర్మించిన సన్నిధిలో, పొన్నై = బంగారంవలె వెలిగేవాడై, మరతకత్తై = మరతకపచ్చవంటి

అయినవానిని- అని భావం. **"కణ్కళారళవుమ్ నిన్ఱు కణ్ణమజైయుళ్ కణ్డుకొణ్డేన్"** (పెరియ తిరు-7-10-9) అని వీరే (ఈ ఆழ்వార్లే) పలికారు కదా!

**(మదిళ్ శూழ்)** - (ఈ ఆழ்వార్లు మంగళాశాసనపరులు కనుక) మడల్‌ను ఎత్తేటపుడుకూడా స్వామికి కావలి ఉన్నదని సమాశ్వాసాన్ని పొందుతున్నారు. అక్కడ స్వామి వేంచేసి ఉన్నది ఏవిధంగా? అని అంటే,

**(మిన్నై ఇరుశుడరై)** - మెఱుపువంటి, చంద్రసూర్యులవంటి స్వభావాన్ని కలవాడై ఉన్నాడు. పిరాట్టితో, శంఖచక్రాదులతో వేంచేసి ఉండడాన్ని చూచి ఈవిధంగా అంటున్నారనికూడా చెప్పవచ్చు. **"పెరియపిరాట్టియారోడుమ్, ఇరణ్డురుకుమ్ శేర్న్ద ఆழ்వార్కళోడుమాయిరుక్కు నిల్పుతు"** అని నాయనార్ వ్యాఖ్య.

**(వెళ్ళఱైయుళ్ కల్లఱై మేల్ పొన్నై)** - తిరువెళ్ళఱై అనే దివ్యదేశంలో రాతితో చేయబడ్డ కోవెలలో రాతిపై సానబట్టిన బంగారంవలె స్పృహణీయుడై ఉన్నవానిని.

**(కల్లఱై)** - **"మాణిక్క అఱై"** అని నాయనార్ వ్యాఖ్య. ఆழ்వార్ల అభినివేశాన్ని తెలిపే ప్రయోగం ఇది.

**(పొన్నై)** - చాలా గొప్ప సువర్ణాన్ని, మణులను తీసికొని వచ్చి రత్నహారాన్ని కూర్చేవారివలె, అర్చావతారస్థలాలను వరుసగా ఒక దివ్యదేశం తరువాత ఇంకొక దివ్యదేశాన్ని ఆழ்వార్లు కూరుస్తున్నారు. **"శీరియ వస్తువెన్ఱు శేర్క్కిఱార్"** అని పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్య.

**(మరతకత్తై)** - దర్శించేవారి కన్నులను చల్లబఱచే పచ్చని గొప్ప పర్వతం వంటి మేనిని కలవానిని. మధ్యమణిన్యాయంలో ముందు, వెనుక అన్వయించవచ్చు.

మన్ను మరఙ్గత్తెమ్మామణియై* - వల్లవాఴ్

---

రూపాన్ని కలవాడై, పుట్కుఴి ఎమ్బోర్ ఏఱ్ఱై = తిరుప్పుట్కుఴి దివ్యదేశంలో వేంచేసి ఉండే అస్మత్ స్వామి అయిన సమరపుంగవుడై, అరఙ్గత్తు మన్నుమ్ = శ్రీరంగంలో నిత్యవాసాన్ని చేసేవాడై, ఎమ్ మా మణియై = మనం యథేష్ట

---

**(పుట్కుఴి ఎమ్బోరేఱ్ఱై)** - తిరుప్పుట్కుఴి అనే దివ్యదేశంలో శత్రువులు కన్నెత్తి చూడలేని రీతిలో పోరు చేయడానికి ముందు నిలచే వృషభంవలె ఉన్న వానిని.

**(ఎమ్బోరేఱ్ఱై)** - నన్ను జయించినవానిని- అనికూడా భావం.

**(మన్ను మరఙ్గత్తు)** - తొణ్డడిప్పొడియార్‌వంటి భక్తులు, మిగిలిన దివ్యదేశాలను విడచి పెట్టి ఇక్కడకే వచ్చి స్థిరంగా నిలచి ఉన్న శ్రీరంగం. **"అఱ్ఱ పఱ్ఱర్ శుఱ్ఱి వాఴుమ్ అన్దణీర్ అరఙ్గమ్"** (తిరుచ్చంద-52) **"నల్లార్‌కళ్ వాఴుమ్ నళిర్ అరఙ్గనాకణైయాన్"** (నాచ్చి.తిరు. 11-5) అని కీర్తింపబడుతున్నదికదా శ్రీరంగం. **"తిరునాళ్ సేవిక్క వెన్ఱు వన్దు, పిన్బుఴుకుమ్ పిఱకువాళి యఴుకుమ్, కొక్కువాయుమ్, కడైప్పణికూట్టముమ్ ఇరుక్కిఱపడియై క్కణ్డు క్షేత్రసన్న్యాసమ్ పణ్ణి వర్త్తిక్కుమ్బడిక్కు ఈడాక వాయిఱ్ఱు కోయిలిలే కణ్‌వళర్న్దరుళుమ్బడి"** అని నాయనార్‌వ్యాఖ్య. లేక,

**(మన్ను మరఙ్గత్తు)** - శ్రీవైకుంఠం, క్షీరాబ్ధి, ఇంకా మిగిలిన దివ్యదేశాలు మొదలైనవానిలో ఉండకుండా, ఇక్కడకే వచ్చి స్థావరప్రతిష్ఠగా నిద్రించే దేశం- అని కూడా భావం.

**(ఎమ్మా మణియై)** - గొప్ప విలువను కల్గి ఉన్నందువల్ల, కొంగుకు మూట కట్టుకొనే రీతిలోని సౌలభ్యాన్ని కల్గి ఉండడంవల్ల, వర్ణంవల్ల, కాంతివల్ల ఒక మణివలె ఉండే వానిని.

**(అరఙ్గత్తు ఎమ్మామణియై)** - "అఖిలజగత్స్వామి"యై ఉండడం ఒక ఎత్తు అయితే, "అస్మత్స్వామి" యై ఉండడం ఇంకొక ఎత్తు.

**(మామణియై)** - గొప్ప మణిని- అని భావం. నీలమణిగా ఉండేవానిని- అనికూడా భావం. **"కోయిల్ మణియనార్"** (తిరుమాలై-21) అని తొణ్డరడిప్పొడి యాఴ్వార్లు, **"తెణ్ణీర్ పొన్ని తిరైక్కైయాల్ అడి వరుడప్పళ్ళి కొళ్ళుమ్ కరుమణి"**



పిన్నై మణాళనై ప్పేరిల్ పిఱప్పిలియై* 118

తొన్నీర్ కడల్ కిడన్ద తోళా మణిచ్చుడరై*

---

వినియోగం చేసికోదగినట్లుగా నీలమణివంటి వాడై, వల్ల వాఴ్ = తిరువల్లవాఴ్‌లో వేంచేసి ఉండే, పిన్నై మణాళనై = నప్పిన్నైకు నాయకుడై, పేరిల్ పిఱప్పు ఇలియై= తిరుప్పేర్‌నకర్‌లో వేంచేసి ఉండే నిత్యసిద్ధుడై, తొల్ నీర్ కడల్ కిడన్ద = ప్రళకాలంలో జలమయం అయిన సముద్రంలో శయనించినవాడై, తోళా మణి శుడరై = తొలవని

---

(పెరుమాళ్. తిరు-1-1) అని కులశేఖరాఴ్వార్లు, **"అణియార్ పొఴిల్ శూఴ్ అరఙ్గనకరప్పా!.... మణియే! మణి మాణిక్కమే!"** (పెరియ.తిరు-11-8-8) అని మణులలో గొప్పమణి అని తిరుమంగై మన్నన్ అన్నారుకదా!

**(వల్ల వాఴ్ పిన్నై మణాళనై)** - నప్పిన్నై ప్పిరాట్టిని వివాహం చేసికొన్న అందం జయింపబడేటట్లుగా తిరువల్లవాఴ్ దివ్యదేశంలో నిలచి ఉన్నవానిని.

**(పేరిల్ పిఱప్పిలియై)** - దీనికి ముందు భక్తులకోసం ఎన్నో అవతారాలను ఎత్తినా, వాటిని అసత్కల్పాలుగా (సంభవించనివిగా, నిష్ఫలాలుగా) తలచి, వేలకోట్ల అవతారాలు ఎత్తాలి అని ఆశపడుతూ తిరుప్పేర్‌నగర్‌లో శయనించి ఉన్నవానిని.

**(పిఱప్పిలి)** - పరమపురుషుని మనస్సుతో పూర్వం తాను అవతరించిన వానిలో ఏదీ ఉపయోగపడలేదని భావించే స్థితిని ఈ ప్రయోగం తెల్పుతుంది. **"ఇతుక్కు మున్బు పిఱవాతే పిన్బు పిఱక్క ఇరుక్కిఱవనై"** అని పెరియవాచ్చాన్‌పిళ్ళై గంభీరమైన వ్యాఖ్య. నాయనార్‌కూడా- **"ఆశ్రితార్థమాక అనేకావతారఙ్గళై ప్పణ్ణచ్చెయ్‌తే, పిన్నైయుమ్ ఒన్ఱుమ్ శెయ్యాతవనాయ్, పిఱక్క ఒరుప్పట్టిక్కిరుక్కిఱవనై"** అని వ్యాఖ్యానించారు.

**(తొల్ నీర్ కడట్కిడన్ద తోళా మణిచ్చుడరై)** - పరమపదంలో ఉన్న వాడు. నిత్యసూరులందఱు చుట్టూ ఉన్నా, **"స ఏకాకీ న రమేత"** (అతడు పరమాత్మ- ఒంటరివానివలె ఆనందించడం లేదు) అనే రీతిలో ఒంటరివానివలె బాధపడి, చేతనులను సృష్టించి, వారిని ఉజ్జీవింప చేయడంకోసం పాలకడలిలో మొట్టమొదటి అవతారాన్ని -వ్యూహావతారాన్ని- ఎత్తినవాడు. తొలవబడని (రంధ్రం చేయబడని) (అనావిద్ధమైన) రత్నంయొక్క కాంతివలె ప్రకాశం అతిశయంగా కల్గినవాడని భావం.

ఎన్మనత్తు మాలై యిడవెన్దై యీశనై* 119

మన్నుమ్ కడన్మల్లై మాయవనై* - వానవర్తమ్
శెన్ని మణిచ్చుడరై త్తణ్కాల్ తిఱల్ వలియై* 120

---

రత్నంయొక్క కాంతియై ఉన్నవాడై, ఎన్ మనత్తు మాలై = నాపై ప్రేమను కలవాడై, నా మనస్సును విడిచి పోనివాడై, ఇడ వెన్దై ఈశనై= తిరువెడవెన్దైలో వేంచేసి ఉండే సర్వేశ్వరుడై, కడల్ మల్లై మన్నుమ్ మాయవనై = తిరుక్కడల్ మల్లైలో నిత్యవాసాన్ని చేసే ఆశ్చర్యభూతుడై, వానవర్తమ్ శెన్ని మణి శుడరై = నిత్యసూరుల శిరస్సుకు అలంకారంగా వెలిగేవాడై, తణ్ కాల్ తిఱల్ వలియై = తిరుత్తణ్ కాల్లో

---

**(తాల్ నీర్)** - విభవావతారాలనే పైరుకు **"నాఱ్ఱజ్కాల్"** (విత్తనాలను మొలకెత్తించే నాఱుమడి) వలె ఉండే ప్రళయజలం.

**(తోళా మణిచ్చుడరై ఎన్ మనత్తు మాలై)** - నాపట్ల ప్రేమను కల్గి ఉండి, నా మనస్సులోకి వేంచేయగానే గొప్పగా ప్రకాశించేవానిని- అని భావం. క్షీరాబ్ధి మొదలైనవి సర్వేశ్వరునకు సాధనానుష్ఠాన స్థలాలై, బాలావతారాలు, భక్తుల మనస్సే అతనికి ప్రాప్యస్థలంగొప్ప కోవెల **"విశ్వస్యాయతనం మహత్"** (తైత్తి- నారా) (సర్వేశ్వరునకు భక్తుల మనస్సే గొప్ప కోవెల) అని అన్నది ఉపనిషత్తు. **"నెజ్జమే నీళ్ నకరాక ఇరున్ద ఎన్ తజ్జమే !"** (తిరువాయ్-3-8-2) అని ప్రార్థించినవారు (ఆఴ్వార్లు) కూడా ఉన్నారు. దీనికి ఉదాహరణాన్ని చూపుతున్నారు.

**(ఇడవెన్దై ఈశనై)** - "తిరువిడవెన్దై" అనే దివ్యదేశంలో భూదేవిపట్ల కల్గిన ప్రేమచేత గొప్పగా ప్రకాశించేవానిని. భూదేవికి పతి అయినందువల్ల సర్వేశ్వరుడయ్యాడు- అనే విషయం స్ఫురించేటట్లుగా ఉన్నవాడు- అని కూడా భావం.

**(మన్నుమ్ కడల్మల్లై మాయవనై)** - "తిరుక్కడల్ మల్లై"లో తనను విశ్లేషిస్తే భరించలేని ఆదిశేషుని విడచి, "దాసురాలనైన నేను అభిమానించిన చోటు'' అని భూమిపై శయనించి, అందువల్ల ప్రకాశించే ఆశ్చర్యభూతుని. ఈ విధంగా అనాథగా భూతలంపై శయనించినవాడెవడు? అని అంటే,

**(వానవ్తమ్ శెన్ని మణిచ్చుడరై)** - **"అయర్వఱు అమరర్కళ్"** అయిన నిత్యసూరుల శిరస్సుపై వెలుగును జిమ్మే శిరోమణియై ఉండేవాడు. "అమరర్శెన్నిప్పూ" అని భగవానుడు కీర్తింపబడుతున్నాడుకదా!



తన్నై ప్పిఱరఱియా త్తత్తువత్తై ముత్తినై*
అన్నత్తై మీనై యరియై అరుమఱైయై* 121

---

వేంచేసి ఉండే మహాబలశాలియై, తన్నై పిఱర్ అఱియా తత్తువత్తై = (తన కృపకు విషయంకాని) ఇతరులు తెలిసికొనడానికి వీలుకాని స్వరూపాన్ని కలవాడై, ముత్తినై= ముత్యంవంటివాడై, అన్నత్తై = హంసావతారాన్ని ఎత్తినవాడై, మీనై = మత్స్యావతారాన్ని ఎత్తినవాడై, అరియై = హయగ్రీవావతారాన్ని ఎత్తినవాడై, అరు మఱైయై =

---

**(తణ్కాల్ తిఱల్వలియై)** - "తిరుత్తణ్కాల్" అనే దివ్యదేశంలో "వీర్యం, బలం అనే గుణాలు ఒక రూపాన్ని ధరించాయా ! అనే రీతిలో అందఱిని జయించే వీర్యబలాలను కలవాడై ప్రకాశించేవానిని,

**(తన్నై ప్పిఱరఱియా తత్తువత్తై)** - తాను చూపిస్తే తప్ప తనను ఇతరులు తెలియడానికి వీలుకాని రీతిలో ఉండే పరతత్త్వస్వరూపుని. **"యమేవైష వృణుతే తేన లభ్యః"** (ఎవనిని పరమాత్మ వరిస్తున్నాడో అతనిచేతనే పరమాత్మ పొందదగినవాడు) అని అన్నది వేదం. **"నిన్నై యావర్ కాణవల్లర్?"** (తిరుచ్ఛంద-8) అని అన్నారు తిరుమழிశైప్పిరాన్. తాను సౌలభ్య- సౌశీల్యాదులతో తక్కువవాడై ఉండి, ఇతరులకు తన దర్శనాన్ని అనుగ్రహించినా, **"పరం భావ మజానంతః అవజానంతి మాం మూఢాః"** (గీత-9-11) (నా మహిమను తెలియలేక మూఢులు నన్ను అవమానిస్తున్నారు) అనే రీతిలో ఇతని మహిమను తెలియలేని శిశుపాలాది మూర్ఖులు **"కేట్పార్ శెవి శుడు కీழ్మై వశవుకళే వైయుమ్"** అనే రీతిలో నిందించేటట్లున్నవాడు- అనికూడా భావం.

**(ముత్తినై)** - భక్తులు అలంకరించుకొనేటట్లుగా చల్లని, అందమైన, తిరుమేనిని కలవాడు.

**(అన్నత్తై మీనై అరియై)** - బ్రహ్మవేదాలను మధుకైటభుల చేతిలో కోల్పోగా, హయగ్రీవావతారాన్ని ఎత్తి వారిని వధించి, మీనరూపియై వేదాలను అపహరించి, హంసరూపియై వాటిని ఉపదేశించినవాడు. అరి=అశ్వం. ఇక్కడ ఈ పదం హయగ్రీవస్వామిని సూచిస్తుంది. ఈ విధంగా వేదంకోసం పాటు పడడానికి ఏమి కారణం? అని అంటే,

**(అరు మఱైయై)** - సాక్షాత్తు వేదరూపియైనవానిని. **"వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః"** (గీత-15-15) అన్ని వేదాలచేత తెలియబడేవాడను నేనే) అనే రీతిలో

మున్నివ్వులకుణ్డ మూర్త్తియై* - కోవలూర్
మన్ను మిడైకழி యెమ్మాయవనై* పేయలఱ 122

సకలవేదస్వరూపియై, మున్ ఇ ఉలకు ఉణ్డ మూర్త్తియై = పూర్వం ఒకానొక కాలంలో ఈలోకాలను అన్నిటిని ఉదరంలో పెట్టుకొని రక్షించిన స్వామియై, కోవలూర్ = తిరుక్కోవలూర్, ఇడై కழి మన్నుమ్ ఎమ్ మాయవనై = ఇంటి ప్రధానద్వారానికి తరువాత గల భాగంలో (వసారాలో) నిత్యవాసాన్ని చేసే మా శ్రియఃపతియై, పేయ్ అలఱ ములై ఉణ్డ పిళ్ళైయై = పూతన అఱచేటట్లుగా

వేదవేద్యుడైనందువల్ల వేదాలను రక్షించడంకోసం ఇన్ని పాట్లను పడ్డాడు - అని భావం.

**(మున్నివ్వులకుణ్డ మూర్త్తియై)** - ప్రళయకాలంలో ఈ లోకంలోని వారు ఇంకా ఇంకా ఆపదలను తమకు కల్గించుకోకుండా ఉండేటట్లు వీరిని సంహరించి, తన ఉదరంలో పెట్టుకొని రక్షించి, దానివల్ల ప్రకాశించే తిరుమేనిని కలవానిని.

**(మున్)** - ఇతని రక్షకత్వం అనాదిసిద్ధమని భావం.

**(మున్)** - ప్రళయజలంలో జగత్తు బాధపడడానికి ముందే రక్షించాడని కూడా భావం.

**(ఉలకు)** - కనబడే, సత్తను పొందిన పదార్థాలను అన్నిటిని రక్షించాడు.

**(కోవలూర్ మన్నుమ్ ఇడైకழி ఎమ్ మాయవనై)** - **"ఇడైకழி మన్నుమ్'** అని అన్వయించి అర్థాన్ని గ్రహించాలి. భగవానుడు ముదలాழ்వార్లతో సమ్మర్దాన్ని పొందడమే మహానందంగా భావించి నిలచిన చోటు కనుక, వారి పాదచిహ్నాలను అఘ్రాణిస్తూ అక్కడే నిత్యవాసం చేసే ఆశ్చర్యభూతుని.

**(పేయలఱ ప్పిన్నుమ్ ములై యుణ్డ పిళ్ళైయై)** - యశోదాదేవి శ్రీకృష్ణుని స్తుతించి పాడి, స్తన్యాన్ని ఇచ్చింది. కంసునిచే పంపబడ్డ పూతన అనే పిశాచి, విషాన్ని పూసిన స్తన్యాన్ని ఇవ్వబోగా, అతడు పట్టిన పట్టుకు తాళలేక పూతన ఆక్రందించడం ఆరంభించింది. ఆ ఆక్రందననే స్తుతిగేయంగా గ్రహించి, ఆమె స్తన్యాన్ని తాగిన బాల్యాన్ని కలవానిని.



ప్పిన్నుమ్ ములై యుణ్డ పిళ్ళైయై* - అళ్ళల్ వాయ్
అన్నమ్ ఇరై తేరழுన్దూరెழுమ్ శుడరై* 123

తెన్ తిల్లై చ్చిత్తిరకూడత్తు ఎన్ శెల్వనై*
మిన్ని మழை తవழுమ్ వేఙ్గడత్తు ఎమ్ విత్తకనై* 124

ఆమె స్తన్యాన్ని, ఆస్వాదించిన కుఱ్ఱవాడై, అన్నమ్ =హంసలు, అళ్ళల్ వాయ్ = బురద నిండిన చోట్లలో, ఇరై తేర్ అழுన్దూర్ = ఎఱను వెదకే తిరువழுన్దూర్‌లో, ఎழுమ్ శుడరై = వెలిగే జ్యోతియై, తెన్ తిల్లై శిత్తిర కూడత్తు ఎన్ శెల్వనై = దక్షిణదిక్కులో ఉండే తిల్లై తిరుచ్చిత్తిరకూడంలో (వేంచేసి ఉండే) నా సంపద్రూపుడై, మழை= మేఘాలు, మిన్ని = తళతళమని మెఱుస్తూ, తవழுమ్ = దోగాడుతూ వచ్చే, వేఙ్గడత్తు = శ్రీవేంకటాచలంలో(వేంచేసి ఉండే), ఎమ్ విత్తకనై= మనకు

**(అళ్ళల్ వాయ్ అన్నమ్ ఇరై తేర్ అழுన్దూర్)** - కలత పొందింపబడ్డ నీటిలో (మురికిగా ఉండే నీటిలో) ప్రవేశించడానికి వెనుకంజ వేసే హంసలు సైతం ఆశపడి దిగి, తమకు ఎరను వెదకికొనే భోగ్యమైన పంకాన్ని కల్గిన తిరువழுన్దూర్‌లో.

**(అழுన్దూర్ ఎழுమ్ శుడరై)** - భక్తుల చేతిని విడువనివాడై, **"నీశనేన్ నిఱై వొన్ఱుమిలేన్ ఎన్ కణ్ పాశమ్ వైత్త పరమ్ శుడర్ శోతి"** అయినవానిని - అని భావం. అழுన్దూర్‌లో ఉదయించే సూర్యుని- అనికూడా భావం.

**(తెన్ తిల్లై చ్చిత్తిరకూడత్తెన్ శెల్వనై)** - అందమైన తిరుచ్చిత్తిరకూడమనే దివ్యదేశంలో గొప్ప సంపదను కలవాడుగా శయనించినవానిని. సౌందర్యధనాన్ని కలవానిని- అనికూడా భావం.

**(మిన్ని మழை తవழுమ్ వేఙ్గడత్తెన్ విత్తకనై)** - అచేతనమైన మేఘం సైతం తిరుమలలో హారతి ఇచ్చిన తరువాతకూడా తన రూపంలోని చీకటికి చేతిదీపంగా మెఱుపు అనే వెలిగే దీపాన్ని గైకొని, కుంచెకోలతో తీసే ద్వారంద్వారా లోపలకు పోయి తిరువారాధనను చేసే రీతిలో ఉండే ఆశ్చర్యభూతుని- అని భావం. లేక, **"వేఙ్గడత్తు త్తన్నాక త్తిరుమఙ్గై తఙ్గియ శీర్ మార్వఱ్కు"** (నాచ్చి.తిరు- 8-4) **"మిన్నొత్త నుణ్ మరుఙ్గుల్ మెల్లియలై త్తిరుమార్విల్ మన్న త్తాన్ వైత్తుకన్దాన్"** (పెరియతిరు- 6-9-6) **"అలర్మేల్మఙ్గై యుఱై మార్బా!.... తిరువేఙ్గడత్తానే!"** (తిరువాయ్-10-

మన్ననై మాలిరుఞ్జోలైమణాళనై*
కొన్నవిలు మాఴిప్పడైయానై* - కోట్టియూర్ 125

ఆశ్చర్యకరమైన గుణచేష్టితాలను కలవాడై, మన్నవనై = సర్వేశ్వరుడు, మాలిరుమ్ శోలై మణాళనై = తిరుమాలిరుమ్ శోలైమలైలో వేంచేసి ఉండే పెండ్లికొడుకై, కొల్ నవిలుమ్ ఆఴి పడైయానై = శత్రువులను వధించగల శ్రీసుదర్శనాన్ని ఆయుధంగా కలవాడై, కోట్టియూర్ =తిరుక్కోట్టియూర్‌లో, అన్న ఉరువిల్ అరియై = అటువంటి (విలక్షణమైన), తిరుమేనిని కల నరసింహమూర్తియై, తిరు మెయ్యత్తు =

10) అనే రీతిలో హిరణ్యవర్ణ అయిన లక్ష్మీదేవితో కూడిన నల్లని స్వామి తిరుమేనినే "మిన్ని మఴై తవఴుమ్" అని అంటున్నారనికూడా చెప్పవచ్చు. నీలతోయద మధ్యస్థమైన విద్యుల్లేఖ - అని సంస్కృతవేదం, "నీల ముణ్డ మిన్నన్న మేని" అని ద్రావిడవేదం ఈ విషయాన్ని తెలిపాయికదా! ఈ తిరుమేనిని.

**(మన్ననై మాలిరుమ్‌శోలై మణాళనై)** - తిరుమాలిరుమ్‌శోలై దివ్యదేశంలో నాచేతిని పరిగ్రహించినవాడు, లోకానికి అంతటికి ప్రభువుసుమా ! తాను ప్రభువు అనే గర్వంతోనే నన్ను అనాదరించాడు- అని భావం.

**(కొన్నవిలుమ్ ఆఴిప్పడైయానై)** - "నముచి" మొదలైనవారిని వధించాలని ఉద్యమించడంద్వారా వారిని భయపడేటట్లు చేసే చక్రాయుధాన్ని కలవానిని. "ప్రతిపక్షనిరసనత్తు క్కీడాన పరికరత్తై యుడైయవనై' అని నాయనార్‌వ్యాఖ్య.

**(కోట్టియూర్ అన్న వురువిల్ అరియై)** - తిరుక్కోట్టియూర్‌లో అటువంటిది అని మాత్రమే చెప్పే రీతిలో ఉన్న, మాటలకు అందని రూపసౌందర్యాన్ని కల నృసింహమూర్తియై వేంచేసి ఉన్నవానిని.

**(కోట్టియూర్ అరియై)** - హిరణ్యకశిపుని వధించే ఉపాయాన్ని అన్వేషించడం కోసం గోష్ఠిగా చేరిన చోటు కనుక గోష్ఠీపురమైనది. "తిరుక్కోట్టియూర్ నాతనై నరశిఙ్గనై" (పెరియాఴ్వార్ తిరు- 4-4-6) అని అన్నారు పెరియాఴ్వార్లు కూడా.

**(అరియై)** - "తెళ్ళియాఴ్వార్", "కోళరియాఴ్వార్" అనే తిరునామాలతో వేంచేసి ఉండే అద్భుతనరకేసరి రూపాన్ని ఇది సూచిస్తుంది.

**(అన్న వురువిల్ అరియై)** - శ్రీరాముని కీర్తించాలని ఆరంభించి, "మురియుమ్ వెణ్‌తిరై ముదుకయమ్ తీప్పడ ముఴఙ్గఴల్ ఎరియమ్బిన్ వరికొళ్



అన్న వురువిలరియై* తిరుమెయ్యత్తు
ఇన్నముతవెళ్ళత్తై యిన్దళూరన్దణనై* 126
మన్ను మతిట్కచ్చి వేళుక్కై యాళరియై*

తిరుమెయ్యమ్ అనే దివ్యక్షేత్రంలో, ఇన్ అముతమ్ వెళ్ళత్తై = తీయని అమృతసముద్రంవలె భోగ్యమైనవాడై, ఇన్దళూర్ = తిరువిన్దళూర్‌లో, అన్దణనై= పరమకారుణికుడై, మన్ను మతిళ్ =పొందికగా ఉండే కోటలను కల్గిన, కచ్చి = కాంచీనగరంలో, వేళుక్కై అళరియై = వేళుక్కై అనే దివ్యస్థలంలోని దివ్యక్షేత్రంలో నృసింహమూర్తియై, పాడకత్తు మన్నియ ఎమ్ మైన్దనై = తిరుప్పాడకమ్‌లో

వెణ్జై వళైవిత్త మైన్దనుమ్" (పెరియతిరు- 8-5-6) అని అత్యద్భుతంగా కవిత్వాన్ని చెప్పిన వీరికి సైతం వర్ణించడానికి సాధ్యం కాక, "అటువంటిరూపం" అనే రీతిలో వేంచేసి ఉన్నవానిని.

**(తిరుమెయ్యత్తు ఇన్నముతవెళ్ళత్తై)** - తిరుక్కోట్టియూర్‌కు పోయే దారిలో దాహాన్ని పొందినవారికి వారి దాహం తీరేటట్లుగా భోగ్యమైన అమృతసముద్రంవలె ఉండేవానిని.

**(ఇన్నముతమ్)** - ఆ అమృతం తాగితేనే దాహాన్ని తీరుస్తుంది. ఈ అమృతాన్ని తలచినా చాలు, మనస్సు అంతా మధురమై, ఆర్తి ఉపశమిస్తుంది.

**(ఇన్దళూర్ అన్దణనై)** - ఇన్దళూర్‌దివ్యదేశంలో వేంచేసి ఉండే ఆనృశంస్య స్వభావుని. "అన్దణన్"- అందమైన చల్లని స్వభావాన్ని. అంటే - ఆనృశంస్యాన్ని. (జాలిని) కలవాడు. పరిశుద్ధుడు- అనికూడా భావం.

**(మన్నుమ్ మతిట్కచ్చి వేళుక్కై ఆళరియై)** - 'వేళిరుక్కై' అనే పదం వేళుక్కైగా మారింది. వేళ్- మన్మథమన్మథుడు అనదగిన అందాన్ని కలవాడు. ఆళరి- ఆళ్ అరి- నరసింహం. "ఉగ్రం వీరం మహావిష్ణుమ్" అనదగిన వీర్యబలాలను కలవాడైనా, వీర్యగుణం భాసించకుండా అందమే భాసించి, అస్థానే భయశంకను పొంది, భక్తులు మంగళాశాసనం దివ్యదేశంలో వేంచేసి ఉన్న నరసింహుని.

**(మన్నుమ్ మతిళ్)** - "ప్రళయత్తిలుమ్ అఴియాత మతిళ్" -అని నాయనార్ వ్యాఖ్య.

మన్నియ పాడకత్తు ఎమ్మైన్దనై * - వెహికావిల్ 127

ఉన్నియ యోగత్తుఉక్కత్తై* ఊరకత్తుళ్
అన్నవనై యట్టపుయకరత్తెమ్మానేఱ్ఱై* 128

నిత్యవాసాన్నిచేసే మన యువకుడై, వెహికావిల్ = తిరువెహికా లో, ఉన్నియ యోకత్తు ఉఉక్కత్తై = జాగరూకతతోనే యోగనిద్రను చేసేవాడై, ఊరకత్తుళ్ అన్నవనై = తిరువూరకమ్‌లో ఉండే చాలా గొప్పవాడై, అట్ట పుయకరత్తు ఎమ్మాన్ ఏఱ్ఱై = అట్టపుయకరమనే దివ్యదేశంలో ఉండే మా తండ్రికి నాయకుడై, ఎన్నై

(మన్నియ పాడకత్తు ఎమ్మైన్దనై) - తిరుప్పాడకమ్ అనే దివ్యదేశంలో పాండవ దూత, అర్జునునకు దూత్యసారథ్యాలను చేసిన విషయం స్ఫురించేటట్లు నిత్యవాసం చేసేవానిని.

(మన్నియ మైన్దనై) - నిత్యయువకుడై ఉన్నవానిని -అనికూడా భావం.

(వెహికావిల్ ఉన్నియ యోకత్తుఉకత్తై) - తిరువెహికా అనే దివ్యదేశంలో మెలకువ, నిద్రలను పొందేవానిని. అంటే- తిరుమழிశై ప్పిరాన్ "పైన్నాక ప్పాయ్ శురుట్టిక్కొళ్" అని అంటే యోగనిద్రనుండి లేచి, "పైన్నాక ప్పాయ్ విరిత్తుక్కొళ్" అని అంటే పరుండి నిద్రించేవానిని. భక్తులకు పరతంత్రుడై ఉండేవానిని- అని తాత్పర్యం.

(ఉన్నియ యోకత్తుఉక్కత్తై) - ఆశ్రితరక్షణ చింతతో యోగనిద్రను, మెలకువను పొందేవానిని- అనికూడా భావం.

(ఊరకత్తుళ్ అన్నవనై) - "తిరువూరకమ్" అనే దివ్యదేశంలో లోకాలను కొలిచిన త్రివిక్రమరూపాన్ని ధరించి, దీర్ఘదర్శి అయిన తమకు (ఆళ్వార్లకు) కూడా పైకి చూచి మొత్తం దర్శించలేని గొప్ప తిరుమేనితో వేంచేసి ఉన్నవానిని. "అన్నవన్" (అటువంటి వాడు) అని అనడం తప్ప పూర్తిగా దర్శించగలిగే అవకాశం లేదు.

(అట్టపుకయకరత్తెమ్మానేఱ్ఱై) - అష్టభుజక్షేత్రంలో భక్తుడైన గజేంద్రుని కోసం తనను తక్కువ చేసికొని, నడుమున బట్టజారేటట్లు, జుట్టుముడి ఊడిపోయే టట్లు పరుగెత్తి వచ్చి అనుగ్రహించిన తన రూపాన్ని దర్శింపజేస్తూ, గౌరవం స్ఫురించేటట్లు వేంచేసి ఉన్నవానిని.



ఎన్నై మనమ్ కవర్న్ద ఈశనై* వానవర్‌తమ్
మున్నవనై మూழிక్కళత్తు విళక్కినై* 129

మనమ్ కవర్న్ద ఈశనై = నా మనస్సును కొల్లగొట్టిన పూర్ణుడై, వానవర్ తమ్ మున్నవనై= దేవతలకు అనుభవించి పూర్తి చేయడానికి సాధ్యం కానట్లున్నవానిని, మూழி క్కళత్తు విళక్కినై=తిరుమూழிక్కళమ్ దివ్యదేశంలో వెలిగేవాడై, అన్నవనై=

(ఎన్నై మనమ్ కవర్న్ద ఈశనై) - నా మనస్సులోపల ఉన్నదానిని అంతటినీ కొల్లగొట్టి, అందువల్ల తాను పూర్ణత్వాన్ని పొందినట్లు భావించేవానిని. "యస్య సా జనకాత్మజా" ఎన్నుమాపోలే ఎన్నుడైయ నెఞ్జై అపహరిత్తు, అత్తాలే వన్ద మేన్మై తోఱ్ఱ యిరుక్కిఉవనై" అని నాయనార్‌వ్యాఖ్య.

(వానవర్‌తమ్ మున్నవనై) - ఏ కాలంలో అయినా జ్ఞానంలో కొఱత లేని నిత్యసూరులుకూడ అనుభవించి ముగించ లేని రీతిలో అంతు లేని గొప్పతనాన్ని కలవానిని. వేదంకూడా ఆనందవల్లిలో భగవానుని ఆనందగుణాన్నిగూర్చి మెట్టు మెట్టుగా పలికే ప్రతిపర్యాయంలోను "శ్రోత్రియస్యచాకామహ తస్య" అని అంటూ నిత్యముక్తుల ఆనందాన్నిగూర్చి పల్కి, పైపైన పరబ్రహ్మయొక్క ఆనందాన్ని పెంచుతూ పోయి, "యతో వాచో నివర్తంతే" (ఏ పరబ్రహ్మనుండి వాక్కులు వెనుదిరుగుతున్నాయో)- అని ఉద్ఘోషించిందికదా! "పూర్వో యో దేవేభ్యః" (ఎవడు నిత్యసూరులకంటేకూడా పూర్వుడో) అని పురుషసూక్తం అన్నది.

(మూழிక్కళత్తు విళక్కినై) - "తిరుమూழிక్కళమ్" అనే దివ్యదేశంలో అవతరించగానే ముందుకంటే ఎక్కువగా ప్రకాశించేవానిని. "శ్రేయాన్ భవతి జాయమానః" (అవతరించిన తరువాతే గొప్పతనాన్ని పొందుతున్నాడు) అని సంస్కృతవేదం, "పలపిఉప్పాయ్ ఒళివరుమ్ ముழுనలమ్" (తిరువాయ్-1-3-2) అని ద్రావిడవేదం పలికాయి. "వళత్తినై" అనే పాఠానుసారం తిరుమూழிక్కళమ్ దివ్యదేశంలోని సంపదయై ఉండేవానిని- అని భావం.

(అన్నవనై ఆదనూర్ ఆణ్డళక్కుమ్ ఐయనై) -వాక్కుకు అందని అందాన్ని కలవాడుగాను, వర్షం (సంవత్సరంచేత) ఉపలక్షింపబడ్డ కాలాన్ని పరిచ్ఛేదించి, స్వామియై ఉండేవానిని.

(ఆణ్డు అళక్కుమ్) - ప్రాకృతపదార్థాలను కాలం పరిచ్ఛేదిస్తుంది. ఇతడు కాలాన్ని పరిచ్ఛేదిస్తాడు. "కాలం స పచతే" (వి.పు. 5-20-54) (కాలాన్ని అతడు

అన్నవనై యాదనూరాణ్డళక్కుమ్ ఐయనై*
నెన్నలై యిన్ఱైనై నాళైయై* - నీర్మలైమేల్ 130

మన్ను మఱైనాన్గుమానానై* పుల్లాణి
త్తెన్నన్ తమిఴై వడమొఴియై* నాఙ్గూరిల్ 131

ఇటువంటివాడు అని చెప్పడానికి సాధ్యం కానివాడై, ఆదనూర్ = తిరువాద నూర్‌లో, ఆణ్డు అళక్కుమ్ ఐయనై = సకలకాలాలను పరిచ్ఛేదించే స్వామియై, నెన్నలై ఇన్ఱైనై నాళైయై = నిన్న, ఈనాడు, రేపు- అనే మూడు కాలాలకు నిర్వాహకుడై, నీర్ మలై మేల్ మన్నుమ్ = తిరునీర్‌మలైలో వేంచేసి ఉండే, మఱై నాన్గుమ్ ఆనానై = చతుర్వేదస్వరూపియై, పుల్లాణి = తిరుప్పుల్లాణిలో వేంచేసి ఉండే, తెన్నన్ తమిఴై వడ మొఴియై = ద్రావిడభాష, సంస్కృతభాషలతో చెప్పబడేవాడై, నాఙ్గూరిల్ = తిరునాఙ్గూర్‌లో, మణి మాడ క్కోయిల్ మన్ను మణాళనై =

వచనం చేస్తున్నాడు) అని శ్రీవిష్ణుపురాణవచనం. ఏవిధంగా కాలాన్ని పరిచ్ఛేదిస్తాడు? అనే విషయాన్నిగూర్చి ఇకపై తెలుపుతున్నారు.

**(నెన్నలై ఇన్ఱైనై నాళైయై)** - నిన్న, ఈనాడు, రేపు- అనబడే భూతకాల-వర్తమానకాల- భవిష్యత్కాలాలు అనే మూడు విభాగాలను చేసి కాలాన్ని నిర్వహించే వానిని - అని భావం. **"వరుఙ్కాలమ్ నికఴ్కాలమ్ కఴికాలమాయ్ ఉలకై ఒరుఙ్గక అళిప్పాయ్!"** (తిరువాయ్-3-1-5), **"శెన్ఱు శెల్లాతన మున్నిలామ్ కాలమే"** (తిరువాయ్-3-8-9) అని నమ్మాఴ్వార్లు కూడా పలికారు.

**(నీర్‌మలైయై మన్నుమ్ మఱై నాన్గుమ్ ఆనానై)** - తిరునీర్‌మలైపై వేంచేసి ఉన్నవాడై, నిత్యమై, నిర్దుష్టమై వెలిగే చతుర్వేదాలతో చెప్పబడేవానిని.

**(పుల్లాణి త్తెన్నన్ తమిఴై)** - పాండ్యరాజుకు చెందిన తిరుప్పుల్లాణిలో ద్రావిడవేదం అయిన **"కావార్ మడల్ పెణ్ణై"** (పెరియతిరు-9-4), **"తన్నై నైవిక్కిలేన్"** (పెరియతిరు-9-3) అనే తిరుప్పుల్లాణి దశకాలతో కీర్తింపబడినవానిని.

**(తెన్నన్ తమిఴై)** - అగస్త్యుని ద్రావిడభాషచే పాడబడేవానిని- అని కూడా భావం.

**(వడమొఴియై)** - శ్రీరామాయణాది సంస్కృతగ్రంథాలచే ప్రతిపాదింపబడేవానిని. దర్భశయనరాముడుకదా తిరుప్పుల్లాణిలో వేంచేసి ఉన్నాడు.



మన్ను మణిమాడక్కోయిల్ మణాళనై*
నన్నీర్ తలైచ్చఙ్గనాణ్మతియై* - నాన్ వణఙ్గుమ్ 132

కణ్ణనై క్కణ్ణపురత్తానై* తెన్నఱైయూర్
మన్ను మణిమాడక్కోయిల్ మణాళనై* 133

మణిమాడక్కోయిల్ దివ్యదేశంలో స్థిరంగా ఉండే పెండ్లికొడుకై, నల్ నీర్ తలై చ్చఙ్గమ్ నాణ్ మతియై = చక్కని నీటితో పరివేష్ఠితం అయిన తలైచ్చఙ్గనాడులో ఉండే **"నాణ్ మతియై"** స్వామియై, నాన్ వణఙ్గుమ్ కణ్ణనై = నేను నమస్కరించే శ్రీకృష్ణుడై, కణ్ణపురత్తానై = తిరుక్కణ్ణపురంలో వేంచేసి ఉన్నవాడై, తెన్ నఱైయూర్ మణి మాడ క్కోయిల్ మన్ను మణాళనై = తిరునఱైయూర్ మణిమాడమ్ అని

**(నాఙ్గూర్ మన్ను మణిమాడక్కోయిల్ మణాళనై)** - తిరునాంగూర్‌లోని మణిమాడక్కోయిల్‌లో స్థిరంగా ఉండి, నాకు ఇంకొక ఆలంబనం లేని రీతిలో నన్ను వశీకరించుకొన్న పెళ్ళికొడుకును.

**(నన్నీర్ తలైచ్చఙ్గ నాణ్మతియై)** - చక్కని జలపౌష్కల్యాన్ని కల్గిన తలైచ్చఙ్గాడులోని సముద్రంలో పూర్ణిమాతిథినాడు ఉదయించిన చంద్రునివలె, అందంగా ప్రకాశించేవానిని.

**(నాన్ వణఙ్గుమ్ కణ్ణనై క్కణ్ణపురత్తానై)** - **"కణ్ణపుర మొన్ఱుడైయానుక్కు అడియే నొరువర్క్కురియేనో?"** (పెరియతిరు-8-9-3) అని నన్ను అనన్యార్హను చేసి, తిరుక్కణ్ణపురంలో వేంచేసి ఉండే శౌరిరాజన్ అనబడే శ్రీకృష్ణుని.

**(తెన్నఱైయూర్ మన్ను మణిమాడక్కోయిల్ మణాళనై)** - అందమైన తిరునఱైయూర్‌లో ప్రకాశించే మణిమాడక్కోయిల్‌లో నన్ను మడల్‌ను ఎక్కేటట్లుచేసిన పెండ్లి కొడుకును. (రమ్యజామాతను)

**(మణాళనై)**- నాచ్చియార్ కోయిల్ కనుక పిరాట్టియొక్క ఆజ్ఞయే చెల్లుబాటు అవుతున్న, తన ఆజ్ఞ చెల్లని రమ్యజామాతను- అనికూడా భావం.

ఇక, మడల్‌ను ఎత్తేటట్లు చేసిన దివ్యదేశాన్నిగూర్చి పల్కిన తరువాత, వేఱు ఏ దివ్యదేశాన్ని ప్రస్తావించకుండా పరకాల నాయకి తన స్థిరనిశ్చయాన్ని ఇకపై తెల్పుతున్నది.

కన్నవిల్‌తోళ్ కాళైయై క్కణ్డాజ్గు క్కైతొ్ళుతు*
ఎన్నిలైమై యెల్లా మఱివిత్తాల్ ఎమ్బెరుమాన్* 134

ప్రసిద్ధమైన సన్నిధిలో వేంచేసి ఉండే పెండ్లికుమారుడై, కల్ నవిల్ తోళ్ కాళైయై= పర్వతం అని చెప్పదగిన బాహువులను కల యువకుడై, ఆజ్గు కణ్డు కై తొ్ళుతు= ఆ తిరునఱైయూర్‌లో దర్శించి సేవించి, ఎన్ నిలైమై ఎల్లామ్ అఱివిత్తాల్ = నా అవస్థలను అన్నిటిని విన్నపిస్తే, దానిని విని, ఎమ్బెరుమాన్ = ఆ స్వామి, తన్ అరుళుమ్ ఆకముమ్ తారాన్ ఏల్ = తన కృపను, వక్షస్సును నాకు అనుగ్రహించక

**(కన్నవిల్‌తోళ్ కాళైయై)** - ఒక అబలను జయించాను'' అని రాయివలె దృఢంగా ఉండే బాహుబలాన్ని ప్రశంసించుకొన్నవానిని.

**(కాళైయై)** - నన్ను మడల్‌ను ఎక్కేటట్లు చేసిన తన పరువాన్ని పొగడుకొన్నవానిని.

**(కణ్డు)** - "ఎన్ కణ్‌కళిప్ప నోక్కినేన్" అని ప్రారంభించిన రీతిలోనే పూర్తికావడాన్ని చూస్తే తప్ప విడువను.

**(ఆజ్గు క్కైతొ్ళుతు)** - అతనిముందు అతనిని పొందడంకోసం అతనిని సేవించి, అతని స్వరూపాన్ని పాడుచేసి -అని భావం. మడల్‌ను ఎక్కడానికి మొదటి మెట్టు ఇది. రాజపత్ని బిచ్చమెత్తడంవంటిది- ఇతనికి సాధనబుద్ధితో చేయబడే అంజలి. "ఓది నామమ్ కుళిత్తు ఉచ్చితన్నాల్ ఒళిమా మలర్ ప్పాదమ్ నాళుమ్ పణివోమ్" (పెరియ.తిరు- 9-3-9) అని అంటూ ఈ ఆళ్వార్లు, అనంతరం అది అతని మనస్సుకు, మంచినీళ్ళలో పుడక వంటిది అవుతుంది- అనే విషయాన్ని "నమక్కే నలమాదలిల్" (పెరియతిరు-9-3-9) అనే ప్రయోగంలోని ఏకారం ద్వారా తెలిపారు. "తొ్ళుతు మామలర్ నీర్ శుడర్ తూపమ్ కొణ్డు ఎళుతుమ్ ఎణ్ణు మితు మిక్కై యాతలిన్" (తిరువాయ్-9-3-9) అని అన్నారు నమ్మాళ్వార్లు.

**(కణ్డు ఆజ్గు క్కైతొ్ళుతు)** - మడల్‌ను ఎత్తాలని నిశ్చయించుకొన్న నమ్మాళ్వార్లుకూడా "నమ్ కణ్‌కళాల్ కణ్డు తలైయిల్ వణజ్గవుమాజ్గొలో తైయలార్ మున్బే" (తిరువాయ్-5-3-7) అని పలువురి ఎదుట అతని (భగవానుని) స్వరూపాన్ని పాడుచేయాలని ఆశపడ్డారు. శ్రీరామునిపై కోపించిన సీతాదేవి కూడా "తం మమార్థే సుఖం పృచ్ఛ శిరసా చాభివాదయ" (రామా-సుంద-39-



తన్నరుళు మాకముమ్ తారానేల్* - తన్నై నాన్
మిన్నిడైయార్ శేరియిలుమ్ వేతియర్‌కళ్ వాళ్‌విడత్తుమ్* 135

పోతే, తన్నై = ఆ భగవానుని, నాన్ = (అతని కృత్యాలను అన్నిటిని తెలిసిన) నేను, మిన్ ఇడైయార్ శేరియిలుమ్ = స్త్రీలుండే జనసమూహాలలో, వేతియర్‌కళ్ వాళ్‌వు ఇడత్తుమ్ = వైదికులు నివసించే చోట్ల, తన్ అడియార్ మున్బుమ్ =

55) (శ్రీరాముని కుశలాన్ని నాకోసం అడుగు. శిరస్సుతో నమస్కరించు) అని అన్నది.

**(ఎన్ నిలైమై ఎల్లామ్ అఱివిత్తాల్)** - మడల్‌ను ఎక్కేంతవరకు గల నా అన్ని అవస్థలను తెలిపితే- అని భావం. అవి ఏవి? అని అంటే, "తాయే తన్నై" (పెరియతిరు-1-9) అనే దశకంలో "ఉన్నై క్కాణ్బదోర్ ఆశైయినాల్ వన్దడైన్దేన్" (1-9-1) అని దర్శించాలని ఆశపడ్డ రీతి, "ఆకిలుమ్ ఆశై విడాళాల్" (2-7-1) అని తల్లి పలికేటట్లుగా ఆశయే అనువర్తిస్తూ రావడాన్ని, "ఎన్ శిన్దనైక్కినియాయ్!" (3-5-1), "పుకున్దాయై ప్పోకలొట్టేన్" (3-5-6) అని కాళ్ళకు బంధం వేసిన స్థితిని, తరువాత దశకంలో తిరువాలిలో దూత్యాన్ని పంపిన స్థితిని, "ఆయర్ మాతర్‌కొజ్గై పుల్‌కు శెణ్డన్" (4-8-3) అని, "కొజ్గైయొన్నాళ్ పరిశళిన్దాళ్" (4-8-4) అని పార్థన్ పళ్ళిదివ్యదేశంలో తన అతిశయాన్ని కోల్పోవడాన్ని, "ఉమ్మై క్కాణుమ్ ఆశై యెన్నుమ్ కడలిల్ వీళ్న్దు" (4-9-3) అనే రీతిలో చుట్టుపక్కలవారు నిందించేటట్లుగా తిరువిన్దళూర్‌లో ఆశాసముద్రంలో పడిన స్థితిని, "వెకువాతాళ్" (5-5) అనే దశకంలో "వాయ్ వెరువి వేజ్గడమే వేజ్గడమే" అని, "అడియేనై వేణ్డుతియో వేణ్డాయో?" అని, "తాతాడు వనమాలై తారానో?" అని ఆక్రందించిన రీతిని, "శివవిల్ శెజ్గణ్" (7-3) అనే దశకంలో కలలను కన్న రీతిని, "తన్నై కాలిల్" (7-5) అనే దశకంలోని "ఎన్నెమ్బులనుమ్ ఎళిలుమ్ కొణ్డు పొన్నుక్కుళైకళ్ మెలివెయ్‌త" అనే స్థితిని పొందడాన్ని, "తెళ్ళియార్ తేవర్" (8-2) అనే దశకంలో "కణ్ణపుర మొన్డు పేశి యురుకి వాయ్ వెరువిన' రీతిని, "కరై ఎడుత్త" (8-3) అనే దశకంలో వలయాలను పోగొట్టుకొన్న రీతిని, (గాజులను చేజార్చుకొని), "తన్నై కాలిల్" (8-5) అనే దశకంలో మనస్సు స్వామి మాలెపట్లగల ఆశతో "తారినాశైయాల్ పోక ప్పెర్‌ఱు నాళ్కై ఊళియిల్ పెరితాన" రీతిని, "కావార్ మడల్" (9-4) దశకంలో తిరుప్పుల్లాణిలోని స్వామి అసత్యవచనాలను విని మనస్సులో బాధను పొంది, అందమైన వస్త్రంకూడా ఒంటిపై నిలువకుండా ఉండగా, ప్రకాశించే వర్ణాన్ని, వలయాలను పోగొట్టుకొని,

తన్నడియార్ మున్బుమ్ తరణి ముழுతాళుమ్*
కొన్నవిలుమ్ వేల్ వ్వేన్దర్ కూట్టత్తుమ్ నాట్టకత్తుమ్* 136

తన భక్తుల సమక్షంలో, తరణి ముழுతు ఆళుమ్ కొల్ నవిలుమ్ వేల్ వేన్దర్ కూట్టత్తుమ్ = భూమండలం అంతా పాలించేవారై, క్రూరమైన సైన్యాలను కలవారై ఉండే అసురుల సభలలోను, నాడు అకత్తుమ్ = ఇంకా దేశం అంతటా, తన్

నిద్రలేమిని పొందడాన్ని, **"తవళ ఇళమ్ పిఱై" (9-5)** అనే దశకంలో భూశయనాన్ని చేయడాన్ని, **"మూవరిల్ మున్ ముదల్వన్" (9-9)** అనే దశకంలో తిరుమాలిరుమ్ శోలైమలైలో ఆశపడి నిలువలేక పోవడాన్ని, **"తిరుత్తాయ్ శెమ్బోత్తు" (10-10)** అనే దశకంలో శకునాన్ని పరీక్షించిన వైనాన్ని, ఇపుడు మడల్‌ను ఎక్కదలచిన స్థితిని- ఈ విధంగా ఈ నా స్థితులను అన్నిటినీ తెలిపితే.

**(ఎమ్బెరుమాన్)** - నా స్వరూపాన్ని పాడుచేసికొని అయినా పొందవలసిన రీతిలో నాకు అతనికి మధ్య సంబంధం ఉన్నది. అతడు వచ్చేంతవరకు వేచి ఉండడం సాధ్యమా? - అని అంటున్నది పరకాలనాయకి.

**(తన్ అరుళుమ్ ఆకముమ్ తారానేల్)** - ధర్మంకోసం చలువపందిరిని వేసి, చన్నీటిని అందించేవారివలె, స్వప్రయోజనంగా తలచి కరుణ అనే చల్లని నీటిని పోసి, నా వక్షస్సుతో తన వక్షస్సును ఆలింగనం చేసికొని, ప్రాణాన్ని నేను ధరించేటట్లు చేయకపోతే. దీనిని చేయకపోతే ఈ దేహం ప్రాణం నిలువకుండా పోతుంది- అని భావం.

**(తన్నై)** - బయట బెల్లాన్ని పూసినందువల్ల తీయనిదై, వాస్తవానికి, మాధుర్యరహితమైన పేలాలవలె, ఎంతో ప్రేమ ఉన్నవానివలె నటించేవాడు, నిజానికి ప్రేమ కొంచెం అయినా లేని తనను- అని భావం. లేక, మడల్‌ను ఎక్కి అయినా పొందవలసిన మహిమను కల తనను- అని కూడా భావం.

**(నాన్)** - సత్యసంధునివలె నటించే ఆ అసత్యవాదియొక్క అసత్యవచనాలను అన్నిటిని బయటపెట్టబోయే నేను- అని భావం. ఇద్దఱి స్వరూపాన్ని పాడుచేసికొని అయినా అతనిని పొందితే తప్ప విడువను- అని తలచిన నేను- అని కూడా భావం.



తన్నిలైమై యెల్లా మఱివిప్పన్* - తాన్ ముననాళ్
మిన్నిడైయాయ్చ్చియర్తమ్ శేరిక్కళవిన్ కణ్* 137

నిలైమై ఎల్లామ్ అఱివిప్పన్ =అతని స్వభావాలను అన్నిటిని వ్యక్తం చేస్తాను, మునమ్ నాళ్ = పూర్వకాలంలో (శ్రీకృష్ణావతార సమయంలో) మిన్నిడై ఆయ్చ్చియర్‌తమ్ శేరి = మెఱపువలె సూక్ష్మమైన నడుమును కల రేపల్లె గ్రామంలోని, కళవిన్ కణ్=

**(మిన్నిడైయార్ శేరియిలుమ్)** - మొదట, నావలె అతనిపట్ల మనస్సును పార వేసికొన్న కన్యల దగ్గరకు పోయి- "నావద్ద నిన్ను తప్ప ఇంకొకరిని తెలియను- అని పల్కి మఱచిపోయాడు. మీపట్ల ప్రేమను కలవానివలె భావించి, 'మీ మెఱపు వంటి నడుము తప్ప వేఱొకదానిని తెలియను' - అని పల్కిన అతని మాట ఎటువంటిది? అని మీరే గ్రహించండి'' అని అంటాను.

**(మిన్నిడైయార్)** - గోదాదేవి, రాసక్రీడ ఆడిన గోపికలు మొదలైనవారు. వీరి గోష్ఠిలో "అందాన్ని ఆస్వాదించే పరమరసికుడు'' అని కదా పేరును పొందాడు. "నా అందాన్ని అనుభవించిన తీరును గమనించండి'' అని వారితో పల్కి, ఆ పేరును పాడుచేస్తాను- అనికూడా భావం.

**(వేదియర్ వాழ் విడత్తుమ్)** - శ్రుత్యాది ప్రమాణాలతో "ఇతడే పరదేవత'' అని గ్రహించి, ఉపాసనం, యాగం, శరణవరణం, మంగళాశాసనం మొదలైన వానిని చేసే వ్యాస, పరాశర, భట్టనాథులవంటివారు నివసించే చోట్లలోను, "పరమదయాళువు ఇతడు'' అని చాటింపు వేసేవారి సమూహంలోకి పోయి "ఇతనికి కల జాలి (ఆనృశంస్యం) ఏవిధమైనదో చూడండి'' అని నా శరీరాన్ని చూపిస్తాను.

**(తన్నడియార్ మున్బుమ్)** - కల్యాణగుణాలకు జితులై, తాము అతని వశం చేసికొన్న లక్ష్మణుడు, నమ్మాழ்వార్లువంటివారి గుంపులోకి పోయి "ఇతని గుణాలున్న తీరు చూచారా !'' అని అంటాను. **"వేదియర్"** అనే పదం వేదంలో అధికంగా కన్పించే సాధ్యోపాయాలలో ఊనికను కల్గినవారిని, **"తన్ అడియార్"** అనే పదం శ్రీచరణాలను ఆశ్రయించిన సిద్ధోపాయనిష్ఠులను తెల్పుతుందని చెప్పవచ్చు.

**(తరణి ముழுదాళుమ్ కొన్నవిలుమ్ వేల్‌వేన్దర్ కూట్టత్తుమ్)** - ఒక్కొక్క దేశాన్ని పూర్ణంగా ఏలుతున్నందున ప్రభువులని పేరు పొంది, భూమిలో సత్కుల

ప్రసూతత్వాన్ని కల గొప్ప వీరులైన కులశేఖరులు, తొణ్డమాన్‌చక్రవర్తివంటి ప్రభువులు అందఱు రాజాధిరాజు అయిన ఇతని వీర్యాన్ని, రక్షకత్వాన్ని ప్రశంసించారు కదా! వారి సమూహంలోకి పోయి "ఇక్ష్వాకుకులంలో జన్మించిన గొప్ప వీరుడైన ఇతడు అబలనైన నాపట్ల చూపిన వీర్యాన్ని చూడండి. సర్వరక్షకుడైన ఇతడు నన్ను రక్షించిన అందాన్ని చూడండి'' అని పల్కి అతని వీర్యాన్ని, రక్షకత్వాన్ని పాడుచేస్తాను.

**(నాట్టకత్తుమ్)** - ఈ రీతిలో ఏవో నాల్గు అయిదు చోట్లలో పల్కి విడుస్తానా! సర్వేశ్వరుడని ధ్వజాన్ని నాటిన చోట్లకు అంతా వెళ్ళగలను. తన వీర్యగుణాన్ని గూర్చి కీర్తించేవారుండే చోట్లకు అంతటా పోయి చాటింపువేస్తాను.

**(తన్ నిలైమై ఎల్లామ్ అఱివిప్పన్)** - తన దివ్యమంగళరూపాన్ని దర్శింపజేసి, విశ్లేషించి, ఆర్తిని కల్గించి, నేను మడల్‌ను ఎక్కేటట్లు చేసి, అప్పటికీ తన దర్శనాన్ని అనుగ్రహించకుండా నన్ను బాధపెట్టిన రీతులను అన్నిటినీ తెలుపగలను. అతడు నేను ఒకతెనే అక్కరలేదని ఉన్నందువల్ల, నేను లోకం అంతా అతనిని ఒక్కని వద్దు అని అనుకొనేటట్లు చేస్తాను. అతని దుర్గుణాలను చాటింపు వేస్తాను.

ఇక, తమతోపాటు మిగిలిన ఆళ్వార్లు అందఱు **"ఎత్తిఱమ్"** అని వ్యామోహ పడే దివ్యచేష్టితాలను హీనకృత్యాలుగా నిరూపిస్తాను- అని తమ నిశ్చయాన్ని ప్రబంధశేషంద్వారా వ్యక్తీకరిస్తున్నారు.

**(తాన్ ముననాళ్.... పెఱ్ఱిమైయుమ్)** - పూర్వం ఒకనాడు రేపల్లెలో వెన్నను దొంగిలించి రోటికి కట్టుబడి, కట్టువిప్పబడ్డ అతని గొప్పతనాన్ని ఊరంతా తెలిసేటట్లు చేస్తాను.

**(తాన్)** - ఇటువంటి పనిని చేసి "నేను'' అనే గౌరవంతో ఉండడమా !

**(మున నాళ్)** - "చిన్నవయస్సులోనే కదా ఈ పనిలో ప్రవేశించాను. చాలాదినాలు గడచినందువల్ల లోకంలోనివారు మఱచిపోయి ఉంటారు''- అని తలుస్తున్నాడా!

**(మిన్నిడై)** - చౌర్యాన్ని చేసిన తనను పట్టుకోవాలని పరుగెత్తివస్తున్నపుడు గోపికల మెఱుపువంటి సన్నని నడుమును చూడాలనికదా దొంగతనాన్ని చేశాడు.

**(మిన్నిడై ఆయ్‌చ్చియర్‌తమ్)** - తాను దొంగతనం అయితే చేశాడు. నావంటి వీరపురుషుల దగ్గర అయినా, పురుషోత్తముల దగ్గర అయినా దొంగతనాన్ని చేశాడా!- అబలలైన గోపికల దగ్గరకదా చేశాడు.



**తున్ను పడల్ తిఱన్దు పుక్కు* - తయిర్వెణ్ణెయ్**
**తన్వయిఱార విழுఙ్గి* కొழுఙ్గయల్కణ్** 138

దొంగతనంగా, తున్ను పడల్ తిఱత్తు = బిగువుగా కట్టివేసిన (కొబ్బరి ఆకుతో అల్లిన) తలుపును తెఱచి, పుక్కు = ప్రవేశించి, తయిర్ వెణ్ణెయ్ = పెరుగును, వెన్నను, తన్ వయిఱు ఆర తాన్ విழுఙ్గ = తన కడుపు నిండేటట్లు చేతులారా తీసికొని ఆరగించగానే, కొழு కయల్‌కణ్ = చక్కని బేడిసచేపలవంటి కన్నులను

**(ఆయ్‌చ్చిర్‌తమ్‌శేరిక్కళవిన్‌కణ్)** - నావలె, తొమ్మిది పొడుగైన వీథులు, గట్టి కాపలాను కల్గిన వాకిళ్ళను కల నాగపట్టణంలోనా దొంగతనం చేశాడు! గోపకులు, గోపికలు నివసించే, ఏకావలి లేని గుడిసెలను కల రేపల్లెలోకదా దొంగతనం చేశాడు.

**(తున్ను పడల్ తిఱత్తు పుక్కు)** - నావలె (తిరుమంగై ఆళ్వార్లవలె) బుద్ధవిహారంయొక్క విమానాన్ని కుడి ఎడమలకు తిప్పి, మకుటభంగాన్ని చేసి లోపలకు ప్రవేశించి దొంగతనం చేశాడా ! గొల్లలు దట్టంగా ఉండే కొబ్బరి ఆకును తలుపుగా పెట్టి, దానిని మూయడంకోసం దానిపై ఒక కట్టను బిగించి తిప్పుతారు కదా. దీనిని భంగంచేసి లోపలకు పోయికదా శ్రీకృష్ణుడు దొంగతనం చేశాడు.

**(పడల్ తిఱత్తు పుక్కు)** - సాధారణంగా గొల్లలు ద్వారానికి అడ్డుగా నిలిపిన తలుపుపై కర్రను బిగించి, దానిని తిప్పడం కోసం బిగించిన యంత్రాన్ని తెఱవడం కూడా ఇతనికి తెలియదు. ఆ తలుపుకింద దూరి దొంగతనం చేయడమే తెలుసు. అయితే, ఇక్కడ తన ఇల్లు కనుక పలుమార్లు దొంగతనం చేయబోయిన అలవాటు వల్ల తలుపును తెఱవడం అనే ఈ అరుదైన కార్యాన్ని సాధించాడు.

**(తున్ను పడల్ తిఱత్తు పుక్కు)** - బిగువుగా మూసి ఉన్నందువల్ల తెఱచి లోపలకుపోయాడు. తెఱచి ఉంచినట్లయితే మూసి లోపలకు ప్రవేశించి ఉండేవాడు.

**(తయిర్ వెణ్ణెయ్)** - నావలె సువర్ణమయమైన బుద్ధవిగ్రహాన్ని ఎత్తుకొని పోయాడా? సులభమైన పెరుగును, వెన్నునుకదా దొంగిలించాడు.

**(తన్ వయిఱార విழுఙ్గి)** - నావలె పరార్థంకోసం (ఇతరులకోసం, పరమాత్మ కోసం) దొంగతనం చేయలేదు. స్వార్థంగాకదా దొంగిలించాడు.

మన్ను మడవోర్కళ్ పఱ్ఱి యోర్వాన్ కయిఱ్ఱాల్*
పిన్ను మురలోడు కట్టుణ్డ పెఱ్ఱిమైయుమ్* 139
అన్నతోర్ పూతమాయ్ ఆయర్విழவిన్ కణ్*

కల, మన్ను మడవోర్కళ్ = రేపల్లెలోని స్త్రీలు, పఱ్ఱి = పట్టుకొని, ఓర్ వాన్ కయిఱ్ఱినాల్ = ఒక అందమైన దారంతో, ఉరలోడు = రోటితో (కట్టివేయగా), కట్టుణ్డ పెఱ్ఱిమైయుమ్ = బంధింపబడిన అతిశయం, ఆయర్ విழవిన్ కణ్ = గొల్లలు ఇంద్రునకు చేసిన ఆరాధనలో, తున్ను శకడత్తాల్ పుక్క పెరు శోఱ్ఱై =

**(కొழுజ్కుయుక్కుణ్)** - ఈ విధంగా దొంగతనం చేసి దొరకకుండా తిరిగిన వాడు దొరికినందువల్ల కల్గిన ఆనందం గోపికల కళ్ళలో అపుడు భాసించింది.

**(మన్ను మడవోర్కణ్ పఱ్ఱి)** - ఇతడు దొరికినంతనే ఇతని చేతిని వేయిమంది కన్యలు చుట్టుముట్టి పట్టుకొంటారు.

**(ఓర్ వాన్ కయిఱ్ఱినాల్)** - చేతికి అందని అతనివలె కాకుండా, తలచిన వెంటనే చేతికి అందిన ఒక అందమైన దారం. **"కణ్ణినుణ్ శిఱుత్తామ్బు"**(కణ్ణి-1), **"కణ్ణి క్కుఱుజ్కయిఱు"** (పెరియతిరు-5-9-7) అని అనడంవల్ల **"వాన్ కయిఱు"** అంటే పొడుగైన దారం-అని అర్థం కాదు. తుంటరివానిని కట్టదగిన మంచి దారం-అని భావం.

**(పిన్నుమ్ ఉరలోడే కట్టుణ్డ పెఱ్ఱిమైయుమ్)** - కన్యలు ఇతనిని పట్టుకోవడం మాత్రమే కాదు; దానికి మించి అచేతనమైన రోటితో ఇతనిని కట్టి వేశారు. ఆ గొప్పతనాన్ని కూడా ఊరంతా తెలిసేటట్లు పల్కుతాను.

**(కట్టుణ్డ పెఱ్ఱిమైయుమ్)** - ఎవరికీ లభించని ఈ గొప్పతనాన్ని పాపి అయిన నేను అపుడే అక్కడ ఉండి దర్శించలేకపోయానే!- అని భావం. **పెఱ్ఱిమై**- గొప్పతనం. ఇక్కడ విపరీతలక్షణాప్రక్రియలో న్యూనతను లక్షిస్తుంది. ఇంతకు మించి, ఇంకొక పనినిగూర్చి తెల్పుతున్నాను.

**(అన్నతోర్)**-నోరు తెఱచి పలుకరాని, గర్హించదగిన వేషాన్నికదా వేసికొన్నాడు.

**(అన్నతు)** - **"అమ్మే"**, **"అప్పూచ్చి"**, **"ఐయయ్య"**- అని అంటూ ఈ వికారరూపాన్ని చూడడానికి గర్హించి, ముఖాన్ని పక్కకు తిప్పుకొంటున్నారు.



తున్ను శకడత్తాల్ పుక్క పెరుశ్శోఱ్ఱై* 140
మున్నిరున్దు ముఱ్ఱత్తాన్ తుఱ్ఱియ తెఱ్ఱెనవుమ్*

పలుబండ్లతో తీసికొనివచ్చి చేర్చిన గొప్ప అన్నరాశిని, అన్నతు ఓర్ పూతమ్ ఆయ్= నోటితో పల్కడానికి సాధ్యం కాని ఒక గొప్ప భూతరూపాన్ని ధరించి, మున్ ఇరున్దు = కంటిముందే ఉండి, ముఱ్ఱ = మొత్తం, తాన్=తానొక్కడే, తుఱ్ఱియ=

**(పూతమాయ)** - ఇంతటి చాలా అధమమైన భూతవేషాన్ని ధరించే వారుంటారా?

**(ఆయర్విழవిన్ కణ్)** - మిక్కిలి ఆకలిని కల్గిన భూతం కనుక ఆహారం కన్పించిన చోట అంతా తిరుగుతుంది. తనను ఆశ్రయించి ఉండే గొల్లల అన్నాన్ని కూడా తినడానికి ముందుకు వచ్చింది.

**(తున్ను శకడత్తాల్ పుక్క పెరుశ్శోఱ్ఱై)** - బండ్లకొద్దీ తీసికొని వచ్చి రాశిగా పోసిన పర్వతంవంటి ఆహారం అంతటినీ మింగివేసింది కదా! **"అట్టుక్కువి శోఱ్ఱుమ్ పరుప్పతముమ్ తయిర్ వావియుమ్ నెయ్యళఱుమ్"** (పెరియాழ్వార్ తిరు. 3-5-1) అని అన్నట్లు అన్నపర్వతాన్ని, పెరుగు తటాకాన్ని, నేయి గుట్టను ఒకటిగా చేర్చికదా గ్రసించింది.

**(మున్నిరున్దు)** - ఏమి సిగ్గు లేని పని! సిగ్గు, శరం అనేవి ఉంటే ఒక తెరను వేసికొని అయినా మింగి ఉండకూడదా! అది కూడా లేదు. కనుక, అందఱు సాక్షాత్తు చూచేటట్లుగా ఎదురుగానే మింగింది.

**(ముఱ్ఱ త్తాన్ తుఱ్ఱియ)** - ఒక్క ముద్దను అయినా ఎవరికీ పెట్టలేదే ! ఏమి గర్భదారిద్ర్యం!

**(తాన్ తుఱ్ఱియ)** - బంధువులను కలుపుకోకుండా తానేకదా స్వయంగా అంతా భుజించి త్రేన్చాడు.

**(తెఱ్ఱెనవుమ్)** - ఈ విధంగా చేయడంలో కొంచెంకూడా లజ్జ లేదే ! **"తెఱ్ఱెనవుమ్"** - జ్ఞానం, తెలివి. ఇక్కడ ఇది లజ్జా హీనతను సూచిస్తుంది. ఇంతకుమించి ఇంకొక విషయాన్ని తెల్పుతాను వినండి.

**(మన్నర్ పెరుఞ్జవైయుళ్)** - ఎవరూ తెలియని చోటనా ఈ న్యూనతను పొందాడు! జనులంతా కూడి ఉండే గొప్ప సభలోకదా ఇది సంభవించింది.

మన్నర్ పెరుఙ్గవైయుళ్ వాళ్‌వేన్దర్ తూతనాయ్* 141

తన్నై యికళ్లన్దురైప్ప త్తాన్ ముననాళ్ శెన్రతువుమ్*
మన్ను పఱై కఱఙ్గ మఙ్గైయర్‌తమ్ కణ్ కళిప్ప* 142

కొన్నవిలుమ్ కూత్తనాయ్ ప్పేర్‌త్తుమ్ కుడమాడి*

గ్రసించిన, తెన్ఱ్ఱినవుమ్ = సిగ్గులేనితనం, మునమ్ నాళ్ = పూర్వం ఒకానొక సమయంలో, వాళ్ వేన్దర్ తూతన్ ఆయ్ = పాండవులకు దూతయై, తన్నై ఇకళ్లన్దు ఉరైప్ప = (చూచినవారంతా) చాలా తక్కువగా పలికేటట్లుగా, మన్నర్ పెరు శవైయుళ్ శెన్రతువుమ్ = దుర్యోధనాది రాజుల గొప్ప సభకి వెళ్ళడం, మఙ్గైయర్‌తమ్ కణ్ కళిప్ప = గొల్లపడుచుల కన్నులు సంతోషించేటట్లుగా, మన్ను పఱై కఱఙ్గ = నడుములో కట్టుకొన్న డప్పు శబ్దించగా, కొల్ నవిలుమ్ కూత్తన్ ఆయ్ = (కన్యలను

**(వాళ్‌వేన్దర్ తూతనాయ్)** - దూతగా వెడితే వెళ్ళి ఉండవచ్చు. లోకాన్ని పాలించే చక్రవర్తులకు దూతగా వెళ్ళాడా! జీవితంతో పోరాడుతున్న పాండవులకు కదా దూతగా వెళ్ళాడు! ఈ గొప్పతనం ఎవరికి లభిస్తుంది?

**(తన్నై ఇకళ్లన్దురైప్ప)**-“భీష్మద్రోణులను, నన్ను విడచిపెట్టి ఎందుకు నీవు శూద్రుడైన విదురుని అన్నాన్ని తిన్నావు?'' అని దుర్యోధనుడు నిందిస్తూ పలికేటట్లుగా.

**(తాన్)** - ఇటువంటిపనిని చేసినవానికి “నేను” అనే గౌరవం (అహంకారం) ఎందుకోసం ?

**(ముననాళ్ శెన్రతువుమ్)** - ఇది జరిగి చాలా కాలం గడచిపోయింది- అని ఊరకున్నాడా! నాకు నిన్న జరిగినట్లుగా కదా దర్శింపజేశాడు.

ఇంతకుమించి ఈ సంగతిని తెలుపుతున్నాను వినండి.

**(మన్ను పఱై కఱఙ్గ)** - ఈసిగ్గులేని పనికి తోడుగా ఎవరూ రానందువల్ల పిలువడంకోసం డప్పును తన నడుములోనే కట్టుకొన్నాడు.

**(మఙ్గైయర్ తమ్ కణ్ కళిప్ప)** - కన్యలు పొగడే నాట్యాన్ని ఆడాడుకదా! మానాన్ని కల పెద్దలు తలవడానికి కూడా అంగీకరించని పనినికదా చేశాడు.

**(కొన్నవిలుమ్ కూత్తనాయ్)** - నాట్యాన్ని చేసేటపుడు చూచిన కన్యలను చిత్రవధ చేయగల అందాన్ని కలవాడై.



ఎన్నివన్? ఎన్నప్పడుకిన్ఱ ఈడఱవుమ్* 143

తెన్నిలఙ్గై యాట్టి యరక్కర్‌కులప్పావై*
మన్నన్ ఇరావణన్దన్ నల్‌తఙ్గై* - వాళెయిఱ్ఱు 144

వధించే నాట్యాన్ని ఆడేవాడై, పేర్ త్తుమ్= ఇంకా, కుడమ్ ఆడి = కుంభనృత్యాన్ని ఆడి, ఎన్ ఇవన్ ఎన్నప్పడుకిన్ఱ ఈడఱవుమ్ = ఈ రీతిలో కూడా నాట్యం చేసేవాడున్నాడా?- అని అనేటట్లున్న అపకీర్తిని, తెన్ ఇలఙ్గై యాట్టి = దక్షిణ దిక్కులోని లంకకు రాణి, అరక్కర్ కులమ్ పావై = రాక్షసకులంలో పుట్టిన బొమ్మవలె అందమైనది, మన్నన్ ఇరావణన్‌తన్ నల్ తఙ్గై = ప్రభువైన రావణుని

**(పేర్‌త్తుమ్ కుడమాడి)** - అంతకు మించి కుండలను పైకి ఎగురవేసి నాట్యం చేసి.

**(ఎన్నివన్ ఎన్నప్పడుకిన్ఱ ఈడఱవుమ్)**- ఏమి చేయడం? ఈ విధంగా నాట్యం చేసి మనలను చిత్రవధ చేయకుండా ఇతడిపుడు ఈ చోటును విడచిపోడా? అని కన్యలు భావించే రీతిలో ఉండే నైచ్యాన్ని.

ఇంతవరకు చెప్పినవి అన్నీ అటు ఉండనివ్వండి. ఇక, ఈ కాఠిన్యాన్నిగూర్చి వినండి.

**(తెన్నిలఙ్గై యాట్టి)** - ఈమె (శూర్పణఖ)- వలె పుట్టినవారున్నారా?- “రావణుడు లంకకు ప్రభువు'' అని పేరు మాత్రమే. నిజానికి లంకను నడిపినది ఈమేకదా ! లంకైశ్వర్యానికి పెట్టి పుట్టినది ఈమేకదా!

**(అరక్కర్ కులప్పావై)** - రాక్షసకులానికే నిధిగాకదా జన్మించింది.

**(మన్నన్ ఇరావణన్)** - ఆహా! రాజులకు రాజు అయిన అతనివలె బ్రతికిన వారున్నారా?

**(తన్ నల్‌తఙ్గై)** - అతని ప్రాణానికి ప్రాణమై, తోడబుట్టినదికదా!

**(వాళెయిఱ్ఱు)** - ఆమె దంతాల కాంతి ఉన్న తీరు ఏమి ? ఆడది అంటే ఇటువంటి దంతాల అందాన్నికదా కల్గిఉండాలి!

**(తున్ను శుడు శినత్తు)** - ఆమె బాహ్యసౌందర్యం అటు ఉండనివ్వండి. ఆంతరసౌందర్యం ఉన్న తీరు ఏమి? ప్రేమయొక్క స్వభావాన్ని తెలియని ఇతనిపట్ల ఆమె పొందిన కోపం ఆమె మనస్సులోని అందాన్నికదా తెలుపుతున్నది!

తున్ను శుడుశినత్తు చ్చూర్ప్పణకాశోర్వ్యెయ్తి*
పొన్నిఱమ్కొణ్డు పులర్న్దెழுన్ద కామత్తాల్* 145

తన్నై నయన్దాళై త్తాన్ మునిన్దు మూక్కరిన్దు*
మన్నియ తిణ్ణెనవుమ్ వాయ్త్త మలైపోలుమ్* 146

ప్రేమకు లక్ష్యభూతురాలైన చెల్లెలు, వాళ్ ఎయిఱు= ఖడ్గంవంటి (మెఱిసే) దంతాలను కల్గినది, తున్ను శుడు శినత్తు = దహించే కోపాన్ని కల్గినది అయిన, శూర్ప్పణకై = శూర్పణఖ పులర్న్దు = మేని కృశించి, ఎழுన్ద కామత్తాల్ =వృద్ధి చెందిన కామంతో, పొన్ నిఱమ్ కొణ్డు = పాలిపోయి, శోర్వు ఎయ్తి = పరవశమై, తల్లడిల్లి, తన్నై నయన్దాళై=తనను ఆశపడిన, ఆ రాక్షసిపై, తాన్ మునిన్దు = తాను కోపించి, మూక్కు అరిన్దు = ముక్కును కోసి, మన్నియ తిణ్ణెనవుమ్ = స్థిరమైన

**(శోర్ వెయ్తి)** - నావలె ప్రేమతో శరీరంలో బాధను పొందినదికదా !

**(పొన్ నిఱమ్ కొణ్డు)** - ప్రేమ ఈడేఱనందున నావలె ఆమె శరీరంకూడా పాలిపోయింది కదా !

**(పులర్న్దు)** - నావలె మేని శుష్కించి పోయిందికదా !

**(ఎழுన్ద కామత్తాల్)** - సముద్రంకంటే మిక్కిలి గొప్పదై విజృంభించిన ప్రేమవల్ల -అని భావం. ఇతనిపట్ల గాఢమైన ప్రేమను కల్గినందులకు చక్కని బహుమానం పొందిందా !

**(తన్నై నయన్దాళై)** - ఇతనిని ఆశపడడమేసుమా ఈమె చేసిన తప్పు.

**(తాన్ మునిన్దు)** - తనను ఆశపడినవారిని తాను ఆశపడవలసి ఉండగా, ఆ పనిచేయకపోయినా, ఆమెపై కోపపడడం తగినదా ?

**(మూక్కరిన్దు)** - కోపించినా కోపించనీ; ఆమె ముక్కును ఖండించి వేశాడు కదా!

**(మన్నియ తిణ్ణెనవుమ్)** - ఈ కఠినకృత్యానికి పశ్చాత్తాపం అయినా పొందాడా? లేదే. గొప్ప వీరకృత్యాన్ని చేసినవానివలె స్థైర్యంతోకదా ఉన్నాడు. ఇదేనా స్థైర్యం! **"తిణ్ణెనవు"** -స్థైర్యం.

చివరిగా కాఠిన్యంయొక్క శిఖరం అనదగిన విషయాన్నిగూర్చి తెలియ జేస్తాను వినండి.



తన్నికరొన్ఱిల్లా త్తాడకైయై - మామునిక్కా
త్తెన్నులక మేఱ్ఱువిత్త తిణ్డిఱలుమ్* మఱ్ఱివైతాన్ 147

దార్ఢ్యాన్ని కల్గినది, వాయ్త్త మలైపోలుమ్= గొప్ప పర్వతంవంటి ఆకారాన్ని కల్గినది, తన్ నికర్ ఒన్ఱు ఇల్లాత = తనకు సాటి ఏదీ లేనిది అయిన, తాటకైయై = తాటకను, మా మునిక్కా=విశ్వామిత్రముని మాటకోసం, తెన్ ఉలకమ్ ఏఱ్ఱువిత్త = యమ లోకాన్ని పొందించిన, తిణ్ తిఱలుమ్ = మహాబలం, మఱ్ఱు ఇవైతాన్ = ఇటువంటి

**(వాయ్న్ద మలైపోలుమ్)** - ఏమి శరీరాన్ని (తాటక) కల్గి ఉన్నది !

**(తన్నికర్ ఒన్ఱిల్లాత తాటకైయై)** - ఆమెకు సాటి ఎవరైనా ఉన్నారా ?, ఆమె పోయినా భరించి ఉండడానికి !

**(మామునిక్కా)** - "నీవు స్త్రీవధను ఎందుకు చేశావు?'' అని ఒడి పట్టుకొని అడిగితే, "ఒక ముని చెప్పగా చేశాను'' అని అతనిపై (విశ్వామిత్రునిపై) నింద మోపేటట్లుగాకదా తంత్రంతో ఈ కఠినకృత్యాన్ని చేశాడు. "ఈ అర్థాన్ని భట్టర్ చెప్పగా విన్నాను'' అని నంబిళ్ళై అనేవారు'' - అని నాయనార్ వ్యాఖ్యానం.

**(మామునిక్కా)** - ఇతనిని సీతాదేవితో కలపాలని తలచిన గొప్ప తపస్వి అయిన విశ్వామిత్రునిపైకదా ఈ అపనిందను వేశాడు.

**(తెన్నులకమ్ ఏఱ్ఱువిత్త)** - శూర్పణఖను అయినా ఈ లోకంలో బతికేటట్లు విడిచిపెట్టాడు. ఈమెను నేరుగా యమలోకానికే పంపించాడు. ఏమి క్రౌర్యం ?

**(తిణ్ తిఱలుమ్)** - అబలలపట్ల ఉపయోగింపబడ్డ ఇతని బలాన్ని ఏమని పొగడడం!

**(మఱ్ఱివైతాన్ ఉన్ని ఉలవా)** - ఆపద్ధనంవలె ఇంకా నేను అన్వేషించిన ఇతనినిగూర్చిన నైచ్యభాషణాలు తలచి ముగించడం సాధ్యం కాదు. భగవానుని ఆనందగుణాన్నిగూర్చి లెక్కించాలని ఆరంభించి **"యతో వాచో నివర్తంతే"** అని అంటూ వేదం పడిన పాట్లను పడాలి, అంతే. వీటిని గూర్చి పల్కడానికి ఆరంభించిన మాత్రంలోనే అతడు ఆక్రందిస్తూ నా కాలిపై పడతాడు. కనుక, నాకు ఇది ఆపద్ధనం వంటిది.

ఉన్ని యులవా ఉలకఱియ ఊర్వన్ నాన్*
మున్ని ముళైత్తెழுన్దు ఓఙ్గి యొళి పరన్ద* 148
మన్నియ పూమ్ పెణ్ణైమడల్* 149

పెరియతిరుమడల్ ముఱ్ఱిఱ్ఱు
తిరుమఙ్గైయాழ்వార్ తిరువడికళే శరణమ్

---

ఇంకా మిగిలిన కృత్యాలు, ఉన్ని ఉలవా = భావించి పూర్తి కావు, ఉలకు అఱియ= అటువంటి కృత్యాలను అన్నిటిని లోకంలోనివారు తెలిసేటట్లు వ్యక్తంచేసి, నాన్ = పరకాలనాయకి అయిన నేను, మున్ని = ముందు (సమక్షంలో) నిలచి, ముళైత్తు ఎழுన్దు ఓఙ్గి ఒళి పరన్ద మన్నియ పూమ్ పెణ్ణై మడల్ ఊర్వన్ = మొలిచి, పైకి వచ్చి పెరిగి ప్రకాశించే అందమైన మడల్‌ను గ్రహించి, దానిపై అధిరోహిస్తాను (మడల్ ఎక్కుతాను).

---

**(ఉలకఱియ ఊర్వన్ నాన్)** - చేతనులు ఆనే పేరును పొందినవారు అందఱు వీటిని తెలిసేటట్లుగా నేను మడల్‌ను ఎక్కుతాను.

**(మున్ని)** - "మడల్‌ను ఎత్తబోతాను'' అని ముందు నిలచి -అని భావం. ఇక అతడు రావాలని చూడడం సాధ్యం కాదని భావం. ఎటువంటి మడల్ ? - అని అంటే,

**(ముళైత్తు ఎழுన్దు ఓఙ్గి ఒళి పరన్ద మన్నియ పూమ్ పెణ్ణై మడల్)** - మట్టిలో మొలిచి, బాగా ఎత్తుకు ఎదిగి, చాలా ఉన్నతమై వెలిగి ప్రకాశించే స్థిరమైన (నిలకడగా నిలిచే) అందమైన తాటిమట్టను అధిరోహిస్తాను.

**(ఊర్వన్ నాన్.... మడల్)** - నా చేతిలో గొప్ప బ్రహ్మాస్త్రం ఉన్నది. ఇక నాకేమి కొఱత? నాకార్యం ఈడేఱడంలో లోటు లేదు- అని భావం. శ్రీరాముని, సీతాదేవిని కలిపిన విశ్వామిత్ర భగవానునివలె తనను అతనితో కలుపుతుంది. కనుక దీనిని పొగడుతున్నారు. **'పెణ్ణై''** -తాటి.

పెరియతిరుమడల్ -పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానానువాదం సంపూర్ణం



(ఇవి పెరియ తిరుమడల్ చివరలో అనుసంధింపబడే శాఱ్ఱుముఱై పాశురాలు. ఇవి కంబమహాకవిచే రచింపబడ్డాయని ప్రసిద్ధంగా చెప్పబడుతున్నది.)

ఎన్నిలైమై యెల్లా మఱివిత్తాల్ ఎమ్బెరుమాన్
తన్నరుళు మాకముమ్ తారానేల్- పిన్నై ప్పోయ్
ఒణ్డుఱైనీర్ వేలై యులకఱియ ఊర్ వన్ నాన్
వణ్డుఱై పూమ్ పెణ్ణై మడల్

ఎన్ నిలైమై ఎల్లామ్ = నా అవస్థలను అన్నిటిని, అఱివిత్తాల్ = తెలిపిన తరువాత, ఎమ్బెరుమాన్ = నా స్వామి అయిన సర్వేశ్వరుడు, తన్ అరుళుమ్ = తన కృపను, ఆకముమ్ = తన వక్షస్సును, తారాన్ ఏల్ = అనుగ్రహించకపోతే, పిన్నై పోయ్ = ఆ తర్వాత పోయి, ఒణ్ తుఱై నీర్ వేలై ఉలకు అఱియ = వెలుగును పొందికగా కల్గిన రేవులను కల్గిన నీటి సమృద్ధిని కల సముద్రంచే పరివేష్టితం అయిన ఈ భూమిలోని జనులు తెలిసేటట్లుగా, నాన్ = నేను, వణ్డు ఉఱై పూమ్ పెణ్ణై మడల్ ఊర్వన్ = తుమ్మెదలు ధ్వనించే అందమైన తాటిమట్టను అధిరోహిస్తాను.

అవ : శిఱియతిరుమడల్ ప్రబంధంలోవలె, ఈపెరియ తిరుమడల్‌లో కూడా పరకాలనాయకియొక్క పాశురంగానే కంబమహామహాకవి రచించిన ఈ పాశురం చివరలో అనుసంధింపబడుతున్నది. కంబమహాకవికి తిరుమఙ్గై యాழ்వార్‌పట్ల గల భక్తిని ఈ పాశురాలు తెలుపుతున్నవి.

వ్యాఖ్య : **(ఎన్నిలైమై.... తారానేల్)** - ఈ రెండు పాదాలు పెరియ తిరుమడల్‌లో (134,135) రెండు పాదాలుగా ఉన్నాయి. అక్కడి వివరణాన్ని గమనించవచ్చు. కంబరామాయణంలో కూడా పలు పాశురాలు తిరుమఙ్గైయాழ்వార్ల పాశురాలతో శబ్దతః, అర్థతః సామ్యాన్ని కల్గి ఉండడాన్ని గమనించవచ్చు.

**(పిన్నై ప్పోయ్)** - అతడు చేయవలసినదానిని చేయకపోతే, నేను చేయకూడనిదానిని చేస్తాను, నేనుండే చోటకు అతడు రావలసి ఉండగా, అతడుండే చోటికి నేనే పోతాను.

**(ఒణ్డుఱైనీర్ వేలై ఉలకఱియ)** - కాంతిని పొందికగా కల్గిన తీర్థాలను (రేవులను) కల్గినది, నీటిని సమృద్ధిగా కల్గినది అయిన సముద్రం చుట్టి ఉండే ఈ భూమిలోని జనులు తెలిసేటట్లుగా.

**(ఒణ్డుఱై)** - ముత్యాలు, పగడాలు చెదఱిపడి ఉన్నందువల్ల ప్రకాశాన్ని కల్గినది.

**(ఉలకు)** - లోకంలోనివారు. ఉన్నతులు -అనికూడా అర్థం.

**(ఊర్వన్ నాన్.... మడల్)** - తుమ్మెదలు ధ్వనించే అందమైన తాటిమట్టను అధిరోహిస్తాను.



**వేఱొక శాత్తుఱు (ముగింపు) పాశురం. ఇది అనుసంధానంలో లేదు.**

**మణ్ణిల్ పొడి ప్పూశి వణ్డిరైక్కుమ్ పూచ్చూడి**
**పెణ్ణై మడల్ పిడిత్తు ప్పిన్నే- అణ్ణల్**
**తిరునఱైయూర్ నిన్ఱపిరాన్ తేర్ పోకుమ్ వీది**
**పోరు మఱైయాయ్ చ్చెల్వమ్ పొలిన్దు**

మణ్ణిల్ పొడి పూశి = భూమిలోని ధూళిరేణువులను పూసికొని, వణ్డు ఇరైక్కుమ్ పూ శూడి = తుమ్మెదలు ధ్వనించేపూలను అలంకరించుకొని, పెణ్ణై మడల్ పిడిత్తు = తాటిమట్టను పట్టుకొని, పిన్నే = దానికి పిమ్మట, అణ్ణల్ = స్వామియై, తిరు నఱైయూర్ నిన్ఱ పిరాన్ = తిరునఱైయూర్‌లో వేంచేసి ఉండే ఉపకారకునియొక్క, తేర్ పోకుమ్ వీది = రథం పోయే వీథిలో, శెల్వమ్ పొలిన్దు= సంపద నిండి, పారుమ్ = పొంగి పొర్లేటట్లు, అఱైవాయ్ = అఱు. (ఘోషించు)

అవ : ఈ పాశురంలో మడల్‌ను ఎత్తేటపుడు తమ వేషం ఉన్న తీరును, మడల్‌ను ఎత్తినందువల్ల వచ్చే ఫలాన్ని తెల్పుతున్నారు.

వ్యాఖ్య : **(మణ్ణిల్ పొడి ప్పూశి)** - అతడు ఆదరించని ఈ ఒంటిపై అనాదరం స్ఫురించేటట్లుగా ధూళిని పూసికొని,

**(వణ్డిరైక్కుమ్ పూచ్చూడి)** - "మలరిట్టు నామ్ ముడియోమ్" అనే స్థితి పోయి పూలు అలంకరించుకొని వస్తున్నది; స్వప్రవృత్తిలో అన్వయాన్ని కల్గి ఉన్నందువల్ల.

**(పెణ్ణై మడల్ పిడిత్తు)** - తాటిమట్టను చేతబట్టి.

**(పిన్నే)** - దానికి పిమ్మట.



**(అఱైయాయ్)** - అతని కృత్యాలను అందఱు తెలిసేటట్లుగా ఘోషించు. అయితే, ఎక్కడ ఘోషించడం ? అని అంటే,

**(అణ్ణల్... వీతి)** - స్వామియై, తిరునఱైయూర్‌లో వేంచేసి ఉండే ఉపకారకుని తేరు పోయే రాజవీథిలో అఱు. దీనివల్ల ఏమి లాభం ? అని అంటే,

**(శెల్వమ్ పొలిన్దు)** - నీవు ఘోషించిన మఱుక్షణమే కైంకర్యసంపద నిండి ప్రకాశిస్తావు. నీ కంఠధ్వని చెవిన పడగానే మహావేగంతో వచ్చి కైంకర్యలక్ష్మిని స్వామి అనుగ్రహిస్తాడు.

**(తేర్ పోకుమ్ వీది అఱైవాయ్)** - ఈనాటికీ తిరుత్తేర్ ఉత్సవంనాడు పెరియ తిరుమడల్ ప్రబంధాన్ని సేవించడం ఈ పాశురాన్ని అనుసరించియే- అని తోస్తున్నది.

